

వడ్డాదివారి ముఖచిత్రం ముచ్చటగా ముద్దులొలికేటట్లుంది. 'సినిమాక్విజ్' 'యువ' అభిమానులకు కాసేపు మెదడుకు మేత. జూన్ నెల 'యువ'లో సౌభాగ్యవతి గారి 'రవ్వలు నవ్వులు' అనే కథ చాలా బాగుంది. మిగిలినవీకూడ బాగానే ఉన్నాయి. [illegible] కూడా కొదువలేని ఈ 'యువ' కనీసం, పక్ష పత్రికగానైనా రూపొందిస్తే మరింత బాగుంటుందని ఎడిటర్‌గారికి నా మనః

పంతగిరి వెంకటేశ్వరరావు
భీమవరం.

వడ్డాది పాపయ్యగారు చిత్రించిన ముఖచిత్రం ఎంతో ముచ్చటగా నున్నది చక్రనేమి సీరియల్ అద్భుతం. ముఖ్యంగా చెప్పుకోదగ్గదేమంటే పణతుల రామచంద్రయ్య వ్రాసిన "తప్పులేని తమ్ముడు" చదువుతున్నంతకాలం నిజంగా ఎవ్వరికైన కన్నీళ్ళు రాక తప్పదు ఇటువంటి కథలే ఎక్కువ ప్రచురింపాలని ఆశించుచున్నాము

యస్. సత్యనారాయణ

జూన్ సంచిక ముఖచిత్రం నాట్య భంగిమ చాలా ఆకర్షణీయంగా వుంది చక్రనేమి సీరియల్ రసవత్తరంగానే వుంది రచయిత్రి కౌసల్యాదేవిని అభి నందించని పాఠకుడు ఉండడంటే అతిశయోక్తి లేదు

నల్లా దత్తాత్రేయులు,
మోరి

యువను 1-00 ఇచ్చి కొన్నా కష్ట మనిపించదు సత్యంగారి కార్టూనులు కడుపుబ్బ నవ్విస్తున్నాయి డుంబు బొమ్మలకథకు పూర్వంలాగ రంగులు వేయించప్రార్థన ముఖచిత్రం పేరు ప్రతి సంచికలోను వేయప్రార్థన కొత్త పోటీ శీర్షిక త్వరలో ప్రవేశపెడతారని ఆశిస్తున్నాను

వేమూరి సూర్యప్రకాశరావు,
ఉమ్మలాడ

జూన్ నెల సంచికలో ప్రచురించిన 'కథలాటి జీవితం' చాలా ఉదాత్తంగా, గంభీరంగా వున్నది. 'సుభా' గారికి నా అభినందనలు సంచికలో ఇతర నూతన కళాకారుల చిత్రాలనుకూడా ప్రచురించితే బాగుంటుంది

వి రమణరావు
సర్వత్రనగర్

రోజూ తొడిగే దుస్తులు

# సన్‌లైట్ వల్ల

## ఎంత తెలుపో ఎంత కాంతియో




సొగసుగాను, శుభ్రంగాను, మరియు తెల్లగాను, కాంతిగాను,
వుంటవి  మీ బట్టలను వుతికే సన్‌లైట్ గుణం అదే!
మీ బట్టలన్నిటినీ ఇంట్లో సన్‌లైట్‌తో వుతుక్కోండి.

సన్‌లైట్ ఉత్తమ నురగనిచ్చే శుద్ధమైన సబ్బు

32A-X29 TL

హిందుస్తాన్ లీవర్ ఉత్పత్తి

# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 8 జూలై 1963 సంచిక 1

నదీజలాల పంపకం విషయంలో, మనకు కొంతఅన్యాయం జరిగినా, ఏదో విధంగా, యీ తగాదా పరిష్కారం అయిందని సంతోషించాము. మనకు వచ్చిన దానితోనే తృప్తిపడి, మన ప్రాజెక్టులను పూర్తిచేసుకుందాం అని నిశ్చయించుకున్నాము. కాని, మన పొరుగురాష్ట్రాలైన మహారాష్ట్ర, మైసూర్‌లకు, మనం స్వల్పంతోనైనా తృప్తిపడడం కిట్టకుండావుంది.

కృష్ణా, గోదావరి జలాల పంపకంవిషయంలో కేంద్రప్రభుత్వం చేసిన నిర్ణయాన్ని మళ్ళీ సవరించమని, మహారాష్ట్ర, మైసూరు ప్రభుత్వాలు ఒత్తిడి చేస్తున్నాయి. ఈ ఒత్తిడికి లొంగిపోయి, తన నిర్ణయాన్ని తిరిగి పరిశీలించి, మహారాష్ట్ర, మైసూరులకు తృప్తికరంగా మార్పుచేయడానికి కేంద్రప్రభుత్వం నిశ్చయించిందని వార్తలు వస్తున్నాయి. కేంద్రప్రభుత్వం యీ విధంగా ఆంధ్రదేశానికి అన్యాయం తలపెడుతుందని తెలిసిన ఆంధ్ర ప్రజలు విస్తుపోకమానరు.

కృష్ణా జలాలలో ఎక్కువ వాటాను కోరుతున్న మహారాష్ట్ర, యీ జలాలద్వారా కోయినా విద్యుత్ కేంద్రాన్ని అభివృద్ధిచేసుకోవాలని ప్రయత్నిస్తున్నది. కోయినా స్కీముకు ఎక్కువ నీళ్ళు యిస్తే, ఆ నీళ్ళు కోయినానుంచి అరేబియన్ సముద్రం

లోకి మళ్ళించవలసిందేకాని వాటిని మరొకవిధంగా ఉపయోగించడానికి వీలులేదు. మహారాష్ట్రలో అనేక పరిశ్రమలు ఉన్నాయి. వాటికి విద్యుచ్ఛక్తి అపరిమితంగా కావాలి. అందుచేతనే, కోట్ల రూపాయల వ్యయంతో ఎటామిక్ విద్యుత్కేంద్రాన్ని కూడా మహారాష్ట్రలో స్థాపించారు. ఇక్కడ ఉత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తి, కోయినాలో ఉత్పత్తిఅయే విద్యుచ్ఛక్తికూడా మహారాష్ట్రకు చాలదు. ఏమంటే, ఇంకా ఎక్కువ పరిశ్రమలను స్థాపించడానికి మహారాష్ట్ర ప్రభుత్వం పూనుకున్నది. కాని, పరిశ్రమలకు ఇంకా ఎక్కువ విద్యుచ్ఛక్తి కావాలి కనుక కృష్ణాజలాలలో ఎక్కువ వాటా ఇమ్మంటే, పారిశ్రామికంగా వెనుకపడిన ఆంధ్రదేశంమాట ఏమిటని ప్రశ్న రావచ్చును. అంచేత, కృష్ణాజలాలలో ఎక్కువ వాటా యిస్తే, ఆ జలాలను వినియోగించి, మెరకభూములలో ప్రత్తిని ఎక్కువగా పండించి, ఆ ప్రత్తిని విదేశాలకు ఎక్కువగా పంపించి, విదేశాలలో మారకద్రవ్యాన్ని ఎక్కువగా సంపాదించవచ్చునని మంచి తెలివిగల ఎత్తువేసింది, మహారాష్ట్ర ప్రభుత్వం.

ఈ ఎత్తులలో మైసూరు, మహారాష్ట్రల ఆశయం ఒకటే. నదీజలాలలో ఎక్కువ వాటానుపొంది, ఆ జలాలతో ఎక్కువ విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసుకోవడమేకాక, ఎక్కువ భూమిలో ఆహారధాన్యాలను, ఇతరపంటలను పండించుకొని, అన్నివిధాలా తమ రాష్ట్రాలను స్వయంసమృద్ధములుగా చేసుకుందామని. ఇలా చేసుకోవడంలో, ఆంధ్రప్రదేశ్ నక్కలపాలు అయినా వారికి బెడదఏమీలేదు.

మహారాష్ట్రలో ఇప్పుడు ఎక్కువగా ప్రత్తిపంటను పండించవలసిన అవసరం ఏమీ మన దేశానికి లేదు. ప్రస్తుతం, మన దేశంలో పండుతున్న ప్రత్తిలోనే, మన అవసరాలకుపోగా, కొంత ప్రత్తిని విదేశాలకు ఎగుమతి చేస్తున్నాము. కాని, మన దేశంలోపండే ఆహారధాన్యాల పంట మనకు చాలక, ఏడాదికి నూరుకోట్ల రూపాయలకుమించిన విలువతో ఆహారధాన్యాలను మనం విదేశాలనుంచి దిగుమతి చేసుకుంటున్నాము. నాగార్జునసాగర్ పూర్తిఅయి, ఆ నీళ్ళతో మనం పండించే ఆహార పదార్థాలు మనకు సరిపోతే, మనం విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోనక్కరలేదు. ఏడాదికి నూరుకోట్ల రూపాయలకన్న ఎక్కువగానే మనం విదేశాలకు యిచ్చేడబ్బును మిగుల్చుకోగలం. అయితే, యీ ఆహారధాన్యాలు

ఆంధ్రదేశంలో పండుతవి గనుక, ఆంధ్రదేశపు రైతులు బాగుపడతారు. రైతుల చేతిలో డబ్బు బాగావుంటే, రాష్ట్రంలో కొత్తపరిశ్రమలను స్థాపించడానికి పెట్టుబడి లభిస్తుంది. దానివల్ల, ఆంధ్రదేశం పారిశ్రామికంగాకూడా ముందుకువచ్చే అవకాశం వుంది. పదేళ్ళకుగానియ్యండి, నూరేళ్ళకుగానియ్యండి, ఆంధ్రదేశంలో పంటలు పుష్కలంగా పండి, పరిశ్రమలు ఎక్కువగా ఏర్పడి రాష్ట్రం సంపన్నమైతే, ఇరుగుపొరుగు రాష్ట్రాలు బాధపడవలసిందేనా?

ఆహారధాన్యాల పంటను ఎక్కువచేసుకొని, ఏడాదికి నూరుకోట్లపైగా మనం విదేశాలకు ఇస్తున్న డబ్బును మిగుల్చుకోవడం ఉత్తమమా? లేక, ఆ డబ్బును విదేశాలకు ఇస్తూనే, మహారాష్ట్రలో ప్రత్తిని ఎక్కువ పండించి, దానిని ఎగుమతి చేసి ఏ పాతికకోట్ల రూపాయలనో సంపాదించడం ఉత్తమమా? యావద్భారతదేశం దృష్టితో చూస్తే మొదటిమార్గమే ఉత్తమం. కాని, మహారాష్ట్ర దృష్టితో చూస్తే మాత్రం, రెండవమార్గమే ఉత్తమం. కేంద్రప్రభుత్వం మహారాష్ట్ర దృష్టితో పని చేస్తుందా, అఖిలభారతదృష్టితో పనిచేస్తుందా అనేదే ప్రశ్నం.

కేంద్రప్రభుత్వ పరిశ్రమలలో నూటికి 80 వంతులు మహారాష్ట్ర, మైసూరు రాష్ట్రాలలోనే వున్నవి. అవికాక, స్థానికంగా ఏర్పడిన అనేక పరిశ్రమలు యీ రెండురాష్ట్రాలలోను వున్నవి. పారిశ్రామికంగా, అత్యంత అభివృద్ధికివచ్చిన రాష్ట్రాలు మైసూరు, మహారాష్ట్ర, గుజరాత్, పశ్చిమబెంగాల్ అయితే, ఎక్కువగా వెనుకబడిన రాష్ట్రాలు ఆంధ్ర, ఒరిస్సా, మధ్యప్రదేశ్, రాజస్థాన్. ఈ రాష్ట్రాలుకూడా బాగుపడడానికి అవకాశం కల్పించవలసిన కేంద్రప్రభుత్వం పరిశ్రమల విషయంలో అలా చెయ్యకపోగా, ఆహారధాన్యాల ఉత్పత్తిలో యీ రాష్ట్రాలు సాధించుకుంటున్న ఫలితాలనుకూడా భగ్నపరచే సూచనలకు ఆమోదించే పద్ధతిలో ప్రవర్తించడం, చాలా అన్యాయం.

నాలుగునెలలనాడు కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన నిర్ణయాన్ని సవరించమని ఇప్పుడు మహారాష్ట్ర, మైసూరు కోరితే, దానికి ఆమోదించి, ఆంధ్ర, మహారాష్ట్ర, మైసూరు రాష్ట్రాల ముఖ్యమంత్రులను దీనికోసమని సమావేశానికి పిలవబూనడం, కేంద్రప్రభుత్వం చెయ్యవలసిన పనికాదు. ఇలాచేస్తే, కేంద్రప్రభుత్వ నిర్ణయాల పట్ల గౌరవం వుంటుందా?'







7. బొమ్మలకే ప్రాణాలొస్తే...




దున్నపోతులా ఉన్నావ్ అడుక్కుని తినకపోతే ఏదైనా పనిచేసుకో కూడదూ అంటాం నువ్వు పెట్టకపోతే పోయావ్ మాటుకుకూడా ఎందుకయ్యా అని ఈసడించడం కూడా ఉంటుంది అప్పుడప్పుడు. మధూకరం చక్కని వృత్తి పెట్టుబడి అక్కరలేదు శ్రమపడి చెమటోడ్చనక్కరలేదు తుమ్మెద పూవుపూవు మీదా వాలి తేనెను ఎలా గ్రహిస్తుందో ఇంటింటా ఒక కవళంచొప్పున గ్రహించినపదార్థం తాను తినగా తోడివాళ్ళకి పదిమందికి పెట్టవచ్చు బుజాన్ని జోలె చేతిలో నున్నగాతోమిన చెంబు పట్టుకుని తిన్నగా సావట్లోకేవచ్చి సీతారామాభ్యన్నమః అని హెచ్చరించి భిక్షం స్వీకరించి ఆశీర్వదించి వెళ్ళడం ఒక సంప్రదాయం మన ఊళ్ళల్లో ఏరోజునైనా బ్రాహ్మడు రాకపోతే గృహస్థులుకూడా చాలా బాధపడుతూండడం రివాజే పాపం వీధిలో అరుస్తున్నాడు ఒకముద్ద పడెయ్యమ్మా అనడంపరిపాటి సామాన్య గృహస్థుల ఇళ్ళల్లో మాధవకవళం వాడికి ప్రత్యేకం తీస దాచిపెట్టడం కూడా కద్దుకదా ! మన దేశంలో అడుక్కోవడం నీచమైనపనికాదే బిచ్చగాడు రాకపోతే బాధపడేవాళ్ళూ ఉన్నారు బిచ్చంఎత్తడం అరవై నాలుగు కళలలోనూ ఒకటిగా భావించేవారూ ఉన్నారు “తిరిపెముగ కిద్దరాండ్రా అన్నాడుకవి బిచ్చగాడికేం ? ఇద్దరు పెండ్లాలు కాకపోతే పదిమందినిపెట్టుకున్నా లోటువుండదు A beggar s no loser అన్నాడు

అసలు ఈ వృత్తిలో ఎన్నో అంతస్తులుకదా ! స్వాములవారు ఊళ్ళోదిగారంటే జమీందారైతే తప్ప సామాన్యులు స్వాముల్ని భిక్షకు

పిలవలేరే. ఊరంతా చందాలువేసుకుని స్వామికి భిక్ష పెట్టాలి. అంటే నేతిగారెలూ, ఆవుపాల క్షీరాన్నం, నాలుగుకూరలూ, మూడు పచ్చళ్ళతో తమరేకాక శిష్యులూ పరివారం, గుఱ్ఱాలూ, ఏనుగులూ లొటిపిట్టలతోసహా భిక్ష స్వీకరిస్తారు. ఇది హైయెస్టుక్లాసుముష్టి. ఇంక నియోగంముష్టి అనేది అందరికీ తెలిసిందేకదా.

ఒక బ్రాహ్మడూ, ఒక నియోగీ, ఒక దొరవారూ అడుక్కో-డానికి బయలుదేరారట. బ్రాహ్మడు సీతారామాభ్యాన్నమః అంటూ సావట్లోకివెళ్ళి ముష్టి అడిగాడు. ఆ ఇల్లాలు అతనికి ముష్టిపెడుతూంటే "చూడమ్మా ఇక్కడ నేనూ ఉన్నా"నన్నాడుట నియోగి ఆయన. "అ చేత్తోనే ఇక్కడకూడా తగలెయ్యి" అని దొరగారు వీధిలోనిలబడి మీసాలు సవరించుకున్నాడట. ఇవిగాక జబర్దస్తీయాచన ఒకటి ఉంది. అధికార్లు చేస్తూంటారు సాధారణంగా, ఏదోఘనకార్యం చేయడానికి చందాలు వసూలుచేయడం ఉద్యోగస్తులకు పరిపాటే. బెనిఫిట్ షోలకు టిక్కెట్లు అంటగట్టడం, సన్మానాలకీ సభలకీ విరాళాలు సేకరించడం, ఇవికూడా అడుక్కోవడం లాంటివే అయినా హోదాగలమనిషి వస్తే లేదనలేంకదా! వీధిలో అడుక్కునేవాడికి ఒక చిన్నపైసా ఇవ్వాలని ఉంటే పడెయ్యొచ్చు. కాని దేశోద్ధారకులూ సంఘసంస్కారులూ యాచనకి వచ్చారంటే వాళ్ళని వదిలించుకోడం కంటె కష్టం ఉందా?

మరేమీలేదు. హైదరాబాదు సికిందరాబాదు జంట నగరాలలో అడుక్కునేవాళ్లు లేకుండాచేయడానికి ఆక్టులు పేస్ చేస్తారట. బెగ్గర్ హోమ్సు నడుపుతారట. అయితే అందులోకి బలవంతంగా నెట్టాలే గాని ఇచ్ఛికంగా ఎవడూవెళ్ళడు. వెళ్ళాలంటే ఇదివరకు సత్రాలు లేవూ? ఊరికేఆక్టులు ప్యాస్ చేసినంతమాత్రాన పని జరుగుతుందా? చూస్తున్నాంగదా మద్యపాన నిషేధం ఆక్టు అమలుజరగడం! అలా కాకుండా తీవ్రచర్యలు తీసుకుంటే సంఘానికి చాలా ఉపకారం చేసిన వారవుతారు ప్రభుత్వం. 



— రూర్కేలా ఉక్కు ర్మాగా లోని భాగాలు

ఒకమిలియన్ టన్నుల ముడిఉక్కు వుత్పత్తిచేసే దుకు దాదాపు రె డు మిలియన్ టన్నులబొగ్గు ఐదులక్షలటన్నుల ఖనిజపురాయి మరో ఐదులక్షలటన్నుల డోలమైట్ మా గనీస్‌లాంటి మిశ్రమ పదార్థాలు కావల్సివుంటై. ఉక్కు కర్మాగారంలో ప్రధానమైనవి నాలు భాగాలు బొగ్గును కోకుగా మార్చుట బ్లాస్టుఫర్నేస్‌లో ముడియినుము దుక్కయినుముగా చేయట ఉక్కు బొగు మొదలైనవాటితో మిశ్రమము తయారు చేయుట. మనకు కావలసిన పమాణాలో పోతపోసేందుకు రోలి గ్ మిల్లు

— భిలాయ్ ఉక్కు కర్మాగారంలోని కోక్‌కొలిమి



దుర్గాపూర్ ఉక్కు కర్మాగారంలోని ఒక భాగం



మన సైనికులు సర్వసన్నద్ధులై వుండేందుకు జమ్మూ కాశ్మీర్ ప్రాంతంలో భారీ ఎత్తున జరిగిన సైనిక విన్యాసం మే 20వ తేదీతో ముగిసింది. రక్షణశాఖా మంత్రి ై బి. చావన్, ప్రధాన దళాధిపతి జె. యన్. చౌదరి ఈ విన్యాసాన్ని ,చారు మన సైనికులు నదిని దాటడం క్రింది చిత్రంలో చూడవచ్చు





— రిస్కా ట్రెయినింగ్ శిబిరంలో భ గ్రా నృత్య ప్రదర్శిస్తున్న శిక్షితులు

జాతీయ క్రమశిక్షణా పథకం బాలబాలికలను శారీరకంగానూ మానసిక గానూ పెంపొ దించటానికి వాటిని దేశపురోభివృద్ధికి వినియోగించుటకై ఉద్దేశింపబడింది

— స్కూలులోని పిల్లలు భ గ్రా నృత్య క్రమశిక్షణతో నేర్చుకోవడ చూడనగును



# వేసంగి రేయి

## చీకటి

నక్షత్రాల రజతజ్వాల రగిలినరేయి
జాజిపూల మల్లెపూల చల్లనిరేల
నక్షత్రాల రక్తజ్వాల రగిలినవేళ.
మోవిని మంచు మంటలు
వ్రేళుల కొనల అనల శిఖలు
నెత్తురులో ఊపిరిలో విసపునాల్కల బుసలు, కాట్లు.
సెజ్జకాదిది పాడెకాని,
మండుతున్నది శవంకాని, ప్రాణికాని
ప్రణయ మరణ వేదనలో రక్కసి కసితో పెనగే
విలులిత పలలశకలయుగళ చరమానల సంస్కారం
కట్టకడపటి సకారం.
నక్షత్రాల రజతజ్వాల రగిలినరేయి
తెల్లచీర, మల్లెపూలు, వెల్లువలా పడుచుగుండియ
కాని గుండియ నెత్తుటిముద్ద - వలపువేలుపు ఆటల పూలచెండు
మెత్తని పట్టుదిండు కాదు.
దానిపైన ప్రథమ రాత్రుల మధురస్వప్నగాథల
జిలుగులల్లిక కానరాదు.
మక్కువ రక్కెసముండ్లపొదల జిక్కి పొగులుతుంది, పొక్కుతుంది
అది నెత్తురు క్రక్కుతుంది.
గుండియ వసివల్చిన నెత్తుటిముద్ద.

'బైరాగి'

ఆక్సిజన్ గుడారంలో
చావుబ్రతుకుల పడుగుపేకలల్లిన కామాలో
అనుభవాల ముండ్లతీగెలు, జ్ఞాపకాల మందుగనులు
వేయికనుల కావలివాండ్రు కాచినచోట
సంజ్ఞా శరణార్థులు నీడల నక్కినచోట
అదృష్టపు పెండులం ఆశానిరాశల మధ్య ఊగేవేళ
వేటగాని చేతికి చిక్కిన పిట్ట
పిల్లగాని సూది గ్రుచ్చిన తూనీగ
గుండియ వలవల్చిన నెత్తుటిముద్ద.

ఆకలిగొన్న జెబ్బులి చీకటిరేయి
నరనరాల వధిరవాంఛా రుధిరజ్వాల
నెత్తురు చవిచూచిన పులి కబళిస్తుంది
నెత్తురు చెమరినకలలు, గరళంచెమరిన శిలలు దేహాలు
పల్లెలు పులిమ్రింగని జ్ఞాపకాల తునకలు. తెల్లని ఎముకలు.
తనను తానే కబళిస్తోంది ఆకలిగొన్న రేయి
మానవ హృదయంలాగే.

## వెన్నెల

వెన్నెలల విచ్చుకత్తులు తళతళమనురేయి
గాయపడిన గాలిలోన దాయరాని కూయి
మాయావిని ఉపవనాన విరియు విసపుపూలు
విషకన్యక మోవి కురియు ముద్దుల మురిపాలు
పాలవెలుగు సాలెవలను దాగి పిలచు చావు
ఈరేతిరి నన్నువిడచి వెడలిపోకు నీవు
పోతే తిరిగిరావు.

ఈ వెన్నెలవెల్లకవల ఏ ముందని నీకు
అంతచేటు ఆరాటం, నన్నువిడచిపోకు
వెన్నెలలకుబుసము విడచి ధగధగమనురేయి
బుసలువిడచు గాలిలోన పొగులు పగలకూయి.
గందపు మ్రానులను పెనచు నాగులమైతావి
త్రాచుల ముద్దులవిరిసిన సంపగిపూతావి
మణిమండిత ఫణముచాచి ఆడుతోంది చావు.
ఈ రేతిరి నన్నువిడచి వెడలిపోకు నీవు
పోతే తిరిగిరావు.

నా కౌగిలివీడి నేడు పోనివ్వను నేను
మచ్చికతో పచ్చికనై నిన్ను కప్పుతాను
నీచూపులమేర మింటిలో మిన్నౌతాను.
అరికాళుల నిమురు మంటిలో మన్నౌతాను.
నీ ఊపిరిలో మెదలే ఊపిరినౌతాను
నేటిరేయి నాకెడమై పోనివ్వను నేను.
తెలివెన్నెల మొగిలిపొదల మిన్నాగై చావు
ఈ రేతిరి నన్నువిడచి వెడలిపోకు నీవు
పోతే తిరిగిరావు.





"అరే. ఎందుకురా ? మొగుడువిడిచిన ఆడదాని ముఖం పెట్టావు ?''

"హి హి హీ ; హి హి హీ !"

ప్రక్కనే నడచిపోతున్న. పార్వతి చెవుల్లో యీ మాటలు పడ్డాయి. అసలు పడాలనే ఆ విద్యార్థు లన్నది కూడా ! ఇదేం పార్వతికి కొత్తగాదు. ఏడాది నుంచి యీ ఊళ్ళోఉంటున్నా వాళ్ళు అనక మానరు, తనకు వినక తప్పదు ! తను వచ్చిన వారందినాలకే తన పుట్టు పూర్వోత్తరాలన్నీ సమగ్రంగా సంపాదించారు విద్యార్థులు ! అప్పటినుంచీ తను దారిన పోతూంటేచాలు, నలుపైపుల నుంచీ యిలాంటి 'కామెంట్లు' కోకొల్లలు! అసలు నేటి విద్యార్థులే అంత ! దారిన తలవంచుకుపోయే ఆడదాన్ని వెక్కిరించడమే చదువుల్లోని సారమని వాళ్ళ అమూల్యాభిప్రాయం !

వచ్చిన కొత్తలో...

సాయంత్రం 5 గంటలకు స్కూలు నుండి నీరసంగా నడిచి వస్తున్నది. మగ పిల్లలహాస్టలు కెదురుగా ఒక గుంపు నిలబడిఉంది. పార్వతి దగ్గరకు రాగానే గుసగుస లెక్కువయ్యాయి.

"స్కూల్లో టీచరురా."

"బియ్యేట."

"మొగుడు విడిచాడుట. అసలు న్యాయశాస్త్ర మొప్పకొన్న మొగుడేనా ?''

"హి హి హీ !''

"ఒక కూతు రుందిట. వైజాగ్‌లో ఎం.బి.బి యస్. వెలగబెడుతున్నదట."

''అరే! నువ్వు చూడలా! మొన్న, సీతారామరాజు బుఱ్ఱకథకి అమ్మా కూతుళ్లు వచ్చారు.''

"వాళ్ళకేమిరా నాయనా! తెగిన గాలి పటాలు!"

నవ్వులు...ఈ నవ్వుల్లో అన్ని గొంతుకలు శృతికల్పాయి.

పార్వతికి యిది ఒకనాటి కథ గాదు. ఒకనాడు ప్రారంభించి, ప్రతి రోజూ జరిగే కథ. తనను మొగుడు విడిచాడు! తనకు ఒక అందమైన కూతురుంది, కూతురూ, తానూ తెగిన గాలిపటాలు. నిత్యం వినబడే మాటల సారాంశం అంతే!

పార్వతి అంటే ఆడా, మొగా అందరికీ కుతూహలం. "ఎవరీమె? ఎవరీ వెనక అండలేని ఆడది? మొగాడు విసరిన వలలో సులభంగా పడ్డ శలభం?" ఈ ప్రశ్నలు పార్వతిని గురించి డొంక తిరుగుడుగా వస్తాయి. పార్వతి సూటిగానే జవాబు చెప్పనంటుంది!

దారంట చకచకా పోతున్న పార్వతికి ఎందుకో ఒకానొక పుర ప్రముఖుడు యిచ్చిన గంభీరోపన్యాసం జ్ఞాపకానికి రాసాగింది. "స్త్రీ దేశానికి వెన్నెముక. ఎక్కడ స్త్రీ అవమానింప బడుతుందో, అక్కడ భగవంతు డుండడు. స్త్రీ మగవాడి చేతుల్లో కీలుబొమ్మగా వున్నంత వరకు యీ దేశం బాగుపడదు. ఏనాడు స్త్రీ తనకాళ్ళపై తాను నిలబడుతుందో ఆనాడే మన జాతికి విముక్తి!"

తన కామశాంతికై ఎంతోమంది స్త్రీల జీవితాల్లో నిప్పులు చెరగిన దుర్మార్గుడి నోటినుండి స్త్రీపై సానుభూతి వాక్యాలు!

కాని —

తన కాళ్ళమీద నిలబడగల్గిన పార్వతిని చూస్తే వీళ్ళకి పరిహాసం! ఆడవాళ్ళయితే యింకా! నలుగురితో పాటు పేరంటానిక్కూడా పిలవరు ఒకవేళ పిలిచినా పార్వతి పోదు. వాళ్ళ చూపులతూపులను ఎదుర్కొనే శక్తి లేదు! పేరంటాళ్ళంతా తనవైపు బోనులో నిలబడిన ముద్దాయివైపు చూసినట్లు చూస్తారు! ఇంతకూ తాను చేసిన నేర మేమిటి?

పార్వతి అడుగులు వాటంతట అవే వేగం తగ్గించుకొన్నాయి. నెమ్మదిగా పోతూ ఆమె గతాన్ని నెమరువేయ సాగింది.

తను ఒంటరిగా...లో నివసిస్తున్నప్పుడు, తనగది కెదురు గదిలో నే ఉండేవా డతను అప్పటికి తను కన్యే ఉద్యోగాభిలాషతో, తలిదండ్రులనుకూడా ఎదిరించి ఒంటరిగా ఉండటానికి సాహసించింది. యువకుడూ, యువతీ ఎదురు బొదురుగా! అతని ఆకర్షణాజాలంలో పడి చేపలాగ తన్నుకొంది! మధురమైన అతని మాటల పరిమళంలో తను స్మృతే

కోల్పోయింది. పరవశంతో మూసుకు పోయినకళ్ళతో వాడి పిరికిహృదయాన్ని చూడలేకపోయింది. అసలు వాడు మోసం చేస్తాడన్న ఊహే లేకపో యింది. ఏం తక్కువ తనకు! రూపం, విద్య గుణం, కొద్దిగా ధనం అన్నీ ఉన్న తనవంటి అమ్మాయి వధువుగా లభించటమే ఒక అదృష్టం! అలా నమ్మే, అతనికి తన సర్వస్వాన్నీ దోచి యిచ్చింది. అప్పట్లో తనకు రోజూ శరద్రాత్రే! జీవితం నిత్య వసంతమే! జీవిత మాధురిని తనివిదీరా అనుభవిం చింది. వాడెంత నీచుడైనా, యీ విష యంలో వాడికి కృతజ్ఞత తప్పక తెల్పాలి. ఎడారిలాంటి తన జీవితంలో ఆ మధుర స్మృతి "ఒయాసిస్" లా గా మెరుస్తుంది! ఆ అనుభవం జీవనవిష భాండంలో ఒకేఒక అమృత బిందువు!

తను తండ్రి కాబోతున్న వార్త విన కుండానే పరారయ్యాడు వాడు. గర్భవతి అని తెలియగానే అంతా గుసగుసలు పోయారు. అవును! తను పతిత! కాలు జారిన ఆడది! భ్రూణ హత్యకు ఒప్పుకో లేదని, అమ్మా నాన్నా కూడా తన్ను వదిలివేశారు. పాపానికి ఒడిగట్టనందుకు వీళ్ళంతా తనపై కక్ష వహించారు.

అప్పటినుంచీ తనను చూస్తే వీళ్ళకు అలుసు! తనను బాగా వ్యక్తిగతంగా తెలిసిన మొగాళ్ళకు కూడా! కన్ను గీటితే చాలు, వచ్చి ఒళ్ళో వ్రాలుతుందని వీళ్ళ నమ్మకం! తను ఎంత నీతిగా బ్రతికినా అలుసే! అసలు యీ భయాలూ, దిగుళ్ళ తోటే తను త్వరగా ముసలిదైంది. జారి పోయిన యౌవ్వనాన్ని చూచి సంతో షించిన ఆడది తానొక్కతేనేమో!

ఆలోచనలతో నడుస్తున్న పార్వతికి కారు హారన్ వినిపించింది. ఉలికిపడి తొలగిచూచింది. రంగురంగుల సీతా కోకచిలకలా అలంకరించుకొని కల్పలతా, వెంట ఒక పెద్ద ఆఫీసరూ! కల్పలత వ్యవహారం అంతా అందరికీ తెలిసిందే మేడిపండు వాటం ఆమె భర్త ఆమెను అపనిందలనే బాణాల నుంచి కాపాడడానికి ఏర్పడిన ప్రత్యేక కవచం! అంతే ఆయనపని. ఈ విడ తెల్లవార్లూ యింకో మొగాడితో షికార్లు.

పుట్ట తవ్వితే ఎన్నో పాములు పడ గలు విప్పుతాయి పార్వతి మనసులో ఇంకో సంఘటన మెదిలింది.

ఒకనాడు జనార్ధనరావు అంగడికి చీరలు కొనటానికి వెళ్ళింది వాడు తనకు యింటర్లో క్లాస్ మేట్. చెడదిరిగి రోగాలు తెచ్చుకొన్నాడు. వాడికీ తన్ను చూస్తే అలుసే! "ఏం కావాలో చూడ వోయి" అని గుమాస్తాకు పురమా యించి, కిళ్ళీ నములుతూ చెత్తనవల నొందాన్ని చదువుతూ కూర్చున్నాడు ఇంతలోనే బిలబిలలాడుతూ, కల్పలతా, జయలక్ష్మీ, వరదసుందరీ వచ్చారు అంతా ఒకప్పుడు తన స్నేహితురాండ్రు.

ఇప్పుడు ఆ ఫీసర్ల భార్యలు. ఇహ జనార్దనరావు హడావిడి చూడాలి! వాళ్ళ అడుగులకు మడుగులొత్తడం తరవాయి. వాళ్ళేమో చీరల బేరం సాకు పెట్టి మాటల్లోనే తమతెలివంతా ఒలకబోస్తు న్నారు. మధ్యన జనార్దనరావూ, వాడి సిబ్బందీ యికిలింపులూ! అసహ్యంవేసి చరచర బయటకొచ్చింది తను.

"సమాజంలో గౌరవనీయలను చూస్తే అసూయా?" తనకుతానే ప్రశ్నించుకొంది పార్వతి.

కల్పలతా, జయలక్ష్మి, వరద సుందరీ, వీళ్ళలాగే అలంకరించుకొని తిరిగే మరికొంతమంది భద్రమహిళలూ పార్వతి మనస్సులో మెదిలారు. భర్తల పేర్లనుంచి వాళ్ళను విడదీస్తే, భర్తల హోదాలనుంచి వాళ్ళను విడదీస్తే, వాళ్లు ఉత్త దిష్టిబొమ్మలే! 'భర్త' భరించేవాడి దన్ను ఏర్పడేటప్పటికి, వాళ్ళకు ఎక్కడ లేని మర్యాద!

సన్నగా నవ్వుకొంది పార్వతి. భారతదేశంలోని పాఠకులందరూ శరత్ సృష్టించిన స్త్రీని చూసి కన్నీరు గార్చారు. వీళ్ళంతా కల్పనా చిత్రాలచేత మాత్రమే కదలింపబడుతారు. ఊహా జీవితాలపైనే వీళ్ళకు ఆశక్తి. ఒకవేళ ఆ పాత్ర ప్రాణం పోసుకొని ఎదట నిలబడితే నవ్వి పరిహసిస్తారు! అవును! ఇదే మనిషిలో సహజ ప్రవృత్తి! చేదు నిజాన్ని మానవుడు భరించలేడు! కల్పననే ప్రేమిస్తాడు!

గబగబ అడుగులు వేసింది పార్వతి ఇల్లు కనిపిస్తున్నది. అదుగో సుధ ఎదురుచూస్తూ నిలుచున్నది. సుధ భాద్రపదాకాశము లాంటి తన జీవితంలో వెలిగే ఏకైక తార!

"ఏమండీ పార్వతమ్మగారూ మిమ్మల్ని మార్చారటగా!" సుంక రత్నమ్మగారు.

"అవునండీ! రాజమండ్రి మార్చారు." జవాబిచ్చింది పార్వతి.

"అబ్బో! చాలా దూరమేనే! పాపం ఉద్యోగం చేస్తున్నాక యివన్నీ తప్పవు కదండీ!"

నవ్వి, ముందుకు సాగింది పార్వతి. పర్సు తెరచి ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ మరో సారి చూసుకొన్నది. ఒక చిన్న అను మానం తట్టింది పార్వతికి. సుంకురత్నమ్మ విచారించేది తను దూరంగా పోతు న్నందుకా! లేక రోజూ వస్తూ పోతూ ఉన్నప్పుడు నోరు తెరచుకొని తన్ను చూడటానికి ఉండదని దుగ్ధా!

తలెత్తి చూసింది పార్వతి. సుధ నవ్వుతూ ముందు నిల్చుని ఉంది. "ఏమి టమ్మా! మరీ పరధ్యానంగా నడుస్తు న్నావు?'' అంటూ చేతిలోని పుస్తకా లనూ పర్సునూ తీసుకొంది. పార్వతి కాళ్ళూ చేతులూ కడుగుకొని వచ్చేప్పటికి సుధ కాఫీ తెచ్చింది.

కాఫీ త్రాగుతూ యిల్లంతా కలయ జూసింది. సుధ సద్దుతున్నది కాబోలు,

పుస్తకాలన్నీ కట్టలు కట్టి ఉన్నాయి. ఎల్లుండితో తనకూ యీ యింటికీ ఋణం తీరిపోతుంది. వదులుతున్నందుకు దుఃఖమూ లేదూ, సంతోషమూ లేదు; గుండెకు గాయాలు తాకి తాకి, గుండె చుట్టూ ఆవరించిన పల్చని 'పెరికార్డియం' దున్నపోతు చర్మంలా మొద్దబారి పోయింది.

సుధ తల్లి ప్రక్కనే కూర్చొని స్నేహంతో తడిసిన చూపులను తల్లిపై కురిపించింది. పార్వతి సేదదేరింది.

"ఇక నాలుగుదినాల్లో, కొత్త ఊర్లో ఉంటాము గదమ్మా?" సుధ అంటున్నది.

కొత్త ఊరు! ఊరు కొత్తే గాని మనుషులూ, మనసులూ పాతవేగా! అక్కడకు పోయిన రెండు రోజులకంతా చరిత్ర పునరావృత మౌతుంది. మళ్ళీ గుసగుసలూ, వికవికలూ!

"ఏమిటమ్మా! ఆలోచనలో పడ్డావు! మళ్ళీ ఎవరన్నా ఏమన్నా అన్నారేమిటి?" ఈ 'మళ్ళీ' అనే మాటకు అర్థమే లేదు. నిత్యం వందమంది వంద మార్లు ఏదోఒకటి అంటూనే ఉంటారు.

అయితే ఈ మాటలు పైకి అనలేదు పార్వతి. పైకి అన్నమాట లివి:

"ఏం లేదమ్మా! నీ కోర్సు అయిపోతూనే,ఏదో ఒకమంచి సంబంధంచూసి-"

తల్లి నోటిని నెమ్మదిగా మూసి సుధ యిలాగన్నది. "అమ్మా! నాకు నాన్నెవరో తెలియదు. తెలియకుండా ఉండటమే మేలు! తెలిస్తే ఖూనీ చేస్తాను! ధైర్యంగా, నీతిగా నిలచి, నన్ను ప్రపంచంలోకి తెచ్చి, జ్ఞానం ప్రసాదించిన నిన్ను కాపాడుకోవడమే నా కర్తవ్యం. ప్రశాంతమైన ఊర్లో ప్రాక్టీస్ పెట్టితే, మనిద్దరి జీవితాలూ చల్లగా గడచిపోతాయి. సరే అనమ్మా!"

సుధను దగ్గరికి తీసుకొని, కండ్లు మూసుకొంది పార్వతి. మూసిన కండ్ల నుండి కన్నీరు ధార కట్టింది. నెమ్మదిగా తమాయించుకొని అంది, "నీ చదువూ, విజ్ఞానమూ దేశానికి ఉపయోగించాలి. వైద్యంలో నీకుండే నేర్పు ప్రజలకోసం వినియోగించు."

సుధ తల అడ్డంగా ఊపింది. "దేశం, ప్రజలూ అంటూ నన్ను విసిగించకు. నేను ప్రాక్టీస్ పెట్టేది మన జీవితాలు చల్లగా గడవటానికే. ఈ దేశాన్నీ, యీ ప్రజలనూ నేను ప్రేమించలేను. ఈ 20 వ శతాబ్దిలో నాకు కనపడేదంతా మోసమూ, కుత్సితమూ! నా తల్లిని అవమానించిన యీ దేశాన్ని నేను క్షమించలేను!"

పార్వతి మనసులోనే యిలా ప్రార్థించింది, "హే భగవాన్! అవినీతి ఆదరింపబడి, నీతి అవమానింపబడే యీ దేశంలో స్త్రీని సృజించకు. నీవు మగవాడవే అయివుంటావు! లేకపోతే యింత బాధాకరమైన ఆడ బ్రతుకు నెందుకు సృజించకల్గుతావు?" ★

జాతీయ రక్షణనిధికై తెలుగు సినిమా
తారలు ప్రదర్శించిన నాటికలు యువ
పఠితలకు ఈ సంచికలో సమర్పిస్తున్నాం.

— ఎడిటర్.

# దేశం కోసం (నాటిక)

పింగళి నాగేంద్రరావు

ప్రదర్శనమున పాల్గొన్నవారు . . .

| | | |
|---|---|---|
| శ్రీ ఏ. నాగేశ్వరరావు | .... | డాక్టర్ |
| శ్రీ యం లింగమూర్తి | . | మూర్తి |
| శ్రీ రమణారెడ్డి | . | రమణ |
| శ్రీ మిక్కిలినేని | | భగవంతం |
| శ్రీమతి సూర్యాకాంతం | ... | కాంతమ్మ |
| శ్రీమతి కృష్ణకుమారి | .. | సరోజ |
| శ్రీమతి జయంతి | | జయ |

తెర లేచుటకుముందు

విజయా ప్రొడక్షన్స్‌వారి జాతీయ ప్రబోధ గీతము వినిపిస్తుంది.

తెర పైకి లేస్తుంది

[అది మూర్తిగారి ఇల్లు. మూర్తిగారి భార్య లక్ష్మీకాంతమ్మగారు కళ్ళజోడు పెట్టుకొని చాటలోవున్న బియ్యాన్ని చెరుగుతూ వచ్చి హాలులోవున్న సోఫాలో కూర్చుంటుంది. కళ్ళజోడు సర్దుకుంటూ మధ్యమధ్య విసుక్కుంటూ బియ్యంలో రాళ్లు ఏరుతూంది..]

కాంతమ్మ : రామ రామ ! ఏరినకొద్దీ వస్తున్నాయి రాళ్ళు ... చైనావాడి పాడు యుద్ధం ఎక్కడనుంచి వచ్చిందోగానీ...పూర్వం బియ్యంలో రాళ్ళు కలిపేవారు. ఇప్పుడు రాళ్లలో బియ్యం కలుపుతున్నట్లున్నారు !

[ఇంతలో నవ్య దుస్తుల్లో జయ వస్తుంది.]

[ఏరటం గొడవలోవున్న కాంతమ్మ జయను చూసీచూడనట్లు చూసి బియ్యం చెరుగుతూ వుంటుంది.]

కాం : ఎవరూ...నర్సమ్మా ! అబ్బాయి ఆసుపత్రికి వెళ్లాడు_

[కాంతమ్మ కొన్నిరాళ్లు ఏరిపారేస్తూ...]

కాం : ఏమో...కాలం మారిపోయింది. వరిచేలల్లో రాళ్లేపండుతున్నాయేమో!

[తన్ను కాంతమ్మ ఆ దుస్తుల్లో గుర్తించ లేదని ! జయ ముసిముసినవ్వులు నవ్వు కొంటూ డ్రాయరు దగ్గరకువెళ్ళి డ్రాయరు లాగి, అందులో వార్తాపత్రిక తీసి ముఖానికి అడ్డంగా పెట్టుకొని చదవడం మొదలు పెడు తుంది. డ్రాయరు చప్పుడికి కాంతమ్మ తిరిగి చూస్తుంది. ముఖానికి పేపరు అడ్డుపెట్టుకొని చదువుతున్న మనిషిని జూసి నర్సు అనుకొని దగ్గరకువచ్చి...]

కాం. ఏమిటమ్మోయ్ యీ చొరవ ? మా యిల్లు ఏమన్నా సత్రమను కున్నావా ? చదివావులే మాలావు పేపరు !

[ముఖానికి అడ్డుగావున్న పత్రిక లాగివేస్తుంది. జయ ఆ దుస్తుల్లో కనిపించడం ఆమెకు ఆశ్చర్యంగా తోచింది ]

కాం : ఎవరు నువ్వు ?

[అంటూ కళ్ళజోడులీసి జయవంక మరీ మరీ చూస్తుంది.]

జయ : అమ్మా — చూశావా ! నువ్వు పోల్చుకోలేకపోయావు. ఎంత మారిపోయానో...

కాం : నీకేం కర్మవచ్చిందనే యీ నర్సమ్మవేషం ?

జ : కర్మ కాదమ్మా, మన ధర్మం. ఇంటింటికీ ఒక ప్రతినిధిగా యువతీ యువకులందరూ దేశరక్షణ సైన్యంలో చేరాలి_విజయం సాధించి తీరాలి —

కాం : ఆఁ_తీరాలి...ఏమిటే తీరేది? నీకు పెళ్ళిజేసి ముద్దూ ముచ్చటా చూడాలి అనుకొంటూవుంటే ఇలా అన్యాయం చేస్తావా ?

జ : అమ్మా ! ఏ ముద్దు ముచ్చటైనా దేశ సుఖంగా వుంటేనేగా _ ఇప్పటికే ఆలస్యమైంది. ఇల్లు అంటుకున్న తరవాత బావి త్రవ్వుతున్నట్టయింది. చైనాదురాక్రమణ ఆపటానికి మన సైనికులు ఆ మంచుకొండల్లో అష్ట కష్టాలు పడుతున్నారు. వారికి ప్రజల అండదండలు అవసరం.

కాం · ఆఁ _ యీ అవసరాలు నాకూ తెలుసు. యీ బుద్ధి నీకు పుట్టింది కాదే...ఇదంతా...ఉన్నాడుగా అఖిల భారత దేశభక్తుడు, మీ యబ్బ !

[పోలీసు కానిస్టేబుల్ లయయుక్తంగా అడుగులువేస్తూ వచ్చి ఆగిపోతాడు. అతన్ని చూసి కాంతమ్మ నివ్వెరపోయి మాట్లాడటం ఆపుజేస్తుంది. మళ్ళీ తెములుకొంటుంది.]

కాం : ఆఁ_ఆఁ _ పోలీసాయనా ... ఇక్కడి కెందుకొచ్చాడు ?

పోలీస్ : (అధికార ధోరణిలో) కాంతమ్మ గారు ఎవరండి ?

కాం : ఆఁ _ ఎందుకు ?

పో : వారే కావాలి _

జ : మా అమ్మగారే...

[అంటూ కాంతమ్మను చూపిస్తుంది. కాంతమ్మ వణికిపోతుంది. పోలీసు శాల్యూటుజేసి ఒక కవరు అందిస్తాడు. జయ అందుకుంటుంది.]

కాం : యీ కవాతులకేంగానీ...అమ్మా, ఇదేదోచూడవే ! మొన్న మీ నాన్న

బ్యాంకులో వేస్తానని పచ్చనోట్లు తీసుకెళ్ళాడు...ఏం మూడిందో !

[ఈలోగా జయ ఆ కవరులో కాగితాన్ని తీసి చూస్తుంది.]

జ : (పోలీసుతో) సరే.....థాంక్యూ ! మీరు వెళ్ళండి :

[పోలీసు వెళ్ళిపోతాడు. జయ పొంగివచ్చే ఆనందంతో తల్లిని కౌగలించుకుంటుంది.]

జ : అమ్మా...కంగ్రాట్యులేషన్స్ !

కాం : ఏమిటే నీ గొడవ ? అందులో ఏముందే ?

జ : అవున్లే అమ్మా...ఖ్యాతి, గొప్పా అంతా నీకే కావాలి - మాకేం అక్కర్లేదా ?

కాం : నాకు ఖ్యాతేమిటే...ప్రఖ్యాతీ... విఖ్యాతీనీ...

జ : అదే - వినమ్మా (చదువుతుంది) శ్రీమతి సూరేకారం లక్ష్మీకాంతమ్మ గారు రక్షణనిధికి భూరివిరాళంగా ఇచ్చిన వెయ్యిన్నూట పదహార్లు అభినందనములతో స్వీకరించడమైనది. ప్రభుత్వపురసీదు అందగలదు.

ఇట్లు
సెక్రెటరీ, ఎన్. డి. సి.

కాం : ఇదేదో మందికాదు-సరిగ్గా చూడూ!

జ : అడ్రెసు మందేనమ్మా -

కాం : సరిగా చూడవే — రామ రామ : భూరి విరాళం నేనెక్కడిస్తానే...మీ నాన్న మొత్తుకుంటే చిల్లిగవ్వైనా ఇవ్వలేదు...

[ఈలోగా జయ టేబులు దగ్గరకువెళ్ళి పేపరు అందుకొని...]

జ : అమ్మోయ్, నీపేరు పేపర్లోకూడా పడ్డది. శ్రీ ఎస్. ఆర్. మూర్తిగారి సతీమణి శ్రీమతి లక్ష్మీకాంతమ్మ గారు వెయ్యిన్నూట పదహార్లు !

[కాంతమ్మ కళ్ళజోడు సర్దుకొంటూ జయకు దగ్గరగా వెళ్ళి...]

కాం : ఏదేదే...ఆఁ-నా పేరే! చిత్రంగా వుందే....నా పేరు......మీ నాన్న పేరు...

[ఇంతలో మూర్తి లోపలకు రావడం కాంతమ్మ చూస్తుంది. రెండడుగులు అతని వైపుకు వేస్తుంది.]

కాం : ఏమిటయ్యా, యీ గ్రంథం అంతా? నిజమేనా ?

మూ : ఆఁ— అచ్చులో అబద్ధాలు పడవు-

కాం : అయితే మొన్న నోట్లకట్ట తీసికెళ్ళి చేసిన నిర్వాకం ఇదా ?

జ : ఏం చేశాడమ్మా నాన్న ? నీ పేరు మీదే ఇచ్చాడుగా — అందరూ నిన్నే పొగుడుతున్నారుగా...

కాం : ఆఁ-ఆఁ- ఆ పొగడ్తలూ యీయన యెత్తులూ అన్నీ నాకు తెలుసు. నా పేరుప్రక్కన తన పేరూ ఉంటుందని, నా పేరు పడితే నా నోరు కడుతుందని పన్నాడు పన్నాగం.

మూ : మరి...ఇన్నాళ్ళూ నీతో ఎలా చేశాననుకున్నావ్ సంసారం ? చూశావు కాంతం, ఆ శేషగిరిరావుగా

రింట్లో భార్యా, భర్త, కూతురు అల్లుడూ, కొడుకూ, కోడలూ, తల తలకీ విరాళాలు ఇస్తుంటే నా తల తీసినట్లయింది. ఆ మంత్రిగారి భార్య నీ దగ్గరకే వస్తే నువ్వు పదివేలైనా ఇవ్వాల్సి వచ్చేది. అందుకని సూక్ష్మంగా అక్కడే యీ పనిచేశాను.

కాం : ఆఁ– అంత తెలివుందీ !

మూ. మరి లేదూ !

కాం : ఆఁ – సంతోషించాం – విరాళమని ఇంకెవరొచ్చి అడిగినా, యీ పత్రిక చూపించు ! ఇల్లుగుల్లచేయకు !

జ : మా అమ్మ బంగారు నాన్నా – ముందు కాస్త కస్సూ బుస్సూమన్నా, తరవాత మనం ఏం చేసినా వొప్పేసు కుంటుంది...

మూ : [జయతో:] ఏమమ్మా ఎన్‌లిస్ట్ అయ్యావా ?

జ : నా సర్టిఫికెటు చూడగానే నన్ను ఫస్టు బ్యాచిలో పంపిస్తానన్నారు – ఆఫీసరు మీకు అభివందనాలు చెప్ప మన్నారు –

మూ పిచ్చితల్లి.. మీకు, అంటే ఎవరి కనుకున్నావు ? నిన్ను కన్న మాతృ మూర్తికి..దేశం కొరకు తన బిడ్డల్ని దీవించి యుద్ధానికిపంపే వీరమాతకి..

కాం : ఏమయ్యో, యీమూర్తులు, మాతలు కట్టిపెట్టు! యీ పొగడ్తలకు తబ్బిబ్బై నా బిడ్డను యుద్ధానికి పంపిస్తా నను కున్నావేమో–అది కలలో వార్త !

మూ : మీళ్ళు ఇలా అంటు ఎలా ? అం అమ్మాయి పేరు ఇచ్చింది –

కాం : ఇస్తే –

జ · నేను వెళ్ళితీరాలమ్మా –

కాం : ఏమిటే యీ మాటలు? నా కడుపున పుట్టి నన్ను కాదని పోతావా !

జ · అమ్మా! నువ్వు కోపగించడం నాకు మేలు కాదు. నన్ను దీవించి సంపాలి–

మూ అవును కాంతం – మనస్ఫూర్తిగా

కాం . ఆఁ–

మూ : అమ్మాయి అంత జాలిగా అడుగు తుంటే దీవించి పంపించు !

కాం : దాని జాలి, మీ పొగడ్తలు, మీ నాటకం నాకు తెలుసు. అది ఎలా వెళుతుందో, వాళ్ళు ఎలా పంపుతారో నేనే వెళ్ళి అడుగుతాను –

మూ : ఏమిటీ ? ఆఫీసరు దగ్గరకే ?

కాం : అవును–ఆఫీసర్లయితే ఏం? వాళ్ళు బిడ్డా పాపను కన్నవాళ్ళు కారా ? పోయి అడుగుతాను–రావే రా !

[అంటూ జయ చేయిపట్టుకొని లాగుతుంది..]

కాం : కావాలంటే పదివేలు విరాళంగా ఇస్తాను. నిన్ను పంపటానికి వొప్పు కోను...రావే, రా !

[అంటూ కాంతం నడుంకడుతుంది. ఇంతలో బయటనుంచి 'వందేమాతరం' అంటూ రమణయ్య వస్తాడు.]

రమణయ్య· వందేమాతరం..సూరేకారం కాంతమ్మక్కో ! నీ భూరి విరాళం తాటికాయంత అక్షరాల్తో పేపర్లో

పడ్డది. ఆంధ్రమాతవు. వీరమాతవు. భరతమాతవు... కూతుర్ని యుద్ధానికి పంపుతున్నావు...

(జయతో) కోడలుపిల్లా ! మొగాళ్ళకు సిగ్గువచ్చేటట్లు చేశావు. నిన్ను యీ డిరేసులో చూస్తూవుంటే వీరావేశం వస్తుంది.

కాం: వీరావేశం వస్తే నువ్వు వెళ్ళి చేరక పోయావు ? భట్రాజులాగా ఇక్కడి కెందుకొచ్చావు ?

ర : ఏదీ- నేను పనిపెట్టుకొని పోతే నా అవతారంజూసి పనికిరానని తిరకొ్కట్టారు.

కాం : అందుకేమాకొంప ముట్టించటానికి వచ్చావు-

ర : నేను ముట్టించడం ఏమిటమ్మోయ్ ? ఒకచెంప చైనావారు ముట్టిస్తుంటే...

మూర్తి : ఆ మా టే చె బు తు న్నా ను బావా — ఆవిడకి అర్థంకావడంలేదు -

కాం : మీరు ఎన్నిచెప్పినా, ఎవరు ఎన్ని చెప్పినా, నేను వొప్పుకోను - నా బిడ్డ నాకు దూరం కావడానికి వీల్లేదు.

ర : సరి సరి - అదా సంగతి- ఇంతకూ నీకు ఇష్టంలేదన్నమాట-

(మూర్తి జయలవంక చూసి)

ఆమెకు ఇష్టం లేకుండానేనా మీ దేశాభిమానం ? కోడలుపిల్లా · అమ్మకు ఇష్టంలేనిపని జరగకూడదు!

కాం: అలా బుద్ధిచెప్పు !

ర : చెపుతాగా కాంతమ్మా — ఒకసారి నువ్వు యిలా రావాలి — —

[కాంతమ్మ సంశయంగా రమణయ్యవంక చూస్తుంది. గదివైపు రెండడుగులు వేసిన రమణయ్య ఆగి...]

ర : చూస్తావేమిటమ్మా ? ముఖ్యమైన విషయం. నువ్వే మెచ్చుకుంటావుగా...మ్యాజిక్...మ్యాజిక్...

[అంటూ రమణయ్య లోపలకు వెళతాడు. అతని వెనుక కాంతమ్మ వెళుతుంది.]

జ : నాన్నా, నా సంగతికే అమ్మ ఇలా వుంటే, మరి అన్నయ్య సంగతి తెలిస్తే ?

మూ : ఫరవాలేదు లేమ్మా - ఎంతైనా తల్లి మమకారం. మాటల్లో తీర్చ గలమా ?

జ : మరి, అమ్మ వొప్పుకునేటట్లు లేదు-

మూ: నేను వొప్పిస్తాగా...

[కాంతమ్మ లోపలనుంచి రావటంచూసి మూర్తీ జయలు మాట్లాడడం మానివేస్తారు.]

కాం : ఏమయ్యోయ్..నిన్నే..ఇదుగో... చూశావా, మన రమణ ఎంతమంచి వార్త తెచ్చాడో — జయా ! వెళ్ళి మామయ్యకు కాఫీ ఇవ్వమ్మా !

[కొంచెం దూరంగా నిలబడ్డ రమణయ్య జయను చిటికలు వేసి పిలుస్తాడు. జయ రమణయ్యలు లోపలకు వెళతారు.]

మూ : బావ ఏం మ్యాజిక్ చేశాడోగానీ, కాఫీ నీళ్ళు ముట్టాయి-

కాం : అదికాదయ్యా - భగవంతంగారు

వస్తున్నారట. మన రమణయ్యకు తంతి వచ్చింది. కూతురు సరోజను కూడా తీసుకొస్తున్నారట.

[మూర్తి వెల వెల పోతాడు.]

మూ : యీ సమయములో వీళ్ళు వస్తున్నారేమిటి ?

కాం : అబ్బబ్బ ! ఎందుకయ్యా అలా తెల్లబోతావు ? యీ మాత్రం తెల్సుకోలేవూ ? మన అబ్బాయి, వాళ్ళ అమ్మాయి ప్రేమించుకున్నారయ్యే - ఆ సంబంధం మనం వొప్పుకున్నామయ్యే - ఏదో ముచ్చటగా మనకు కోడల్ని చూపించి ముహూర్తం పెట్టుకోవాలని వస్తున్నారు...

మూ : ఆఁ- ఇప్పుడు ముహూర్తమా ? ఇప్పుడేఁ లగ్నాలు లేవే......

కాం : అన్నీ నీకు తెలిసినట్లు మాట్లాడకు ! లేకపోతే వాళ్ళు ఎందుకొస్తారు ! వాళ్ళ ఏముహూర్తం అన్నా వొప్పేసుకో - ఆ భగవంతంగారు భగవంతుడులాగా వస్తున్నాడు. ముహూర్తంపెట్టారంటే జయ తిక్క కూడా వదుల్తుంది. నరుసంట నరుసు ! అదీ, దాని తల బిరుసు, అన్నయ్య పెళ్ళి ముందుపెట్టుకొని ఎలా వెళుతుందో చూస్తాను - పైగా అన్నగారి మాటంటే దానికి గురి. వాడే నచ్చ చెపుతాడు--

మూ : వాడిమాటంటే అమ్మాయికేగాదు, నీకూ గురే. ఇది యుద్ధ సమయం కాదటే - అబ్బాయికి ట్రాన్స్‌ఫర్ వచ్చిందని విన్నాను. ఎక్కడికో... ఏమిటో...

కాం : అబ్బబ్బ ! తీరి కూర్చొని ఏమిటయ్యా నువ్వూ. నీ అవాచ్యాలూను ?

[కాంతమ్మ లోపలకువస్తున్న కొడుకును చూస్తుంది.]

కాం : రా నాయనా, రా ! ఏమిటి ఇవ్వాళ ఇంత పెందలాడే వచ్చావు ?

[మూర్తి సందిగ్ధంలో పడతాడు. తల పట్టుకొని లోపలకు వెళ్ళబోతూ...]

మూ : అబ్బబ్బ...జయా, అమృతాంజనం ఎక్కడుందమ్మా ?

[మూర్తి లోపలకు వెళ్తాడు. డాక్టరు స్టైతస్కోపు బల్లమీద పెడతాడు. కాంతమ్మ కొడుకు దగ్గరకు వెళుతుంది. డాక్టరు ఏదో చెప్పబోయి తటపటాయిస్తాడు.]

డాక్టరు : అమ్మా-

కాం : అలావున్నావేమిట్రా ?

డా : ఏమీ లేదమ్మా - యుద్ధరంగానికి చాలా మంది డాక్టర్లు కావలసి వచ్చారు. నా సాటి డాక్టర్లంతా వెళుతున్నారు-

కాం : అంతేకదా - వెళ్ళేవాళ్ళు వెళతారు- మనకెందు కా గొడవ ?

డా : అమ్మా, నాన్నగారికంటే నువ్వే ధైర్యస్తురాలివని నాకు తెలుసు. సమయంవస్తే దేనికైనా నువ్వే నిలబడతావు...

కాం : నిలుచునే వున్నానురా నాయనా —

అదేదో తొందరగా చెప్పూ !

డా : సీఫాలో గాయపడ్డ సైనికులకు వైద్యసేవ చేయటానికి నేనూ వెళుతున్నాను. ఇవ్వాళే ప్రయాణం.

కాం : నిజమేనట్రా ? నిజమేనట్రా యీ మాట ? నడుం విరిగిపోయింది...

[కాంతమ్మ సోఫాలో కూలబడుతుంది]

కాం : నాతో చెప్పకుండా ఇంత పని చేశావా ? నీ తల్లి చచ్చిపోయిందనుకున్నావా ?

[ఇంతలో లోపలనుంచి రమణయ్యవస్తాడు.]

ర : డాక్టర్ ! నీ దేశాభిమానానికి నిన్ను అభినందించవలసిన వాడనేగానీ, మీయమ్మ అవస్థచూస్తే జాలేస్తుంది. కాంతమ్మా, నువ్వు శోషపడకు ! జయా ! కాస్త మంచినీళ్ళు పట్టుకురా— నే చెబుతాను—

కాం : రమణా, అబ్బాయికి ఘప్పైనా కాస్త నెమ్మదిగా చెప్పూ !

ర : ఇంకేమిటి చెప్పేది? ఎవరి కొంపలో వాళ్లను చల్లగా కూర్చోనివ్వకుండా ఆ చైనావాడు ఇంత తిరకాసు తెచ్చి పెట్టాడు.

డా : మామయ్యా ? ఆ చైనావాడు మేలేచేశాడు. మీబోటి వాళ్ళందరూ సుఖంమరిగి సోమరులై పోతుంటే మంచి చురక తగిలించాడు. కక్షలు విరోధాలుమాని ప్రజానాయకులందరూ దేశరక్షణకై నడుంకట్టి నిలచేటట్లు చేశాడు—



[జయ మంచినీళ్లు తీసుకొని వచ్చి తల్లికి ఇస్తుంది.]

జ : మంచినీళ్ళు ఇవిగోమ్మా—

కాం : మీ నాన్న ఏడమ్మా ?

జ : నాన్నా...

[లోపలనుంచి వస్తూ]

మూ : వస్తున్నా—ఏమిటి ?

కాం ఏముంది — నువ్వూ నేనూకూడా ఎల్లలకు కాకుండాపోయాం. వాడూ యుద్ధంలో చేరాడట.

మూ కాంతం ! వాళ్ళు యువకులు. భావిభారతపౌరులు. దేశ భవిష్యత్తు వాళ్ళ మీద ఆధారపడుంది. వాళ్ళ బాధ్యతలు వాళ్ళకు తెల్సు. వాళ్ళ నిర్ణయాలు మనకు బాధాకరమైనా గుండె రాయిజేసుకొని వాళ్ళను ఆశీర్వదించాలి—

ర నీది గుండో చెరువో గానీ పరశు రాముడులాగా మాట్లాడావు—ఆ కన్న తల్లి బిడ్డలకోసం కుమిలిపోతుం దయ్యా—

డా : మామయ్యా ! దేశక్షణకోసం ఆ మంచుకొండల్లో చైనా ముష్కరు లతో పోరాడి ప్రాణాలు అర్పిస్తున్న మహావీరులకు తల్లిదండ్రులు లేరా ? బంధువులులేరా ? వారు ప్రేమను మమ కారాన్ని చంపుకొని తమ ప్రియ సంతానాన్ని రణరంగానికి పంపటం లేదా ? వీరపుత్రులు కూలిపోయినా ధైర్యంగా నిలవడం లేదా !

కాం : మరి ఆ తల్లిదండ్రులు, ఆ ధైర్యం నేను తెచ్చుకోలేకుండా వున్నాను.

ర : అల్లుడూ ! యీ మాటతో అమ్మ సగంధైర్యం వచ్చినట్టే—

జ : లేకపోతే మనకుమల్లే అధైర్యపడి వారి తల్లిదండ్రులు ఆ వీరులకు పిరికి మందుపోసి ఇంటిలోనే కట్టివేసు కుంటే యీ పాటికి మన గతి ఏమయ్యేది ?

ర : ఏమయ్యేది ? చైనా సర్పం మన యింటిముందు బుస్సలు కొట్టేది నిజమేగానీ, దాని పడగ చితకకొట్ట డానికి హేమాహేమీలు ఘటికులు పూనుకోవాలి. సామాన్యులం మనతో ఏమవుతుందయ్యా ?

మూ : బావా, అదే పొరపాటు సామాన్యులందరితో కూడిందే సమాజం, సంఘబలం. ప్రజాశక్తి ఎంతటి ప్రచండ ప్రళయాన్నైనా ఎదిరించగలదు. ఇదే మనం పాశ్చాత్య దేశాలనుంచి నేర్చుకోవలసినది.

మూ : రెండవ ప్రపంచ యుద్ధంలో ఆ హిట్లరు మారణహోమానికి గురి అవుతున్న దేశప్రజలందరూ ఎంత ధైర్యంతో నిలిచారో ఎంత త్యాగం చేశారో తెలుసా ? తమ కడుపులు కట్టుకొని వారానికి ఒకరొట్టె చొప్పున తిని, ఆ మిగిల్చిన ఆహారాన్నంతా యుద్ధవీరులకే సమర్పించారు కరుణారసమూర్తులైన తల్లులు తమ

పిల్లలకు ఇచ్చే బిస్కట్లు కూడా సైనికులకే పంపారే — వారు చేసిన త్యాగంలో ఎన్ని వేలమంది మరణించారో తెలుసా ? దేశమంటే మట్టి కాదోయ్ అని ఋజువుచేయవలసిన అవసరం మనకూడా వచ్చింది. మనస్వాతంత్ర్య రక్షణకోసం సర్వస్వం ధారపోసైనాసరే — ఆ చైనావాళ్ళను, ఆ మిత్రద్రోహులను, ఆ విశ్వాసఘాతకులను ఆ నయవంచకులను, మెడపట్టి బైటకు గెంటాల్సిందే— రాణాప్రతాప్...వీరశివాజీ.. ఝాన్సీలక్ష్మిలను కన్న దేశమయ్యామంది ...



[మూర్తిగారు మాట్లాడుతూన్నప్పుడు డాక్టరు దేనికొరకో టేబులు మీద వెతుకుతూ వుంటాడు.]

డా : జయా, నాకు టెలిగ్రాం ఏమీ రాలేదా ?

కాం : ఎందుకు నాయనా ? ప్రయాణం కూడా ఇప్పుడే కడదామనా ? జయ కూడా చెప్పుల్లో కాళ్ళు పెట్టుకొని కూర్చుంది. దాన్ని కూడా నువ్వే ప్రయాణం చేశావుగా — మీకు నేను ఇంత విషం అయిపోయానా ?

డా : అమ్మా —

జ : అంతమాట అనకమ్మా—

[డాక్టరు, జయలు తల్లికి దగ్గరగా వచ్చి ఇరు వైపులా కూర్చుంటారు.]

కాం: మీ యిద్దరూకూడా యుద్ధానికే వెళితే నేను ఇక్కడ బ్రతికుంటానా ?

డా : అమ్మా ! మన బ్రతుకుల విషయమే నువ్వు ఆలోచిస్తున్నావుగానీ, దేశం నాశనం అయిపోతే మనం ఏమైపోతామో నువ్వు విచారించటం లేదు. చిన్నా పెద్ద, స్త్రీలు పురుషులు అని భేదంలేకుండా ప్రజలందరూ ఏకమై ఎదిరిస్తేనేగానీ యీ చైనా భూతం ఆగేదికాదు. ఇవ్వాళ మన సుఖం చూసుకుంటే మనం నాశనం కావటమేగాక భావి భారత సంతానాన్ని శాశ్వతంగా బానిసలను చేసిన వాళ్ళం అవుతాం. యీ ఆపదను గ్రహించి తల్లివైన నీవు మమ్మల్ని ఆశీర్వదించి పంపించాలమ్మా ! లేకపోతే, మాకు జయంలేదు—

[ఏదో బయట చప్పుడు అవుతున్నట్లు విని రమణయ్య ఎవ్వరో వచ్చినట్లు అభినయిస్తూ బైటకు వెళతాడు.]

కాం : అంతేనా...అంతేనా...

[ఆశీర్వదించినట్లు చేతులు ఊపుతుంది. దూరంగా నిలబడ్డ మూర్తి తృప్తిగా తల ఊపుతాడు. ఇంతలో రమణయ్య చిటికెలు వేసుకొంటూ లోపలకు వస్తాడు.]

ర : బావా ! పెళ్ళివారు వస్తున్నారు—

[మూర్తి రమణయ్యలు ద్వారంవైపు వెళతారు.]

కాం : ఆ— అబ్బాయీ, కాబోయే మీ మామగారు వస్తున్నారు సరోజ కూడా వస్తుంది. మరి—మీరూ మీరూ ప్రేమించుకున్నారుగా—వాళ్ళకు ఏమి సమాధానం చెబుతావో నువ్వే చెప్పుకో — నేను మాత్రం వాళ్ళకు ఎదుటపడలేను.

[అంటూ కాంతమ్మ లోపలకు వెళుతుంది. అడుగుల చప్పుడు వచ్చేవైపు డాక్టరు జయలు చూస్తారు. మూర్తి భగవంతంగారికి సరోజకు దారిచూపిస్తూ లోపలకు తీసుకొస్తూ వుంటాడు. రమణయ్య వాళ్ళతో వుంటాడు.]

మూ : దయచేయండి .దయచేయండి..

[అందరూ స్టేజిమీదకు వస్తారు. భగవంతం దగ్గర రెండు మూడు వార్తాపత్రికలు వుంటాయి.]

డా : నమస్కారం మామగారూ !

జ. నమస్తే వదినా—

ర జయా, అట్లా నిలబడ్డావే౯ ? వదిన ఎక్కడికీ పోదులే...అందరికీ కాఫీ సత్కారం చూడూ —

జ: ఓ—

[అంటూ లోపలకు వెళుతుంది.]

భగవంతం: బావగారూ! నేను మీతో ముఖ్యంగా మాట్లాడాలి—చెల్లాయమ్మ గారేరీ?

ర. శుభం...శుభం...లోపలున్నారు—దయచేయండీ!

[అంటూ లోపలకు దారితీస్తాడు. అతని వెనుక భగవంతం, మూర్తులు వెళతారు. స్టేజిమీద సరోజ డాక్టరు మాత్రమే వుంటారు. సరోజ టేబులు దగ్గరగా వెళ్ళి నిలబడుతుంది. డాక్టరు చనువుగా ఆమె దగ్గరకు వెళ్ళి భుజంమీద తడతాడు—]

డా: వచ్చావా సరోజా—కారుమీదా? రైలుమీదా?

సరోజ: దేనిమీదాకాదు —ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాంమీద—

డా: ఓ. కె. ఇంక మనం పైర్లైన్స్‌మీదే సీఫా వెళ్ళిపోవచ్చు—

స: ఇంత స్పీడ్ — మా నాన్నగారు తట్టుకోలేకుండా వున్నారు. మీ టెలిగ్రాం చూడగానే ఆయన చాలా బాధపడ్డారు.

డా: అవును సరూ—మా అమ్మ కూడా బాధపడుతుంది. కానీ నాక్కావలసింది నీ మాట.

స. నామాటే కావలసివుంటే నాతో సంప్రదించకుండా మీ రీ నిర్ణయానికి వస్తారా?

డా సరూ! ఏమిటామాటలు? ఏ పరిస్థితుల్లో ఇలా నిర్ణయానికి వచ్చానో నువ్వు తెల్సుకోగల వనుకున్నాను. ఆమోదిస్తావన్న ధైర్యంతోనే టెలిగ్రామ్ ఇచ్చాను.

స: ఏమో! మీ నిర్ణయానికి నా మనసు ఎంతో బాధపడుతుంది—

[కారే కన్నీరు డాక్టరు చూడకూడదని తల తిప్పుకుంటుంది. అది గ్రహించిన డాక్టరు ఆమె భుజాలు పట్టుకొని తనవైపుకు తిప్పుకుంటాడు.]

డా సరూ! ఇది కన్నీళ్ళకు సమయం కాదు -

స. కాదు—నాకూ తెలుసు. కానీ, నా కోరికొక్కటే. మన వివాహం జరిగి, నేను మీ భార్యను అనిపించుకున్న తరవాతే మీరు వెళ్ళాలి -

[మాట్లాడుతూ సరోజ నెమ్మదిగా ముందుకు అడుగులు వేస్తుంది. డాక్టరు ఆమెవెనుకే నడిచి ఆమెకు ఎదురుగా నిలుస్తాడు.]

డా సరూ! చదువులో, సంస్కారంలో నాతో సరిసమానురాలవు. నువ్వు కూడా ఇలా మాట్లాడుతావా? నీవే ఇలా మాట్లాడితే అర్థంలేదు. దేశమంతా యుద్ధభయంతో సంక్షోభించిపోతుంటే మనం వివాహాలనీ, విందు

లనీ కాలక్షేపం చేస్తే దేశద్రోహులం ఆత్మవంచకులం అవుతాం —

[ఇంతలో జయ పేపరు పట్టుకొని పరుగెత్తు కొస్తుంది.]

జ : అన్నయ్యా... వదినా...చూశారా ! అద్భుతమైన వార్త......

[పేపరులోని విషయిం చదువుతుంది.]

జ : శ్రీపురంలో శ్రీమంతు లందరూ దేశరక్షణనిధికి బంగారం దానం చేస్తుంటే, ఒక పేదరాలు ముందుకు వచ్చి నేనిచ్చుకోగల బంగారంఇదిగో అంటూ తన నలుగురి కొడుకుల్ని యుద్ధరంగాని సైనికులుగా సమర్పించింది—

చూశారా, యీ వీరాంగనత్యాగం! భారతమహిళలందరికీ ఆదర్శం.

[జయ యీ వార్త చదువుతూవుంటే ఒక్కొక్కరుగా ఇంట్లోనుంచి అందరూ బయటకు వచ్చి నిలుస్తారు.]

భగవంతం : అవునమ్మా — నువ్వు చెప్పావు— మీ నాన్నగారూ చెప్పారు. (సరోజతో) అమ్మాయీ, ఏమన్నాడు డాక్టర్? తననిర్ణయం మార్చుకున్నాడా ?

డా : మార్చుకోమని మీ యంతటివారు శెలవిస్తారా మామగారూ ? మీ మమకారంకొద్దీ మన కర్తవ్యాన్నే మరచిపొమ్మంటారా ?

ఘూ : బావగారూ ! మన్నించండి ! మన దేశానికి దాపురించిన ప్రమాదం ఎంతఘోరమైందో మీరుగుర్తించటం లేదు. శాంతిసమరంతో బ్రిటిషువారిని సాధించి సంపాదించిన మన స్వాతంత్ర్యాన్ని ఇలాగే నిలబెట్టుకోగలమని భ్రమపడకండి ...వాళ్లు ఓడలమీద వర్తకానికి వచ్చిన నాగరికులు. మన స్వాతంత్ర్యదీక్షను గుర్తించి మిత్రులుగానే విమానాల్లో వెళ్లిపోయిన శాంతి కాములు. కాని, కొండకోనల్లోనుంచి హఠాత్తుగా మనపై విరుచుకుపడ్డ చైనావాళ్లు మొరటుముష్కరులు. వాళ్ళ దుష్కాంక్షకు మితి లేదు. కబంధహస్తాలు చాచి ప్రపంచాన్ని అంతా కబళించాలని చూస్తున్నారు.

కాం : నువ్వు మాట్లాడకయ్యా — కుదట పడుతున్న గుండె కూడా చెదిరిపోతుంది —

భ : మీ గుండె చెదిరిపోతుంది — మేం బెదిరిపోతున్నాం, అమ్మాయీ, ఇక చాలు ! అందరి అభిప్రాయాలు విశదమయ్యాయిగానీ ఇంక రా ! నా ఆస్తినంతా వెచ్చించైనాసరే, ఇంకో సంబంధం చూస్తాను —

స ; నాన్నా ! నేను యీ జన్మలో పెళ్ళి జేసుకునేయోగమే వుంటే నాజీవితం, నా వివాహం వీరితోనే. వారి ఆశయమే నా ఆశయం. దేశంకోసం వారి నిర్ణయమే నా నిర్ణయం.

ర : వీరవనితవు...వీరవనితవు....బలే మాటన్నావమ్మాయీ -

భ : అమ్మాయీ, నిన్ను జూసి గర్విస్తున్నానమ్మా - నీ స్వంతబుద్ధితో యీమాట వినాలని అలా అన్నాను. అంతే.

[సరోజ డాక్టరుకు కొంచెం దగ్గరగా వెళుతుంది.]

కాం : ఓహో ! స్వంతబుద్ధి మీకేనా ? నాకూవుంది. మాదసలు వీరవంశం. మా తాత సుబేదారు. ముత్తాత జమేదారు, మా నాలుగోతాత హవల్దారు..

ర : కబర్దార్ ! జయా, పళ్ళెం పట్టుకురా ! నే చెబుతా -

[జయ వెళుతుంది.]

కాం : ఏమిటయ్యా నువ్వు చెప్పేది ? సరోజా, నువ్వుచెప్పు ! నువ్వు నా కోడలవేగా ?

స : అవు నత్తయ్యా -

కాం : ఎప్పటికీ ?

స : అవునత్తయ్యా -

కాం : నే చెప్పినట్లు వింటావా ?

స : అలాగే అత్తయ్యా -

కాం : అయితే మీ వివాహం విజయం తరువాత. నీ భర్తకు వీరతిలకంపెట్టి హారతి ఇచ్చి పంపించమ్మా !

[జయ హారతిపళ్ళెం పట్టుకొస్తుంది -]

ర : కాంతమ్మోయ్ ! మీ వీరకుటుంబం ఇలా జగన్నాథునిరథంలా సమరానికి సాగుతుందని తెలిసే సిద్ధంగా వచ్చా. ఇదిగో కర్పూరం... కుంకం...

[అంటూ, జేబులోనుంచి కర్పూరం కుంకం తీసి పళ్ళెంలోపెట్టి హారతి వెలిగిస్తాడు. సరోజ జయచేతిలోని పళ్ళెం తీసుకుంటుంది. డాక్టరుకు కుంకుమపెట్టి హారతి ఇస్తుంది.)

జ : అన్నయ్యా జిందాబాద్ ! వదినా జిందాబాద్ !

మూ : అమ్మా, సరోజా ! ఆడబిడ్డను కూడా ఆశీర్వదించమ్మా !

[సరోజ జయకు తిలకాన్ని పెట్టి హారతి ఇస్తుంది.

ర : జయమ్మా, జిందాబాద్ !



# అజ్ఞాత వీరులు (నాటిక)

పద్మరాజు

ప్రదర్శనమున పాల్గొన్నవారు

| | |
|---|---|
| శ్రీ రంగారావు | మానవేంద్రనాథ బెనర్జీ |
| శ్రీ జగ్గయ్య | గోపాలరావు |
| శ్రీమతి కన్నాంబ | పూర్ణిమ |
| శ్రీమతి సావిత్రి | అపర్ణ |

(కలకత్తాలో ఒక మధ్యతరగతి గృహస్థు మానవేంద్రనాథ బెనర్జీ. అరవయ్యోపడి. అతని భార్య పూర్ణిమా బెనర్జీ. అతనికంటె అయిదారు సంవత్సరాలే చిన్నది. ఆ దంపతులకు ఒకే ఒక కొడుకు, కాళీచరణ్ బెనర్జీ. ప్రస్తుతం నీఫా రంగంలో భారతసైన్యములో ఒక చిన్న పటాలానికి కెప్టెన్. బెనర్జీగారి మేనకోడలు కాళీచరణ్ భార్యకానున్న యువతి—అపర్ణ, చిన్నతనంనుంచీ మేనమామ, మేనత్తల సంరక్షణలోనే పెరిగింది. బెనర్జీగారు పదహారుసంవత్సరాలు తెలుగుదేశంలో ఉద్యోగం చేసి పింఛను పుచ్చుకొని కలకత్తాలో ఆవాస మేర్పర్చుకున్నారు. యుద్ధంలో కాలిమీద దెబ్బతిన్నందువల్ల కాళీచరణ్ స్నేహితుడు — గోపాలరావు అనే తెలుగుయువకుడికి శలవుదొరికిం దొకవారం రోజులు. కాళీచరణ్ అతన్ని కలకత్తా వెళ్ళి తన తల్లిదండ్రుల దగ్గర ఆ వారం రోజులు హాయిగా గడిపి రమ్మని మరీమరీ చెప్పాడు కానీ తల్లిదండ్రులను చూడాలన్న ఆత్రంకొద్దీ గోపాలరావు తన స్వగ్రామమైన చంద్రగిరి వెళ్ళి నాలుగు దినాలు అక్కడ వుండి తిరిగి నీఫా వెళ్ళేముందు తన స్నేహితుని ఆదేశాన్ని మన్నించటాన్కి బెనర్జీగారియింటికి వచ్చాడు— అక్కడ ఒక్క రోజన్నా ఆ వృద్ధదంపతులతో గడిపి మరీ పోవాలని. అతని రాకతో ఈ నాటకం ప్రారంభం)

[తెరతీయగానే మానవేంద్ర బెనర్జీ పవధ్యానంగా రంగస్థలాన్కి మధ్యగావున్న దివాన్ మీద కూర్చుంటాడు. అది పగలు దివాన్‌గాను, రాత్రి మంచంగాను ఉపయోగిస్తుంది. ఆయనకు ఎడమప్రక్క ఒక రాతబల్ల, దాని వెనక కుర్చీ, కుడిప్రక్క మూలలో ఒక వీణ గోడ నానుకొని; ఆ హాలు చూడగానే నిరాడంబరత స్ఫుటంగా కనబడుతుంది. ఉన్నంతలో జాగ్రత్తగా పరిశుభ్రంగా బ్రతికే కుటుంబమని ఆ యిల్లు అమర్చబడిన పద్ధతే చెబుతుంది. గోపాలరావు మిలటరీ దుస్తుల్లో ప్రవేశం. వచ్చీ రావటంతో తన Kit, కర్ర కుర్చీమీద పెడతాడు. బెనర్జీగా రతన్ని చూడరు.]

గోపాలరావు : అయ్యా ! (బెనర్జీ ఉలికి పడతాడు) మానవేంద్రనాథ్ బెనర్జీ గారు మీరేకదండి ?

బెనర్జీ . మీరు......!

గో· నా పేరు గోపాలరావు. మీ అబ్బాయి కాశీచరణ్ రాయలేదూ నా గురించి ?

బె : రాయకేం ! అయితే వారంరోజుల క్రితమే వస్తారనుకున్నాం.

గో : అతడు నాతో అల్లాగే చెప్పాడు. నీకున్న శలవే వారం రోజులు, మీ చంద్రగిరి ఎక్కడో వెయ్యి మైళ్ళ దూరాన వుంది. వెళ్ళిరావడానికి నాలుగు రోజులు పడుతుంది. కలకత్తా వెళ్ళి వారంరోజులు మా అమ్మ నాన్నదగ్గర గడిపేసిరా. వాళ్ళు నిన్ను కడుపులో పెట్టుకుని ఆదరిస్తారు, అన్నాడు. అయితే మా అమ్మనీ నాన్ననీకూడ చూడాలని బుద్ధిపుట్టింది.

బె : అయితే చంద్రగిరి వెళ్ళి వచ్చారన్న మాట.

గో . అవునండి. అందులో ఈ దెబ్బ తగిలేక —

బె : కాలిమీద పెద్ద గాయమే పడిందట కదూ ?

గో : అంత పెద్ద గాయం కాదులెండి (ప్యాంటు పైకెత్తి చూపిస్తాడు ప్లాస్టరు చుట్టి వుంటుంది) మా అమ్మ నన్ను చూడాలని వుందని మరీ మరీ వ్రాసింది.

బె : మంచిపని చేశారు. ఇలా కూర్చోండి ఒక్క క్షణంలో వస్తాను.

గో : అమ్మగారేరీ ?

బె : లోపలుంది. పూర్ణిమా ! (పూర్ణిమా బెనర్జీ వస్తుంది)

గో అమ్మగారూ ! (గోపాలరావు యిద్దరికీ సాష్టాంగ నమస్కారం చేస్తాడు. పూర్ణిమ ముఖం మీద ముసుగు సరిచేసుకొని వెనక్కు తగ్గుతుంది ) మీ దేశాచార ప్రకారం బిడ్డలు తల్లిదండ్రులకి యిలాగె నమస్కారం చేస్తారటగా !

బె : పూర్ణిమా ! వీరే గోపాలరావుగారు మన కాశీ రాయలా !

పూర్ణిమా బెనర్జీ : అనుకున్నాను. అలా కూర్చోండి బాబూ !

గో . మీ కాశీ ఒకటి నేనొకటీ కాదు నన్ను, మీరు మీరు అని మన్నిస్తుంటే నాకు చిన్నతనంగా వుంది.

బె కూర్చో నాయనా, అలా కూర్చో.

పూ కూర్చోనాయనా...కాఫీ తెస్తాను.

గో మీరిలా కూర్చోండి అమ్మగారూ! ఆ ఏర్పాట్లన్నీ సావకాశంగా చేయొచ్చు (పూర్ణిమను దివాన్ మీద కూర్చోబెట్టి తను క్రింద కూర్చుంటాడు ఆమె కాళ్ళదగ్గర.)

పూ అయ్యో అదేమిటి? క్రింద కూర్చున్నావ్?

గో నన్నిలా మీ కాళ్ళదగ్గర కూర్చోనిస్తే చాలు. అదే అన్నిటికన్నా మీరు చేయగల గొప్ప మర్యాద. బాబుగారలా నిలబడే వున్నారేమిటి?

బె వస్తాను...ఏదో అనుకొని మర్చిపోయాను...(లోపలికి వెళతాడు.)

పూ చాలా దూర ప్రయాణం చేసి వచ్చావు నాయనా! కాస్సేపు విశ్రాంతి తీసుకో.

గో మీతో కులాసాగా కబుర్లు చెబుతూ కూర్చుంటే అంతకన్నా విశ్రాంతి ఎం కావాలి?

పూర్ణిమ : నాయనా! దేశం కాని దేశంలో ప్రతిక్షణం ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ఆ చైనా దురంతకులతో యుద్ధం చేస్తున్నారు మీరు. ఆ మంచు కొండలమధ్య వేళపట్టున తిండి, నిద్రలేకుండా ఎన్ని కష్టాలయినా పడుతున్నారు. ఇంటికొచ్చినప్పుడైనా మీరు కాస్త తృప్తిగా తిని, విశ్రాంతిగా నిద్రపోవాలని మా ఆదుర్దా.

గో : (లేచి మెల్లగా పచారు చేస్తూ) అమ్మగారూ! మేమక్కడ పడుతున్న బాధలు మీ రంచనా వేయలేరు. మాకు కావలసిన విశ్రాంతి ఎటువంటిదో కూడా మీరు అంత సులభంగా తెల్సుకోలేరు. గాలిలో నీరు కూడా గడ్డ కట్టుకుపోయే ఆ హిమాలయాల్లో నోరు తడియారిపోయినప్పుడు మురికినీరయినా అమృతప్రాయంగా ఉంటుంది. కటికి రాళ్ళమీద దొర్లిన శరీరానికి గడ్డి, ఆకులు హంసతూలికలవుతాయి. మీ వద్ద మేమాశించేది శరీరసౌఖ్యం కాదు. మనస్సుకి విశ్రాంతి; ఆత్మకి స్థైర్యం; హృదయానికి ఆదరం, అనురాగం.

పూ : ఆదరానికీ అనురాగానికీ లోటేమీ లేదు నాయనా!

గో : నాకు తెలుసు. అందుకే అంత ఆశగా మీ దగ్గర కొచ్చాను. మీరు కాశీ తలిదండ్రులు. కాశీచరణ్ నా ప్రాణానికి ప్రాణం.

పూ : అబ్బాయి రాశాడు

గో : బోండిలాలో మా మొదటి పరిచయం. నా కాలికి గుండుదెబ్బ తగిలింది. తక్కిన సైన్యమంతా అతి వేగంగా వెనక్కితిరిగి వెళ్ళిపోయింది. కాశీ మాత్రం నన్ను వదలిపోలేక పోయాడు. చైనా శతఘ్నులు దారినంతా నాశనం చేశాయి దారీ తెన్నూ లేని ఆ మంచుకొండల్లో లోయల్లో



అడవుల్లో మూడు రోజులు నన్ను, తన భుజం మీద మోసుకొచ్చి మా శిబిరం చేర్చాడు కాశి. ఈ ప్రాణం అతనిది. ఈ బ్రతుకే అతనిది.

బె : (గోపాలరావు చెబుతుండగా ఆఖరున వచ్చి వింటాడు) ఎప్పుడొచ్చేదీ ఉత్తరం వ్రాస్తే స్టేషను కొచ్చేవాణ్ణి.

గో : వచ్చి ఏం లాభం ! కలకత్తా స్టేషన్లో యీ కోన్కిస్కా గోపాల

రావుని మీరు పట్టుకోవడం ఎల్లా? అందుకే కాశీతో అన్నాను. కలకత్తాలో మీ యింటి ఎడ్రసు నాకియ్యి, నేనే కనుక్కొని వెడతా నన్నాను.

బె : యుద్ధరంగంలో ఏర్పడ్డ అనుబంధాలు చాలా అపురూపమైనవి.

(అపర్ణ కప్పుతో కాఫీ తెచ్చి గోపాలరావు కిస్తుంది.)

పూ : మా మేనకోడలు.

గో : అపర్ణ. మా కాశి తన మరదల్ని గురించి అందులో తనకు కాబోయే భార్యను గురించి నాతో చెప్పకుండా ఎలా వుంటాడు?

పూ : వంట సంగతి చూడాలి. (ఆమె తొందరగా వెళ్లను)

అ : చల్లారిపోతుంది. ముందు త్రాగండి.

గో : ఎంత చల్లారిపోయినా మాకు వేడిగానే వుంటుంది. ఆ మంచుకొండల మధ్య వెచ్చదనం కోసం తపస్సు చేశామంటే నమ్మండి. (కొంచెం చప్పరించి) కాఫీయా? నా కోసం ప్రత్యేకంగా చేసినట్టున్నారు. మీకు 'టీ' అలవాటు అనుకుంటాను.

బె : అయితే కాఫీ మాకు కొత్తకాదు నేను తెలుగుదేశంలో 16 సంవత్సరాలు ఉద్యోగం చేశాను.

గో : కాశీ చెప్పాడు. అందుకే మీరింత చక్కగా తెలుగు మాట్లాడుతున్నారు, అపర్ణాదేవికూడా అక్కడే పెరిగిందటగా?

బె : అవును.

గో . నాలెక్కప్రకారం మీరు తెలుగువారే.

బె : నిజమే కానీ నేను పుట్టి పెరిగినదేశం ఇది. బంధువులంతా యిక్కడే వున్నారు. అంచేత రిటైరవగానే ఇక్కడకొచ్చి స్థిరపడ్డాను.

గో : మీరెక్కడ ఉద్యోగంచేశారు?

బె : అంతా—రాజమండ్రి, కాకినాడ, బెజవాడ, గుంటూరు — కాఫీ ఏలాగుంది నాయనా!

గో : చాలా బాగుంది అయితే యుద్ధంలో చేరాక కాఫీకీ టీకి తేడాతెలియడం మానేసింది. నాకోసం ప్రత్యేకంగా కాఫీ చేయడం అనవసరం.

అ . అధమం యింటికొచ్చినప్పుడైనా, మీ నోటికి రుచినేర్పి పంపాలిగదా మేము.

గో : అయితే యుద్ధం పూర్తికాగానే కాశీతోవచ్చి వారంరోజులుంటాను.

బె : అమ్మాయ్! నీళ్ళగదిలో వేడి నీళ్ళున్నాయా?

అ : ఆఁ అన్నీ సిద్ధంచేశాను.

బె : ఇదే నాయనా! ఈ నడవలో ఎడం ప్రక్కదే నీళ్ళగది. తువ్వాలూ సబ్బూ అన్నీ అక్కడే ఉంటాయి. (గోపాలరావుని భుజంమీద చేయివేసి లోపలికి తీసుకు వెడతాడు. ఈలోగా

అపర్ణ మూలనున్న వీణ తీసుకుని బయటికి వెళ్ళబోతుంది.) అమ్మాయ్! ఎక్కడికి ?

అ మృణాళిని కావాలంది వీణ

బె నీ వీణా !

అ ఇంక నాకెందుకీ వీణ ?

(ఆమె వీణతీసుకు వెళ్ళబోతుంది. బెనర్జీ నిట్టూర్చి ఏదో తల్చుకుంటూ నిలబడతాడు. దీపాలు సన్నగిల్లి ఆరిపోతాయి.)

* * *

(దీపాలు క్రమంగా వెలుగుతాయి. పూర్ణిమ పక్కదులిపి వేయబోతుంటుంది.)

గో పక్క నేను వేసుకుంటానమ్మగారూ!

పూ ఫర్వాలేదయ్యా !

గో చూడండమ్మగారూ ! మీ చేత శుశ్రూష చేయించుకోడానికి నేను రాలేదు. మీ యింట్లో నేనుండేది ఈ ఒక్కరోజు. ఈ నాలుగు గడియల్లోనూ జరిగినదంతా తు. చ తప్పకుండా కాశీకి నేను చెప్పాలి. మీతోనూ, బాబుగారితోనూ కాస్సేపు కూర్చుని మాట్లాడ్డానికే నాకవకాశం దొరకడంలేదు.

పూ అవకాశాని కేముంది ? ఈ యిల్లూ వాకిలీతప్ప పై ప్రపంచం ఏమీ తెలియదు నాకు.

గో ఓహో ! అయితే నాబోటి చదువుకున్న కుర్రవాళ్ళకి పై ప్రపంచకం సంగతులు తప్ప మరేమీ రుచించవంటారు,

పూ : అందుకోసంకాదు. నేను నీకు కొత్తగా చెప్పదగిన విశేషాలేమున్నాయి ?

గో . లేకేం ? అన్నిటికన్న ముఖ్యమైన విషయమే ఉందిగా — కాశీ సంగతి మాట్లాడ్డం. అంతకన్న మీకూ నాకూ రుచించే విషయం మరొకటేముంటుంది. ?

పూ (నిట్టూర్చి) అయ్యో ! నా తెలివి ఆయనికి మందివ్వలేదు.

గో : బాబుగారింట్లోలేరండి. మీరు మర్చిపోయినట్లున్నారు.

పూ ఆయనొచ్చేసరికి సిద్ధంగా ఉంచొద్దూ ఇప్పుడే వస్తాను. అదిగో మాటలోనే వచ్చారు. మీకు మందు తెస్తా (బెనర్జీ వస్తాడు.)

బె : మందా ? ఓహో ! మందా... !

పూ . పట్టుకొస్తా.

బె : అక్కర్లేదు. నేనేవచ్చి తాగుతానే పడుకోబోయేముందుగదా— (పూర్ణిమ వెళ్ళిపోతుంది. బెనర్జీ వెళ్ళి తన కుర్చీలో కూచుంటాడు. ఒకపత్రిక తీసి చదవబోతాడు )

గో . నేను రేపు ఉదయం రైలుకి వెళ్ళాలండి.

బె · ఆఁ వెళ్ళాలా ?

గో . ఎల్లుండి డ్యూటీలో చేరాలి.

బె : మంచిదినాయనా ! ఒచ్చిమాయింట్లో వున్నావు. అదే సంతోషం. ఇంక

పడుకో నాయనా! పొద్దు పోయి నట్లుంది.

గో : మాకుప్రొద్దుపోవడం ఏమిటండి? అసలు రాత్రి పగలు కూడా తేడా లేదు మాకు.

బె : ఏమిటినాయనా, ఏమిటన్నావు?

గో : బాబుగారూ! మీరెప్పుడూ యింత పరధ్యానంగానే వుంటారా?

బె : వయస్సయిపోయిందిగదా నాయనా!

గో : మీ అంత చలాకీగా అన్ని విషయాల్ని గురించి మాటాడగల మనుషులు చాలా అరుదంటాడు మా కాశీ—మీ పరధ్యానం చూస్తే నా కాశ్చర్యం వేస్తోంది.

బె : ఒంట్లో అంత బాగాలేదు నాయనా. నేనువెళ్ళి పడుకుంటాను. (బెనర్జీ వెళ్ళిపోతూండగా అపర్ణ ఒక కూజాతో నీళ్లుతెచ్చి బల్లమీద పెడుతుంది.)

అ : మీ కింకేమన్నా కావాలా?

గో : కావాలి. (అపర్ణ అతనికేసి తిరుగుతుంది.) మీరలా కూర్చోవాలి. (ఆమె అనుమానిస్తుంది) నేను సైనికుణ్ణి కనుక మర్యాద నతిక్రమిస్తానని మీ కనుమానముంటే వెళ్ళిపొండి

అ : ఎందుకలా అంటున్నారు?

గో : మీరంతా నన్ను పరాయివాణ్ణిలా ఎందుకు చూస్తున్నారు?

అ : మీకేమన్నా లోపం చేశామా?

గో : అపర్ణాదేవీ? మీ రేమీ లోపంచెయ్యలేదు. పైగా అనవసరమైనంత శ్రద్ధ చూపిస్తున్నారు. కాని ఈ ఆతిథ్యంలో ఆదరం, అనురాగం లోపించినట్టు నా కర్థమౌతోంది.

అ : అది పొరబాటు.

గో : పొరబాటే. ఇది నా యిల్లనుకోవడం, మీరంతా నా వాళ్ళనుకోవడం పెద్ద పొరబాటు.

అ : మీ మనస్సుకు కష్టం కలగడం నిజంగా మా దురదృష్టం. మామయ్యా అత్తయ్యా మిమ్మల్ని మా యింట్లో మనిషిగానే అనుకుంటున్నారు. నాకు తెలుసు.

గో : అయితే మీరు మాత్రం నన్ను అనవసరంగా యింట్లోదిగిన అతిథి ననుకుంటున్నారా?

అ : లేదు...మీరు...మా...బావకి...

గో : ప్రాణస్నేహితుణ్ణి. మాకు శరీరాలు రెండుగాని ప్రాణం ఒకటే.

అ. ప్రాణం ఒకటే (ఎక్కడో ఆలోచిస్తున్నట్టు అంటుంది.)

గో : మా యిద్దరి మధ్య దాపరికాలు లేవు. మీరు వ్రాసీన ఉత్తరాలైనా సరే—నా కతను చదివి వినిపిస్తాడు. మీరో కొత్తపాట తయారు చేసుకున్నారట. మీ దగ్గర నేర్చుకునొచ్చి తనకు వినిపించాలన్నాడు. నా కాపాట నేర్పరూ?

అ: పాటా! నేను పాడలేను. నా గొంతు యింక పలకదు (అపర్ణ తొందరగా వెళ్ళిపోతుంది. గోపాలరావుకి యిదేమీ అర్థం కాక చూస్తుంటాడు. దీపాలు సన్నగిల్లి పోతాయి.)

*　*　*

(మళ్ళీ దీపాలు వెలుగుతాయి. గోపాలరావు చొక్కా తొడుక్కొని బొత్తాలు పెట్టుకుంటూ వుంటాడు.)

బె: కాఫీ, టిఫిన్ అయిందా నాయనా!

గో: అయిందండి.

బె: (ఒక రిస్టువాచీ ఇస్తూ) నీ చేతికి లేదుగా యుద్ధరంగంలో ఒంటరిగాడవై పోయినప్పుడు, యిదన్నా నీకు తోడుగా వుంటుంది.

గో: కాళీ ఎప్పుడూ నాదగ్గరే ఉంటాడు. నేనెన్నటికీ ఒంటరిగా ఉండను.

బె: యుద్ధంలో ఏ క్షణాన ఏం జరుగుతుందో ఎవరు చెప్పగలరు? నీ కవసరం లేదని తోస్తే అవసరమున్న తోటిసైనికుడి కెవరికన్నా ఇయ్యి నాయనా!

(పూర్ణిమవచ్చి తన భుజంమీద శాలువాతీసి యిస్తుంది.)

పూ: బాబూ యిది తీసుకెళ్ళు.

గో: అమ్మగారూ! మీరు కప్పుకునేది—

పూ: నాకంటె మీటిఅవసరం మీకెక్కువ నాయనా! ఇంకేం చెప్పొద్దు.

గో: నాకోరగ్గుంది. పోనీ మీరిచ్చారని కాళీ కిస్తాను.

బె: అక్కర్లేదు నాయనా! వాడికి అవసరముండదు.

పూ: వాడేమిటి నువ్వేమిటి, అక్కడ యుద్ధం చేస్తున్న వాళ్ళంతా మా బిడ్డ ల్లాంటివాళ్ళే - ఏదో మమకారం కొద్దీ అనుకోడంతప్ప.

బె: మేం ముసలాళ్ళం నాయనా! ఎన్నో



చాదస్తాలుంటాయి. మేం ఏంచేసినా నువ్వేమీ మనస్సులో పెట్టుకోవద్దు.

గో : బాబుగారూ ! నిన్నరాత్రి అపర్ణతో నే నన్న మాటలు మీకు కష్టం కలిగించి నట్టున్నాయి.

బె : అపర్ణతోటా ? నువ్వేమన్నావోనాకు తెలియదు. అయినా మాకు తెలీకుండానే కొన్నిలోటుపాట్లు జరిగుంటాయని నాకు తెలుసు. అందుకోసం అన్నాను.

గో : బాబుగారూ ! మాకాశీ తలిదండ్రులు మీరు. నాకూ తల్లిదండ్రులే తలిదండ్రులకీ బిడ్డలకీ మధ్య లోటుపాట్ల ప్రశంసే వుండదు. నాకింక శల విప్పిస్తారా !

బె : ఒక్కక్షణం ఆగునాయనా ! అపర్ణ ఏదో కానుక్కొరావడానికి బజారు కెళ్ళింది. ఒచ్చేస్తుంది.

గో. ఈ కానుకలతో నన్నుచాలా మొగమాట పెట్టేస్తున్నారు.

బె : నాయనా ! తలిదండ్రులకీ బిడ్డలకి మధ్యకానుకల ప్రశంసమాత్రం ఎందుకుంటుంది ? పది రోజులపాటు అన్ని బాధలూ మర్చిపోయి బంధువులమధ్య ఆప్తులమధ్య ఆనందంగా వుండాలని వచ్చావు. మావంటివారికోసం ప్రాణత్యాగానికైనా వెనుదీయక యుద్ధరంగంలోకి మళ్ళీ దూకబోతున్నావు. ఈ శలవుదినాలు నీ కెంతో విలువైనవి. అవి వ్యర్థం కాకూడదన్నాత్రం మా కెంతైనావుంది. అయితే మేము ఎంతవరకు నిన్ను సుఖపెట్టామో నా కనుమానంగానేవుంది.

గో : బాబుగారూ ! మీ రింతదూరం నాకు చెప్పనక్కర్లేదు.

పూ : నాయనా ! కన్నబిడ్డల్ని యుద్ధరంగంలోకి పంపించి అన్నిప్రాణాలూ వాళ్ళమీదే పెట్టుకున్న తల్లి దండ్రు లీదేశంలో ఎంతోమంది వున్నారు. అందులో మేము కూడా ఒకళ్ళమని నీకు గుర్తుంచేవాలు నాయనా !

గో : మిమ్మల్నెల్లా మర్చిపోగల నమ్మగారూ! మా కాశీ తలిదండ్రులు మీరు.

బె : అదిగో అపర్ణ.

అ : గోపాలరావుగారూ ! ఈ ట్రాన్సిస్టరు రేడియో మీకోసం తెచ్చాను.

గో : నా కోసమా ! మీ బావకోసమా. అపర్ణాదేవీ !

అ : మీ యిద్దరికీ బేధమే లేదని మీరే అన్నారుగా?

గో : అవును. ఇద్దరం ఒకరిప్రక్క ఒకరం పడుకుని ఉంటాంలెండి. నే నసలు ఈ బహుమానాలకోసమే యిక్కడకు వచ్చినట్టుంది.

బె : లేదునాయనా ; నువొచ్చింది మా కాశీకోసం. ఇవన్నీ మేము నీ కిస్తున్నది కూడా — ఒకరకంగా కాశీ కోసమే.

గో : ఆమాటకి నేనింకేమీ సమాధానం చెప్పలేను. అమ్మా వెళ్ళొస్తానమ్మా ?



పూ. భగవంతుడు నీకు దీర్ఘాయువు యివ్వాలినాయనా, వెళ్ళిరా!

గో: ఇన్ని బహుమానా లిచ్చారుగాని, అసలు బహుమానంసంగతి మర్చిపోయారు.

బె. ఏమిటది?

గో: మీ రెవ్వరూ కాశీకి చెప్పవలసిన మాటలేవీలేవా?

(ముగ్గురూ కొంచెం ముఖాలు త్రిప్పుకుంటారు.)

నేను కనబడగానే కౌగలించుకుంటాడు. మా అమ్మేం చెప్పింది; నాన్నేం చెప్పారు, అపర్ణేంచెప్పిందని అడుగుతాడు నేనడగలేదు – వాళ్ళు చెప్పలేదంటే అతని మనస్సెంత నొచ్చుకుంటుందో మీకు తెలియదా?

(అతను తన ధోరణిలో మిగతావాళ్ళని అట్టే పరీక్షచేయకుండా చెప్పుకుంటూ ఒక ప్రక్కకొస్తే – బెనర్జీ, అపర్ణ పూర్ణిమకు చెరో ప్రక్కకి వస్తారు. ఇంక ఆపుకోలేక పూర్ణిమ బావురు మంటుంది.)

పూ: (ఏడుస్తూ) వాడు నిన్నింకేమీ అడగడు నాయనా! (బెనర్జీ, అపర్ణ, చెరో ప్రక్కన ఆమెనుపట్టుకుంటారు.)

గో: అమ్మా...బాబుగారూ?!...కాశీ అయితే కాశీ.

బె: ఇకలేడు నాయనా! మొన్నరాత్రి తెలిసింది.

గో: కాశీ....(వెక్కి-క్కి- ఏడుస్తాడు.)

బె: మా గుండెల్లో బాధ నీకేమాత్రం తెలియకుండా ఉండాలని ఎంతో ప్రయత్నించాం. కాని మావల్ల కాలేదు. నీ శలవల్లో అఖరి రోజు

ఈ విధంగా ముగియడానికి కారణం— దీనికి మా బలహీనమే నాయనా!

గో: మీరా బలహీనులు బాబుగారూ! ఏ మహావీరుడూ ఏ యుద్ధరంగంలోనూ ప్రదర్శించలేని అమానుషమైన ధైర్యం, జీవితరంగంలో ప్రదర్శించిన అజ్ఞాతశూరులు. మీరా బలహీనులు? ఒక్కగానొక్క బిడ్డని, అందులోనూ మా కాశీవంటి బిడ్డని చైనా పెనుభూతం బలిగొన్నా చలించక, మహా సముద్రమువంటి గర్భశోకాన్ని మనస్సులోనే బిగపెట్టుకుని నావంటి ఒక సామాన్యుడికోసం, పెదవులపై చిరునవ్వు చెదరనీయని మహానీయులు మీరు. మీ నిగ్రహాన్ని మీ చిత్తస్థైర్యాన్ని అపార్థంచేసుకుని మీ మహత్వానికి అపచారంచేసిన మూర్ఖుణ్ణి. నన్ను మన్నించండి. (గోపాలరావు ఆ దంపతుల కాళ్ళ మీద పడతాడు. బెనర్జీ, పూర్ణిమ అతన్ని చెరొక్కచెయ్యి పట్టుకు లేవనెత్తుతారు.)

పూ: లే తండ్రీ!...మా కాశీ చచ్చిపోలేదు నాయనా! నువ్వే మా కాశీవి.

బె: నాయనా! కాశీ!

గో: బాబుగారూ! (గోపాలరావు అతన్ని కౌగలించుకుంటాడు.)

బె: వెళ్ళు నాయనా! చైనా దురంతకులను దేశంపొలిమేర అవతలకి తరిమివేసి తిరిగిరా నాయనా! వెళ్ళు.

గో: వెడతాను. దురాక్రమణ పరులను చీల్చి, చెండాడి, దేశాన్ని రక్షిస్తాను. ఏ మహత్వం నాటినుండి నేటివరకు మీ వంటి మహాపురుషులలో సజీవ స్రవంతిగా ప్రవహిస్తోందో—ఏ మహత్వం ఈ భారత భూమిని పుణ్యభూమిగా చేసిందో ఆ మహత్వాన్ని ప్రాణాలొడ్డి కాపాడుకుంటాను. (ఈ లోగా అపర్ణ కుంకుమభరిణె తెస్తుంది.)

అ: అన్నా!

గో: చెల్లీ!

అ. (అతనికి కుంకుమతో తిలకంపెట్టి) ఈ వీరతిలకం నీకు శ్రీరామరక్ష కావాలి.

గో: చెల్లీ! నీ బావను బ్రతికించి తేలేను. కానీ అతని అకాలమరణానికి కారకులైన దుండగులను సమూలంగా దునుమాడి మీరుణం తీర్చుకుంటాను.

జై హింద్

(గోపాలరావు వెళ్ళిపోతాడు. ముగ్గురూ గంభీరమైన ముఖాలతో అతను వెళ్ళినవైపు చూస్తూ నిలబడతారు.)






ప్రదర్శనమున పాల్గొన్నవారు

| | |
|---|---|
| శ్రీ జగ్గయ్య | జగ్గా |
| శ్రీ గుమ్మడి | తండ్రి |
| శ్రీమతి లక్ష్మిరాజ్యం | తల్లి |
| కుమారి జమున | మూనీ |

[నీఫా ప్రాంతం. బొందిలా సమీపంలో ఒక కుగ్రామం. చైనావాళ్లు మీదికొచ్చిపడుతున్నారనే వార్తలతో జనంలో ఉద్రేకం బయలుదేరింది. పౌరజనమంతా ఖాళీచేసి సురక్షిత స్థానాలకు వెళ్ళవలసిందిగా — భారత సైనిక కార్యాలయం ఆదేశించింది.

ఆ వూళ్ళో ఒక ఇల్లు; చిన్న సంసారం. ఓ వైపున నులకమంచంమీద ముసలి తండ్రి కూచొని, దగ్గుతో బాధపడుతూంటాడు. మంచానికి కొంచం ఇవతలగా తల్లి - హుక్కాలోకి ఆకులు నూరి - కూరుతూ వుంటుంది. మంచానికి వెనగ్గా 'మూనీ' (కోడలు) నిలబడి — ముసలివాడి వీపుమీద వేన్నీళ్ళ కాపడం పెడుతూ ఉంటుంది.

క్షణం సేపయ్యాక — వంటింటిలోపల్నుంచి 'జగ్గా' ప్రవేశిస్తాడు ఆ ముసలి దంపతుల కతనొక్కడే కొడుకు - బయటికి వెళ్ళడంకోసం దుస్తులూ, పరికరాలూ సర్దుకుంటూంటాడు. కాస్సేపు ఎవ్వరూ మాట్లాడరు. దూరంగా ఒకటి రెండు గొట్టెల అరుపులు వినిపిస్తాయి.]

జగ్గా. బాబా ! ఇప్పటికైనా నా మాట వినరా ?

తండ్రి : ఏమిట్రా నువ్వనేది ? అది జరగనిపని.

తల్లి : జగ్గా ! ఇన్నేళ్ళనుంచీ లేనిభయం — ఇప్పుడే మొచ్చిందిరా ? ఎక్కడో

ముక్కూ, మొహం తెలియని చోటి కెళ్ళమంటే ఎట్లారా ?

జ · అదికాదమ్మా ! చీనీవాళ్ళు కందిరీగ ల్లాగా కమ్ముకొస్తున్నారు. ఏ క్షణంలోవచ్చి పడతారో చెప్పలేం. వాళ్ళు మనుషులు కాదమ్మా ! రాక్ష సులు-మీ రందరూ ఇక్కడేవుంటే, ఏంముప్పు ముంచుకొస్తుందో ఎవరికి తెలుసు ?

తం ఏమిట్రా ముంచుకొచ్చేది ? ఏ చీనీ వాళ్లైతే మట్టుకు, మమ్మల్నేం జేస్తార్రా ?

జ అదికాదు బాబా ! వాళ్ళెంత కిరాత కులో మీకు తెలియదు నెత్తురు రుచి మరిగిన చిఱతపులుల్లాగా, మనుషుల ప్రాణాలతో చెలగాటమాడ్డం వాళ్ళకి సరదా ! అందుకే ముసలీ ముతకా, ఆడవాళ్ళూ అందరూ మైదానాలకి పోయి తలదాచుకోటం మంచిదని, సర్కారువాళ్ళు కూడా చాటింపేశారు. మీరింత మొండిపట్టుపట్టి, ఇక్కడుండి చేసేదేమిటి చెప్పండి ?

(ఇంతలో మూనీ వేన్నీళ్ళకుండ తీసుకుని లోపలి కెళ్తుంది.)

తం : జగ్గా ? అయితే మాకు పిరికిమందు పోస్తావట్రా ? ఎవడైనా ఎన్ని గుండెల్తో ఈ ఇంట్లో అడుగుపెడ తాడ్రా ? ఒరేయ్ ! వొంటికి ముసలి తనం వొచ్చినా, ఈ నరాల్లో ఇంకా సత్తువ చావలేదురా ! హుం, కొండ జాతిలోపుట్టి, ఎవడో పచ్చమెకానికి భయపడి, పారిపొమ్మంటా వంట్రా ? ... (దగ్గు) ... ఇహ మాట్టాడక. మాకేం ఫరవాలేదులే ? నువ్వెళ్ళిరా !

త : చూడు నాయనా ! ఉన్న ఊరూ, కన్న తల్లీ అన్నారు. తాతముత్తాతల నాటినుంచీ - ఈ గడ్డమీద పుట్టాం, పెరిగాం. ఈ నాటికి పరాయాళ్ళకి పాలుమాలి, నమ్ముకున్న నేలకి· నీళ్లొదులుకోమంటావా ? ... నీకు తెలియదు జగతా ! ఈ కొండలూ, ఈ వాగులూ, ఈ గాలీ, ఈ వెలుతురూ - ఇవేరా మన బతుకులు ! ఈ పేగుముడి తెంచుకొని - ఎక్కడి కెళ్ళమంటావురా ? గుప్పెడుప్రాణాల కోసం - కోటిజన్మలఋణం - కూల దొయ్యమంటావా ?

(మూనీ మెల్లగా ప్రవేశించి, ఉన్నితకిలీ తిప్పుతుంటుంది.)

జ : అమ్మా ! నేనుచెప్పేది మీకర్థం కావడంలేదు. నాకుమాత్రం పుట్టిన గడ్డమీద మమకారంలేదా ? దాన్ని కాపాడుకోడానికేగా, నేను బయలు దేరిందీ ? ఆ చీనీవాళ్ళని చిత్రవధ చేసి, దేశాన్నీ, గౌరవాన్నీ, నిల బెట్టుకోడానికేగా మేమంతా దండులో చేరుతున్నది ? మారక్తాన్ని ధార పోసైనాసరే, ఆ దుర్మార్గులకి బుద్ధి చెప్పాలనేగా -

మూ (మధ్యలో అందుకుంది) ఏమండీ, మీరు బయటచేసేపని- మేముఇంట్లో వుండి చేయకూడదా ?

జ (ఆశ్చర్యంతో) మూనీ ! (దగ్గర కెళ్తాడు )

మూ అవును మమ్మల్నందర్నీ ఇల్లూ, వాకిలీ విడిచిపెట్టి, ఎందుకు వెళ్ళ మంటున్నారు ? మా ప్రాణాల్నీ, దేశాన్నీ మేముమాత్రం కాపాడుకో లేమా ?

జ కాదు మూనీ ! మేమంతా యువ కులం. అది మా కర్తవ్యం. మేం బ్రతికుండగా మీకే అపాయం రాకూడదు. అందుకే మిమ్మల్ని సుర క్షితమైన చోటికి వెళ్ళమంటున్నాను.

మూ పుట్టినచోటుకంటె రక్షణ వేరే ఎక్కడుంటుంది? కష్టమో, సుఖమో మీతోనే పంచుకుంటాం. చావో బ్రతుకో ఇక్కడే తేల్చుకుంటాం.

తం బాగా చెప్పావమ్మా !...ఒరేయ్ జగతా ! నువ్వెన్ని చెప్పినా మేం మాత్రం మా బొందిలో ప్రాణ ముండగా ఊరువిడిచి వెళ్ళేదిలేదు... ఇదుగో; మీకుర్రాళ్లందరూ దండులో చేరి దూరాన యుద్ధంచేస్తుంటే_మా ముసలీ, ముతకా ఇక్కడేవుండి- ఊరు కాపాడుకుంటాంరా ! తెలి సిందా ?

త అవును నాయనా ! కష్టమొచ్చి నప్పుడే కలిసినిలబడాలి.

మూ : ఏమండీ ! ఈ దేశం_మనకి దేవు డిచ్చిన వరం ! ఇదే మనదేవళం ! ఇందులో అడుగుపెట్టే హక్కు- బయటివాడికిలేదు. ఎవరైనా దీన్ని అపవిత్రం చెయ్యాలనుకుంటే- వాళ్ళని అడ్డుకునే హక్కూ, బాధ్యతా మీకెంత ఉందో, మాకూ అంతే వుంది !...అయినరోజున అనుభ వించి, కానిరోజున కాలదన్నిపోతే దేవుడు మాత్రం క్షమిస్తాడా ? మమ్మల్ని గురించి మీరేం భయపడ కండి...మీ ధర్మాన్ని మీరు నెర వేర్చండి.

జ : (అందరివంకా చూస్తాడు) సరే మీకే ఆపదా రాకూడదనే ఆదుర్దాతో ఇంతదూరం చెప్పానేగాని, మీరంతా ధైర్యంతో నిలబడితే_నాకుమాత్రం ఆనందంకాదూ ? ... కాని మూనీ మీరు మాత్రం చాలా జాగ్రత్తగా ఉండాలి. ఆ కసాయి వాళ్ళు ఎప్పుడు ఏ మూలనుంచి విరుచుకు పడతారో చెప్పలేం.

తం : జగతా ! ఇట్లారా ! (జగ్గా తండ్రి దగ్గర కెళ్తాడు.)

జ : ఏం బాబా !

తం : ఇప్పుడు మీరంతా ఎటువైపు కెళ్తున్నార్రా ?

జ : తూరుపు మూలగా పదిమైళ్ళ దూరంలో చీనీవాళ్ళు మజిలీచేశారట బాబా ! మేమంతా రహస్యంగా

అక్కడికెళ్ళి — వాళ్ళను మట్టు పెడతాం. మన కుర్రవాళ్ళమందరం యాభైమందిదాకా ఉన్నాం. ఈ జట్టుకి నేనే సరదార్ని బాబా!

తం. భేష్! (మెల్లగా లేచి నిలబడి, కొడుకు రెండు బుజాలూ పట్టు కుంటాడు) జగతా! మనం కొండ జాతివాళ్ళం. ఎవరికీ, ఎన్నడూ ఏ అపకారంచేసి ఎరగం. అలాంటి మన గుండెల్లో చీనీ వాళ్ళు అన్యా యంగా చిచ్చుపెట్టటాని కొచ్చారు. వాళ్ళమీద బాగా కసితీర్చుకో! కొండ జాతి వీరుడివనిపించుకో!... (మెల్లగా తన తలగడక్రింద ఉన్న కత్తి తీస్తాడు.) ఇదిగో! ఇది నా తండ్రి నాకిచ్చిపోయాడు. ఇవేళ నేను నీకిస్తున్నాను. (కత్తి ఇస్తాడు) నువ్వొక్కడున్నా, ఇది తల్లిలాగా విన్ను కాపాడుతుంది!

[జగ్గా కత్తితీసి బొడ్లో దోపుకుంటాడు. తండ్రివంక తేరిపార చూస్తాడు.]

జ: బాబా! (అని తండ్రిని కౌగలించు కుంటాడు. ముసలివాడికి ఉద్రేకంలో దగ్గుతెర వస్తుంది.)

[ఈలోపుగా తల్లి వంటింట్లోకి వెళ్ళిపోయింది. మూనీమాత్రం ఓరగా నిలబడివుంది.]

జ: మూనీ! (అంటూ దగ్గరకొస్తాడు)

మూ: (అతని గుండెల్లో తలదాచు కుంటుంది కళ్ళు చెమ్మగిలతాయి.)

జ: మూనీ! అమ్మనీ, బాబానీ జాగ్రత్తగా చూసుకో! నీదే బాధ్యత (మూనీ మాట్లాడదు. ఆమెను లేవ దీసి) మూనీ! ఇంత సేపూ నాకు ధైర్యం చెప్పి, నువ్వు దిగులు పడతావేం?

మూ (లేతగానవ్వి) దిగులుకాదండీ మీ మనసులో దీవెనలందుకుంటు న్నాను

జ: (బుగ్గలునొక్కి) పిచ్చీ! (తనమీద వున్న రుమాలుతీసి, మూనీ మెళ్ళో ముడివేస్తాడు) మనిద్దరి మధ్యా ఎడ తెగని బంధానికిది గుర్తు!

మూ: (ఆనందంగా కళ్ళు మూసుకుని) మీ మూనీ ఎప్పుడూ మీతోనే ఉంటుంది ఎన్నిజన్మలకైనా మీలోనే ఉంటుంది!(కాళ్ళకు నమస్కరిస్తుంది)

(జగ్గా ఆమెను లేవనెత్తుతుండగా, తల్లి చేతిలో ఒకచిన్నమూటతో తిరిగివస్తుంది.)

జ. అమ్మా! (అని తల్లిదగ్గర కొస్తాడు)

త. బాబూ! ఇంద! (మూట అంది స్తుంది.)

జ: ఏమిటమ్మా యిది?

త: దారిలో ఆకలైతే తింటానికినాలుగు రొట్టెలూ, దుంపలూ మూటకట్టాలే

జ. (నవ్వి) ఏంటమ్మా నీపిచ్చి! యుద్ధాని కెళ్ళేవాళ్ళకు ఒక్కపూట తిండి మూట గట్టియిస్తే — అయిపోతుందామ్మా?

త. ఇప్పుడట్లాగే అంటావులే నాయనా నీ కడుపునా ఒకకాయకాస్తే—అప్పుడు తెలుస్తుంది. (జగ్గా, మూనీ ఒకి

రొకరు చూసుకుంటారు మూసీ సిగ్గు పడుతుంది

జ  వెళ్లొస్తానమ్మా

త  మంచిది నాయనా! కులాసాగా తిరిగిరా!



(జగ్గా తల్లికాళ్ళకు నమస్కారంచేసి రెండడు గులు ముందుకువేస్తాడు)

త : (కొడుకుని ఆపుతూ) జగ్గా !

జ : ఏమ్మా !

త : (తనమెళ్ళోఉన్న పెద్దపూసలదండ తీసి కొడుకుమెళ్ళో తగిలిస్తుంది.) నిదట్లోనైనాసరే – ఇది మెళ్ళోనుంచి తియ్యబోకు బాబూ !

జ : అలాగేనమ్మా ! మూనీ – వస్తా బాబా !

(జగ్గా బయటికి వెళ్తుండగా, ముగ్గురూ మెల్లగా ముందుకుసాగి . ఆవైపే చూస్తుంటారు.)

* * *

(అదేచోటు. ముసలివాడు మంచంమీద కూచుని రొట్టెలు తింటూంటాడు. మూనీ ప్రక్కనే నిల్చొని ఉంటుంది. బయట తలుపులువేసి ఉన్నాయి.)

మూనీ : బాబా ! బయటెక్కడా మనిషి అలికిడి వినపడటంలేదు. ఉత్తరపు వేపునుంచి చీనీవాళ్ళు పొలిమేరదాటి వొచ్చేశారంట బాబా ! ఊళ్ళో ఎక్కడ వాళ్ళక్కడ తలుపులు బంద్ చేసుకున్నారు.

తం : ఫరవాలేదులే అమ్మా ! వాళ్ళువచ్చి మాత్రం ఇక్కడేం నిభాయించు కుంటారు ?

మూ : ఏమో బాబా ! తూర్పుకోనల కెళ్ళిన మనవాళ్ళకబురూ తెలియలేదు!

తం : పిచ్చితల్లీ ! వాళ్ళకేవమ్మా ! పిడుగుల్ని కూడా పిండి చేసుకొస్తారు !...అది సరేగాని – ఇందాకెప్పుడో బయటకుపోయింది మీ అత్త ! ఇంకా రాలేదేం ?

మూ : నేనూ అందుకే ఎదురు చూస్తున్నాను బాబా ! గొట్టెల్ని సర్దుకొస్తానని వెళ్ళింది. చాలా సేపయింది. ఈ పాటి కొస్తూండాలి.

(అంటూ లోపలికి వెళ్ళబోతూండగా, బయట తలుపు కొట్టినచప్పుడు.)

మూ . (ఆగి) అదిగో అత్తయ్య వొచ్చినట్టుంది.

(వెళ్ళి తలుపుతీస్తుంది. ఒక్కసారిగా మూనీ 'అ'అని కొయ్యబారిపోయింది. తుపాకి గురిపెట్టి ఒక చైనా సైనికుడు లోనికివచ్చి – వెంటనే తలుపు గడియవేశాడు. మూనీ భయంతో ఒక్కొక్క అడుగే వెనక్కు వేసుకుంటూవచ్చి – మంచం ప్రక్కన ఆగి పోయింది.)

తం : (ఏమీతోచని కోపంతో) ఏయ్ ! ఎవరునువ్వు ? ఏంపని నీకిక్కడ ?

చై : ష్...(మాట్లాడకూడదని సైగచేసి, తుపాకీ గురిపెట్టి – నాలుగుమూలలూ వెతుకుతాడు. వంటింటి గుమ్మందగ్గర క్షణంనిలబడి లోనికి తేరిపార చూస్తాడు. ఒకమూల జగతాజోళ్ళూ, లాగూ కనిపిస్తాయి. వాటివంకే చైనా వాడు పరీక్షగా చూస్తూంటాడు )

తం : ఏయ్ ! ఏమిటీ దౌర్జన్యం ? (లేస్తాడు )

[చైనావాడు మాట్లాడడు.]

తం : మాట్లాడవేం ? (గద్దిస్తాడు)

చైనా : ష్ !...(దగ్గరకెళ్తాడు. జగ

బట్టలవంకా అతనివంకా అర్ధ యుక్తంగా చూస్తాడు )

తం ఏమిటీ చొరబడిరావటం పో బయటికి !

[చైనావాడు మళ్ళీ 'ష్'అంటూ ముసలివాడి బుజంమీద చెయ్యివేసి నొక్కుతాడు అతను కూలబడతాడు ]

తం (కోపంతో) రేయ్ ! ఎవడను కున్నావురా నువ్వు—నడు బయటకి

చై (ఒక్క అదటున ముందరున్న రొట్టెల మూకుడు ఎగరకొట్టాడు) ఖామోష్ ! కహాఁ—కహాఁ—జవాన్—జవాన్ లోగ్—కహాఁ

తం ఆ—ఇక్కడ ఇక్కడ కుర్రవాళ్లెవరున్నారు ? లేరే ? ముసలివాళ్లం మేమూ ఆ పిల్లాతప్ప ఇంకెవ్వరూ లేరు

చై ఝూటా ! తుమ్ తుమారా బేటా—కహాఁ ?

తం మా మా అబ్బాయా ? లేడే లేడు, ఎవ్వరూ లేరు !

చై ష్ ! కబడ్దార్ ! ఏ—ఏ (బట్టలు చూపిస్తాడు )మాలుమ్ మాలుమ్ గాఁవ్ మేఁ జవాన్ ఏక్ నహీ హై కహాఁ ? . కహాఁ గయా ?

తం ఏమో ఊళ్ళో సంగతులు నాకు తెలియవు తెలిసినా నీకు చెప్పాల్సిన అవసరంలేదు

చై ఏయ్ ! నై బోల్తే ? నై ?

తం చెప్పను



చై : బద్మాష్ ! (అని గట్టిగా లెంపకాయ కొడతాడు)

మూ : బాబా ! (అని అరుస్తుంది.)

తం : దుర్మార్గుడా ! ఎన్నిగుండెల్రా నీకు ? కాని దేశంనుంచి వచ్చి, మా గడ్డమీద కాలు బెట్టి - మా మీదే దౌర్జన్యం చేస్తావట్రా ? నీచుడా ! నీవంటి తొడేళ్ళ బెదిరింపులకు లొంగిపోయేఘటంకాదురా ఇది ? మీ తుపాకులకు జడిసిపోయి, మా దేశాన్నీ, మా భవిష్యత్తునీ మీపాదాల ముందు పరదాలుగా పరుస్తామనుకున్నారట్రా ? అది జరగనిపని. ఎన్నటికీ జరగనిపని.

చైనా . అయ్ ! (తుపాకీ ఝళిపిస్తాడు.)

తం : ఏంచేస్తావురా పిరికిపందా ! దొంగతనంగా ఇళ్ళల్లో జొరబడి - ఏపాపమెరుగని అమాయకుల్ని హింసించుకుతినే నువ్వా ఒక మనిషివేనా ? పైగా మాకుర్రవాళ్ళ ఆచోకీ నీకు చెప్పాలా ! చెపితే ఏం జేస్తావురా ? వాళ్ళనికూడా వెన్నుపోటుపొడుస్తావా కిరాతకుడా ! అదిమాత్రం నీతరంకాదు - ఇదిగో చెప్తున్నాను విను. వాళ్ళఉనికి తెలుసుకోవటం మీవల్లకాదు. మీ చీనీ పిశాచాల్ని చిత్రవధ చెయ్యడానికే వాళ్ళంతా పొంచుకుని ఉన్నారు. మీ అహంకారాన్నీ, అత్యాచారాన్నీ, కత్తిపోటుతో కప్పిపెట్టడానికే కంకణం కట్టుకున్నారు. మీ అందరికీ చావు తప్పదురా ! చావుతప్పదు.

(ముసలివాడు ఉద్రేకంతో మంచంప్రక్కనే ఉన్న కర్రతీసి - బలంగా చైనావాణ్ణికొడతాడు చైనావాడు రెండుచేతుల్తో కర్రపట్టుకుని మెలికవేసి - ముసలివాణ్ణి తోసేస్తాడు. ముసలివాడు మంచంమీద పడిపోతాడు. అపుకోలేని దగ్గు. మూనీ "బాబా" అని దగ్గరకు పరిగెత్తుతుంది. కాని చైనావాడు కర్కశంగా అవతలికి తోసేస్తాడు. నావాడు చైమంచంమీదగుడ్డ తీసుకుని ముసలివాడిచేతులు వెనక్కి విరిచి కడతాడు.)

చై : బోల్ ...వోలోగ్ కహాఁహై ! భారత్ ఫౌజ్ కహాఁ ? ...బోల్

తం : (ఆయాసంతో) చెప్పను...చచ్చినా చెప్పను...

చై : నై : ... నై ? ... (తుపాకీ మడమఎత్తి డొక్కలో ఒక్కపోటు పొడుస్తాడు.)

తం : ఆఁ ! (పెద్దమూలుగు - ప్రాణాలు కడబట్టిపోతాయి. నోటివెంట రక్తం చిమ్ముతుంది.)

మూ : బాబా ! (అని వెర్రిగా వెళ్ళి కావలించుకుంటుంది.)

చై : ఏయ్ !... బోలో ... బోలో నైతో ... మర్‌నా... దేఖా ? మై చీనీ...చీనీ... కబడ్‌దార్ !

తం : (ఆవేశంతో)నా...నా ప్రాణాలు పోయినా ఫరవాలేదు. కాని... నా బిడ్డలకీ... నాదేశానికీ మాత్రం ద్రోహం చెయ్యలేను...

చై : (కోపంతో) క్యా? (మళ్ళీ తుపాకితో పొడుస్తాడు.)

(మూనీ ఈ నరకం చూడలేకపోతుంది పరిగెత్తి వాణ్ణి ఆపుతుంది.)

మూ : సిపయ్యా!....ఎందుకొయన్నలా హింసిస్తావు?...మనుషుల ప్రాణాలు తియ్యడమే నీకు సరదా అయితే, నన్ను చంపు...నన్ను చంపు!

చై : అచ్ఛా! తూ...బోలేగా? తూ బోలేగా?

మూ : ఆ! ఎక్కడున్నారో చెప్పాలా?... నాకంఠలో ప్రాణంవుండగా అది జరగదు — జరగదు.

చై . క్యా?

మూ : సిపయ్యా! నిన్ను రక్షించమని కోరడంలేదు. నీదయా దాక్షిణ్యాలు మా కక్కరలేదు...కాని...కాని... అలా ముసలివాణ్ణి పట్టుకుని నరక యాతన పెట్టడం మనుషులు చేసేపని కాదు.

చై . చూ....బోల్....బోల్‌నేసే..... తుంకోఛోడేగా...ఈనాంమిలేగా!... సైతో మరేగా...

మూ : ఛీ! నీ బెదిరింపులకు లొంగి ప్రాణాలకు భయపడి మంగళ సూత్రాన్ని మసిచేసుకోమంటావా? కన్నవాళ్ళకీ, కట్టుకున్న వాళ్ళకీ దూరమై, కళ్ళల్లో ప్రాణాలు నిలుపుకొని, దేశంకోసం తెగించి పోరాడే కర్మవీరుల్ని నీకు పట్టివ్వమంటావా? చలిలో ఆకలితో సగమైపోయి. అహో రాత్రాలూ అగ్ని తపస్సు చేస్తున్న త్యాగమూర్తుల్ని మీకు బలిచెయ్యమంటావా?... మీ లాగా మాజాతి నీతిమాలిందనుకున్నావా?

చై : చుప్ రహో! (ఒక్క తో పు తోస్తాడు. క్రుంగిపోతున్న ముసలి వాణ్ణి గట్టిగా కదిలిస్తాడు.) ఏయ్ బుఢా!

మూ : ఆగు (కోపంతో) నువ్వు పశువ్వి! పిశాచానివి! నీ ఆగడాన్ని ఆపలే మనుకుంటున్నావా? జాగ్రత్త! ఇంకొక్కసారి చేయి పైకెత్తావా, నీ ప్రాణాలు నీకు దక్కవు!

(చైనావాడు ఒక్కచిట్లించి చూస్తాడు. ఉన్నట్టుండి వికటంగా నవ్వుతాడు.)

మూ : ఏమిటా నవ్వు? నీతి, నిజాయితీలేని నీ పౌరుషానికి సిగ్గుపడక — నవ్వుతావెందుకు?

చై . (వికారంగా) అచ్ఛా..తూ అచ్ఛా.. ఔరత్ అచ్ఛా!...హ్హా హ్హా హ్హా హ్హా! (మూనీ చెయ్యిబట్టి లాగుతాడు. మూనీ పెనగులాడుతుంది. కొద్ది క్షణాల్లో — బలవంతంగా చెయ్యి విడిపించుకుంటుంది.)

మూ : (ఉగ్రురాలై) ఛీ! చండాలుడా! నేను దిక్కు లేని దాన్ననుకున్నావేమో! నీ పశుబలానికి ఆయుధబలం అండనుకున్నావేమో! పొరపాటు— ఆడదాని ఒంటిమీద చెయ్యి వేసి బ్రతికిపోలేవురా నీచుడా! ఆడదాని

కన్యాయం జరిగితే, ఆడది ఆగ్ర హిస్తే-ఆ అగ్నిశిఖల్లో నువ్వేకాదు, నీ జాతీ, నీ దేశంకూడా ఇంధనమై, సర్వనాశనమై పోతారు...జాగ్రత్త !

చై హహహహహా ? (వికటాట్ట హాసం చేస్తూ మళ్ళీ ఆమెను పట్టుకుంటాడు. విడిపించుకోడానికి మూనీ శతవిధాల ప్రయత్నిస్తుంది. చెయ్యి గట్టిగా కొరుకుతుంది. గోళ్ళతో గీరుతుంది. చైనావాడు పట్టువదలడు. బలంగా మొహంమీద కొడతాడు. మూనికి కళ్ళు తిరుగుతాయి. నీరసపడిన మూనీని-చైనావాడు లోనికిలాక్కెడు తుంటాడు. మూనీ బలహీనంగా పెనగులాడుతూనే ఉంటుంది. ''బాబా" ''బాబా''అని ఆక్రోశిస్తుంది. దాదాపు స్పృహ లేని స్థితిలోవున్న ముసలివాడీ పిలుపుకి ఉలిక్కి పడి లేస్తాడు- అర్థంచేసుకుంటాడు. లేని బలాన్నంతా కూడగట్టుకుని ఉద్రే కంతో ఉరుకుతాడు.)

తం : ఒరేయ్-పాపీ ! తుచ్ఛుడా ! రేయ్ !

[నాలుగడుగులు వేసేసరికి తూలిపడిపోతాడు. వెనక్కి విరిచికట్టిన చేతులు విడిపించుకోటా నికి విఫల ప్రయత్నాలుచేస్తాడు. ఇంతలో లోపల్నుంచి భయంకరమైన కేకవినిపిస్తుంది]

తం ; (అదిరిపడతాడు) మూనీ ! మూనీ ! తల్లీ మూనీ !

[ఉద్రేకం ఉప్పొంగేసరికి-ఒక్కసారిగా అత నికి దగ్గు ముంచుకొస్తుంది. నోటి వెంట నెత్తురు ధారపడుతుంది. కాళ్లు తేలిపోతాయి. భయాందోళనలతో వెనక్కి వెనక్కి తగ్గి నడుస్తూ-ఆఖరిసారిగా "మూనీ"అని కలవ రించి పడిపోతాడు - శాశ్వతంగా కళ్లు మూస్తాడు.]

[రెండు క్షణాలతర్వాత బయటనుంచి తల్లి ప్రవేశిస్తుంది. మంచం మీద పడిపోయిన భర్తనుచూసి గతుక్కుమంటుంది.]

త : అయ్యో ! అయ్యో ! ఏమండీ ! ఏమండీ ! ఏమిటిది ?...(దగ్గరకెళ్ళి పట్టుకుంటుంది. చేతికట్లు విప్పు తుంది-)ఆఁ—భగవంతుడా ! ఇంత లోనే ఇంత అన్యాయం జేశావా?... నేనెవరికేం పాపం జేశానని, నాకీ చిచ్చుపెట్టావు తండ్రీ ? (కుమిలి కుమిలి ఏడుస్తుంది) ... మూనీ ... మూనీ...?

(చైనావాడు లోపల్నుంచి ఒకరొట్టె విరు చుకుతింటూ మెల్లగా వస్తాడు. వాడి బూట్ల చప్పుడికి - తల్లి తలెత్తిచూస్తుంది. నిర్ఘాంత పోతుంది. చైనావాడు తాపీగా - ఒకపీట లాక్కుని కూచుంటాడు. తల్లి దుఃఖమంతా కోపంగా మారుతుంది.]

త : ఆఁ !...చీనీ సిపాయి...నువ్వా !... నువ్వా...నువ్వా... లోపలికెలా వచ్చావ్ ? నీకెవరిచ్చారీ అధికారం ? నువ్వు ... ( ఒకసారి ముసలివాడి శవానికేసి చూస్తుంది, అకస్మాత్తుగా అర్థమైంది.) నీ పనా ఇది ?...నువ్వు చేసిన దురాగతమా? ...పాపకర్ముడా ...కుక్కలాగా ఇంట్లోకొచ్చి, కరిచి

చంపుతావా? ఒంటరిగాళ్ళను చేసి, పొట్టన పెట్టుకుంటావా?
(చైనావాడు నిర్లక్ష్యంగా నవ్వుతాడు.)
ఛీ... మగాడిలాగా ఎదురుపడి పడు వాళ్ళతో పోట్లాడలేక - ఏ తోడూలేని ముసలివాళ్ళమీద నీ కసి తీర్చుకుంటావా? పల్లెత్తు అపకారం చెయ్యనివాళ్ళని చంపి పచ్చినెత్తురు తాగుతావా? ... కిరాతకుడా? రక్తానికి రక్తమే బదులు... నీనెత్తురు కళ్ళ జూస్తాను.
(వెర్రి ఆవేశంతో చైనావాడి మీదకుదూకి వాడి మొలలో ఉన్న కత్తిలాక్కొని పొడవబోతుంది. చీనావాడు ఆమె చెయ్యివిరిచి - కిందకు తోస్తాడు. ఆమె పడిలేస్తుంది.)
త : పాపిష్టీ! ఛండాలుడా (అని కత్తి చీనావాడిమీదకు విసరబోతుంది. అతడు ఛటాలున రివాల్వరుతీసి కాలుస్తాడు. ఆమె పెద్దకేక వేసి - చచ్చిపడిపోతుంది;

అదేసమయానికివంటింటిగుమ్మం దగ్గర మూనీ ప్రత్యక్షమౌతుంది. జుట్టంతా చెదిరిపోయి మనిషి భయంకరంగా ఉంటుంది. తలమీద దెబ్బ తగిలి - నొసటిమీదికి నెత్తురుకారుతూంటుంది. ఆదృశ్యాన్ని చూసిన మూనీ కోపంతో వణకిపోతుంది. పరుగెత్తుకెళ్ళి - చేతిలో వున్న కత్తితో చైనావాడివీపుమీద పొడుస్తుంది వాడుపెద్దగా అరిచిలేవబోయే లోపల - వెర్రి ఆవేశంతో - ఆ కత్తితో ఎన్నిపోట్లు పొడిచిందో లెక్కలేదు చైనావాడు కళ్ళుతేలవేసి- కిందకొరిగిపోతాడు.

మూనీ తల్లిదగ్గరకు పరిగెత్తుతుంది. "అత్తా" అని ఆక్రోశిస్తుంది - అంతానెత్తురు! ముసలివాణ్ణి చూస్తుంది. "బాబా" అని బావురుమంటుంది. కొంతసేపటికి ఏడుపుతో అలిసిపోతుంది. కళ్ళు ఎండిపోతాయి నిర్జీవప్రతిమలాగాశూన్యదృక్కులతో నాలుగడుగులు ముందుకు వేసింది. మెడలో జగతావేసిన రుమాలు చేతికి తగిలింది. మెల్లగా దానివంక చూసింది. ఒక్కసారిగా దుఃఖం పొంగి పైకొచ్చింది. ఆపుకోలేక వెనక్కి పరిగెత్తి వంటింటి గుమ్మం మీద పడిపోయింది. ]

(రెండుక్షణాలు నిశ్శబ్దం.)

[మెల్లగా తలుపు తెరుచుకుని జగ్గా ప్రవేశించాడు. కాలికి గుండు దెబ్బ తగిలి కుంటుతున్నాడు. చేతిలో జాతీయపతాక - బుజానికొకతుపాకీ.

మనిషి డస్సిపోయివున్నాడు. లోప లికి రాగానే తలుపులుమూసి ఒక్క నిట్టూర్పు విడిచాడు. చుట్టూ ఉన్న భయంకర వాతావరణం అతడు పరి శీలించనేలేదు.]

(మామూలు ధోరణిలో) అమ్మా నేను వచ్చేశాను అమ్మా. అక్కడ చీనీ పటాలాన్నంతటినీ సఫా చేసేశాం. నేనొక్కణ్ణే అయిదుగురు చీనీవాళ్ళను చంపేశాను. ఇదిగో చూడు ! ఈ తుపాకీ వాళ్ళదే ! ... మన జెండాకూడా అక్కడ ఎగ రేశాం ! ... (నొప్పితో) అమ్మా! .. ఏం లేదమ్మా ! చిన్నదెబ్బ తగిలింది. అంతే ! అయితేనేం ... వాళ్ళల్లో ఒక్కణ్ణికూడా మిగల్చలేదు.

ఈ సంభాషణలో రెండోమూలకు నడిచివెళ్ళి తుపాకీ, జెండా అక్కడపెడతాడు. అక్కడే వున్న చిన్నకర్రఊతంగా తీసుకుంటాడు... తను మాట్లాడేమాటలు ఎవ్వరూ వినడంలేదని అతనికప్పుడు స్ఫురణకొస్తుంది.)

(అనుమానంగా) అమ్మా ! ...

బాబా ! ... (ఎవరూమాట్లాడరు.)

(జగ్గా కుంటుకుంటూ తల్లిదగ్గరకు వెళ్తాడు. ఆమెను చెయ్యిపెట్టి "అమ్మా" అని కదుపు తాడు. తల్లిశవం ప్రక్కకొరిగి పోతుంది. జగ్గా కొయ్యబారి పోతాడు -)

జ. అమ్మా ! (అరిచాడు) ఏమిటమ్మా ఈ ఘోరం ! (గబుక్కున వెళ్ళి తండ్రి మొహం మీద ముసుగు తీశాడు) బాబా !... ఇందుకేనా నే నెంతచెప్పినా వినకుండా ఇక్కడే వుండిపోయింది ? ఆనాడందరూ అంత ఆప్యాయంగా పంపించారే ! అదే ఆఖరి చూపైందామ్మా ? నన్ను ఒంటరివాణ్ణిచేసి వెళ్ళిపోయారామ్మా?

(దూరంగాపడివున్న చైనావాడిశవం కని పించింది.)

ఆఁ ! ఈ కిరాతకులు ఇక్కడి కొచ్చారా ? అనుకున్నంతాఅయింది.. వీడి అత్యాచారాలకి మీరు ఆహుతై పోయారా బాబా ! వాడి ప్రాణాల్ని బలిపెట్టడంకోసం_మీ రక్తాన్ని నైవేద్యం పెట్టారామ్మా ? (ఏడు స్తాడు) (తెప్పరిల్లుకొని) మూనీ... (అటూఇటూ చూశాడు.) మూనీ ! మూనీ ! ఈ దారుణమంతా చూసి నువ్వు భయపడిపోయావు గదూ ! నేను దగ్గరలేనని కుమిలిపోయావు గదూ ?...ఫరవాలేదు మూనీ ? నే నొచ్చేశానుగా ! ఈ పైశాచికత్వానికి బదులు తీరుస్తాను (మూనీని పట్టుకుని తిప్పుకుంటాడు. మూనీ నిర్జీవంగా

పడిపోతుంది) మూనీ !...

ఆఖరికి నువ్వుకూడా నాకు దక్కలేదా మూనీ ? జీవితంలో నాకేమీ మిగల్చలేదా మూనీ ?

అక్కడ శత్రువులందర్నీ చంపానన్న సంతోషంతో, మీ అందరినీ కలుసుకుంటానన్న సంతృప్తితో ఇంటికొచ్చానే ! చివరి కిక్కడ నాకు చీకటీ, దుఃఖం దిగవిడిచి-మీరంతా దూరమైపోయారా ? ఇక నేను మాత్రం ఎందుకు బ్రతకాలి ? ఎవరి కోసం బ్రతకాలి ?

(నీళ్ళతో నిండిన అతని కళ్ళకి చైనావాడి శవం గోచరించింది.)

...లేదు...నేను బ్రతకాలి... బ్రతుకుతాను...నా దేశంకోసం నేను పుట్టినగడ్డకోసం బ్రతుకుతాను. ప్రతీకారంకోసం బ్రతుకుతాను. మీలాగా అన్యాయానికి ఆహుతైపోయిన అమాయకజీవుల ఆత్మశాంతికోసం బ్రతుకుతాను (కుంటుకుంటూ వెళ్ళి తన జండా, తుపాకీ తీసుకుంటాడు)

నా జీవితాన్ని చీకటికూపంగా మర్చిన ఈ పాపాత్ముల ప్రాణవాయువులతో రక్తజ్యోతులు వెలిగిస్తాను ! పాల నురుగువంటి ఈ పవిత్రభూమిపై మానవరక్తం మడుగులు కట్టించే ఈ రాక్షసులకు మంచుగోరీలు కడతాను - తల్లుల కడుపుల్లో భార్యల బ్రతుకుల్లో, ఆరిపోని కారు చిచ్చు రగిల్చిన ఈ కిరాతకుల పచ్చి నెత్తుళ్ళతో నా దేశంలో గడపగడపకీ మనిషిమనిషికీ, వీరతిలకం పెడతాను !...జైహింద్ !

(బిగతా గంభీరంగా తుపాకీగురిపెట్టి బయటకు నడుస్తుంటే నేపథ్యంలో – ఉచ్చైశ్వరంతో వినిపిస్తూంటుంది.)

శ్లో॥ జననీ జన్మభూమిశ్చ స్వర్గాదప
గరీయసీ

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి
గరీయసీ



# పరాజిత్

## దండమూడి మహీధర్

వినయ్ మొట్టమొదటసారి వాళ్ళింటికి ఎప్పుడు వచ్చాడో ఉజ్వలకు బాగా గుర్తున్నది.

ఆరోజున ఆదివారం కావడంవలన ఆమెతండ్రి టీ త్రాగి తీరికగా పత్రిక పేజీలు తిరగేస్తున్నాడు. చివరపేజీ యింకా కొంచెం మిగిలివుందనగా ఉజ్వల ఆయనగదిలో ప్రవేశించింది.

'నాన్నా! 'డేఫడిల్స్' పొయమ్ చివరిపంక్తులు నాకు సరిగా అర్థం కావడంలేదు. కొంచెం చెప్పరూ?'

'డేఫడిల్స్! — వర్డ్స్‌వర్త్!' అని అంటూ ఆమెతండ్రి పుస్తకంవైపు చేయిచాచి 'ఏదీ!, యిలా తే!' అని అన్నాడు.

'దుర్గేశబాబుగారున్నారాండీ!' సరిగ్గా అదే సమయాన బయటినుంచి వినయ్ కేక వేశాడు.

'ఎవరూ? వినయ్! నువ్వటోయ్! లోపలికిరా!' అని అన్నాడు, దుర్గేశబాబు!

వినయ్ లోపలికి వచ్చాడు. సంస్కార రహితంగావున్న క్రాపు, సగంవరకుమడిచిన చేతులచొక్కా, కళ్ళకు మందపాటి అద్దాల కళ్ళజోడూ, ఆ కళ్ళజోడు వెనుక అవ్యక్తమైన వ్యధను ప్రతిఫలింపజేసే కళ్ళూ- ఇదీ ఆతనిరూపం. ఫిలాసఫీ యం. ఏ. చదువుతున్నాడు. మనిషి కూడా చూడడానికి ఫిలాసఫర్ లాగా కన్పిస్తాడు.

'కూర్చోబాబూ! ఏమిటి సంగతులు —' అని దుర్గేశబాబు ప్రశ్నించాడు.

వినయ్ — సిగ్గుపడుతూ కొంచెం దూరంగావున్న కుర్చీలో కూర్చున్నాడు. తండ్రీ కూతుళ్ళను కొంచెం పరీతుగా చూశాడు — ఒక నిమిషంపాటు. ఆ తరువాత —

'రేపు మాయింట్లో కాళీకాదేవి పూజ జరిపిస్తున్నామండి. మీరంతా దయచేయాలి!' అని అన్నాడు.

కాళీపూజ అనేది ప్రతి సంవత్సరం జరుపుకుంటారు. అయితే వినయ్ మాత్రం యిదివరలో ఎప్పుడూ యిలా వచ్చి ఆహ్వానించలేదు. గత సంవత్స

---

బెంగాలీ మూలం: నారాయణ గంగోపాధ్యాయ

రమే ఇతగాడి తండ్రి పరలోకయాత్ర చేశాడు. ఈ కారణంగా కులాచారాలకు సంబంధించిన సమస్త వ్యవహారాలనూ నిర్వర్తించవలసిన బాధ్యత యితనిమీద పడింది.

'తప్పకుండా వస్తాం కాళికాదేవి పూజకు రాకపోవడమేమిటి? అయినా, పనిగట్టుకొనివచ్చి మమ్మల్ని పిలవాలటయ్యా? మాఅంతట మేము వచ్చేవాళ్ళమేగా!' అని అన్నాడు దుర్గేశబాబు!

'అయితే నాకు శలవిప్పించండి!' అని వినయ్ లేచి నిల్చున్నాడు.

దుర్గేశబాబు అకస్మాత్తుగా ఏమి ఆలోచించాడో ఏమో వినయ్ నుద్దేశించి —

'ఏమయ్యా, వినయ్! నువ్వు నాకొక ఉపకారం చేయాలి! నువ్వు చాలా తెలివిగల కుర్రవాడివి! కొంచెం మా అమ్మాయికి 'డేఫడిల్స్' కవిత్వాన్ని తెలిసేట్టు చెబుతావా? నా చిన్నతనంలో నేనుకూడా ఈ గీతాన్ని చదివాను గాని, నాకు సరిగా గుర్తులేదు,' అని అన్నాడు.

ఉజ్వలకు చెప్పనలవిగాని సిగ్గు వేసింది. ఆమెకు అక్కడినుంచి వెంటనే పారిపోవా లనిపించింది కూడాను. 'నాన్నా! నేను స్వయంగా ఎలాగో తంటాలుపడి చదువుకుంటాలే! వారిని శ్రమపెట్టడమెందుకు?' అని అన్నది!

'స్వంతంగా చదువుకుంటే అర్థమయ్యేదానికి నన్నెందుకు అడిగావమ్మా! వినయ్ మనకు కావలసినవాడేలే! చాలా బ్రిలియంట్ స్టూడెంటు! మనవీధిలోనివాడు, పైగా మనకు బంధువుకూడా! ఇతనిముందు సిగ్గెందుకమ్మా! టూకీగా నాలుగు మాటల్లో చెప్పేస్తాడు! పుస్తకం వినయ్ చేతికివ్వు'.

వినయ్ మళ్ళా కుర్చీలో



కూర్చుంటూ 'అలాగే చెబుతానండి!' అని అన్నాడు.

అతని కంఠంలో ఎటువంటి జంకూ లేదు. వినయ్ ఉజ్వలను చూసీ చూడనట్టుగా చూశాడు.

పుస్తకం వినయ్‌కు అందించేప్పుడు ఉజ్వల చేతులు వణికాయి, కాని వినయ్‌మాత్రం దీన్ని గమనించనే లేదు. అతి సహజ స్వరంతో - 'మీకు ఏ పద్యాలు డిఫికల్ట్‌గా వున్నాయన్నారు? చివరి పద్యాలు కదూ?' అని వినయ్ వాటిని వివరించి చెప్పాడు.

ఇరవయ్ నిమిషాలపాటు పద్యాలకు అర్థం చెబుతూవుంటే దుర్గేశబాబు చెవులు దోరచేసుకొనివిన్నాడు. వినయ్ అనర్గళ కవితా ధోరణి, మేధా సంపద దుర్గేశబాబును ఎంతగానో ఆకర్షించాయి. అయితే ఉజ్వలకు మాత్రం వినయ్ మాటలు సగం అర్థంకాలేదు. అయితే అతని మధుర కంఠానికి ఆమె సమ్మోహితురాలైంది. అతనిఇంగ్లీషు బాషాపటిమకు ఆశ్చర్యపోయింది. వినయ్ అతి ప్రతిభా సంపన్నుడనే విషయం మాత్రం ఆమెకు దృఢపడింది.

'సుబర్బ్, యూనిక్!' అని దుర్గేశబాబు బిగ్గరగా అన్నాడు.

ఉజ్వల కనుబొమ్మలు చిట్లించుకున్నది.

'వినయ్! నిజం చెబుతున్నాను. కాలేజీలో నేను చదివేరోజుల్లో డాక్టర్ ఘోషు యిగ్లీషు అద్భుతంగా చెప్పేవాడని అనుకునే వాణ్ణి! నిన్ను చూశాక — యివ్వాళ ఆయన గుర్తొచ్చాడు. వండర్‌ఫుల్‌గా చెప్పావు. మా అమ్మాయి యింగ్లీషులో చాలా పూర్! అప్పుడప్పుడు వచ్చి కాస్త ఇంగ్లీషుచెప్పి వెళ్ళావంటే — నీ మేలు మరచిపోలేను!' అని అతి ఆత్మీయ భావంతో అన్నాడు — 'ఏదో బంధుత్వం వున్నదిగనుక ఇంత చనువు తీసుకొని అడిగాను!'

తనతండ్రి వినయ్‌ను అలా అడగడం ఉజ్వలకు రుచించలేదు. 'నాన్నా! వారికి ఎందుకంత శ్రమయివ్వడం?' అని అనాలనిపించింది. కాని నోటివెంట మాటలు పెకిలిరాలేదు.

దుర్గేశబాబు మాటలకు వినయ్ మొహంమీద ఏ భావమూ ప్రస్ఫుటితం కాలేదు. వెనుకటిలాగానే కూర్చొని— పుస్తకం ఉజ్వలకు అందిస్తూ — 'సరే! అలాగే వస్తూవుంటాలెండి!' అని అన్నాడు అంతేగాని అయిష్టతను వ్యక్తం చేయలేదు. అందుకే ఉజ్వల — తనకేదో అవమానం జరిగినట్టు భావించుకున్నది. ఎందుకో ఏమో!

ఆ తరువాత వినయ్ లేచి వెళ్ళిపోతూ — 'దుర్గేశబాబుగారూ! శలవు! ఇంకా నలుగురైదుగుర్ని స్టూడెంట్సు

వానికి ఆహ్వానించాలి!' అని అన్నాడు.

*  *  *

ఏదో మాటవరసకు అన్నాడేగాని ఆయన కెక్కడ గుర్తుంటుంది. బయటికి వెళ్ళడంతోటే ఈ విషయంకాస్తా పులుసులో కలిసిపోతుందని భావించింది ఉజ్వల! ఎందుకంటే గత ఐదు సంవత్సరాలనుంచి ఇతగాడి వాలకాన్ని ఈమె పరికిస్తూనే ఉన్నది. అసలు వినయ్ వెళ్ళేది వాళ్ళింటిముందు నుంచేగా? ఒకళ్ళతో మాట్లాడడు, మరొకరు ఇతనితో మాట్లాడరు. తనపని తప్ప మరొకలోకం ఆయనకు పట్టదు. నిత్యం తనలోతను ఏదో ఆలోచించుకుంటూ నడుస్తాడు. తలపైకెత్తి ఎవరినీ చూడనైనా చూడడు. అందుకే ఆ వాడకట్టు వాళ్ళంతా వినయ్‌ను-చూసి పిచ్చివాళ్ళ లక్షణాలు కొన్ని అతనిలో వున్నాయని అనుకుంటూ వుంటారు. ఎప్పుడూ చేతిలో బండెడు పుస్తకాలుంటాయి. కాళ్ళ వేసుకునే జోళ్ళు-రెండూ రెండు రకాలుగా వుంటాయి. అప్పుడప్పుడు చొక్కా తిరగేసి తొడుక్కుంటాడు. మతిమరుపుగా జేబులో డబ్బులు లేకుండానే ట్రాంలో ఎక్కుతాడు. ఎంత అమాయకమైన మనిషి!

ఇంత మతిమరుపు మనిషి చివరకు తన స్మరణాశక్తిని ఋజువు చేసుకున్నాడు. ఆ తరువాత ఐదురోజులకు సాయంత్రంపూట వాళ్ళింటికివచ్చి—'మగ్గేశ బాబుగారూ!' అని కేకేశాడు.

దుర్గేశబాబు ఇంట్లో లేరు ఆ సమయంలో. ఉజ్వల తలుపుతెరచి-'లేరండీ!' అని సమాధానం చెప్పింది వాకిట్లో నిలబడి!

'ఫరవాలేదులే! నేను వచ్చిందినీకు ఇంగ్లీషుపాఠం చెప్పడానికిలే! అని అన్నాడు.

ఉజ్వల ఆశ్చర్య చకితురాలై కొన్ని క్షణాలపాటు అలాగే నిలబడి పోయింది. తలపైకెత్తి అతనిమొహంలోకి చూసింది! అతని మొహంమీద ఆమెకు పసిపిల్లల అమాయకత్వం కన్పించింది. కళ్ళల్లో ఆత్మనిగ్రహం ప్రస్ఫుటించింది. ఒక్కసారిగా ఆమె హృదయంలోని పొరల తెరలు విడిపోయినాయి.

'ఇవ్వాళ్ళ నీకు చదవాలని లేకపోతే చెప్పు, మరొకరోజు వస్తా అని అన్నాడు వినయ్- కొంచెంసేపు మౌనంగా నిలబడి!

'ఫరవాలేదు, రండి!'

ఆరోజునుంచి చదువు చెప్పడం ప్రారంభమైంది.

వినయ్ ఫస్టుక్లాసులో యం ఏ ప్యాసై రిసర్చి చేస్తున్నాడు. ఉజ్వల కొత్తగా కాలేజీలో చేరి చదువుతున్నది. వినయ్ వారానికి రెండు

మూడుసార్లువచ్చి ఇంగ్లీషుచెప్పి వెడుతున్నాడు. అప్పుడప్పుడుసంస్కృతం, లాజిక్ కూడా చెబుతున్నాడు. పాఠం చెప్పడంలో గంటా, గంటన్నర సేపు వుంటాడు. వినయ్ పాఠం చెబుతున్నంతసేపూ ఉజ్వల ఏదో ఒక అద్భుతలోకంలో విహరిస్తూ వుండేది. పాఠంచెప్పడం అగస్మాత్తుగా ఆపేసి వినయ్ లేచి నిల్చునేవాడు.

'ఇవ్వాళ నాకు చాలా అర్జంటు పనివున్నది, వెడుతున్నాను.' అనేవాడు, అప్పుడప్పుడు.

ఉజ్వల అంతర్యం జ్వాలతో దహించుక పోయేది, పెదాలు కంపించేవి. 'ఈ మనిషి ఎంతనిర్దయుడు! ఎప్పుడూ తనను ప్రేమగా మాట్లాడించడు! పాఠం చెప్పినంతసేపూ చెప్పడం, ఆ తరువాత మీటనొక్కినట్టు మాటం పలుకూలేకుండా లేచి వెళ్ళిపోవడం? ఏమిటి ఈ మనిషితరహా? అని ఆలోచించుకొని ఉజ్వల బాధపడేది. పాఠాలు చెప్పడం పూర్తయిన తరువాత వినయ్ కొంతసేపు తనతో కూర్చుంటే చాలా బావుండును? ఒకరినొకరు చూసుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ వుంటే ఎంత హాయిగా వుండును? ఉజ్వల తనలో తను మథనపడది! జోరున వర్షం కురుస్తున్న ఒకరోజున ఉజ్వల హృదయం ఎంతగానో కంపించింది. ఇంతవరకు జరగ నటువంటిదేదో ఆ రోజున జరిగిపోతుందని ఆమె ఎంతో గాఢంగా తలపోసింది.

రెండు సంవత్సరాలు దొర్లిపోయాయి. కాని ఎటువంటి నూతన సంఘటనా ఘటించలేదు. ఏవో తెలియని ఆలోచనలతో ఏదో ఒక సుముహూర్తం కోసం ఆమె కన్నులు కాయలు కాచేలా ఎదురు చూసింది. కాని ఆమె వూహాలు వూహాలుగానే వుండిపోయాయి, ఆమెహృదయంలో ఒలికిపోతున్న విషాదం ఆతని కన్నుదోయికి ఎన్నడూ కన్పించనేలేదు. పుస్తకంవైపు చూడడమేగాని ఎదురుగావున్న కన్నెనుమాత్రం కన్నెత్తి చూడలేదు. బయట జోరున వర్షం కురుస్తూంటే - కళ్ళజోడు చెమ్మ తుడుచుకుంటూ - 'జల్లు పడుతున్నది, కిటికీ తలుపులు వేయరాదూ?' అనేవాడు ఎటోచూస్తూ! అతడివాలకం ఉజ్వలకు చిరాకు కలిగించేది!

కొద్దిరోజులనుంచి వినయ్ తల్లి ఉజ్వల వాళ్ళ యింటికి తరచు రాకపోకలు సాగించింది. ఆమెకు వినయ్ ఒక్కడె కొడుకు! పెల్లవాడె పెళ్ళి చేయాలని ఆమె మహా తాపత్రయ పడుతున్నది. ఉజ్వలను కోడలుగా చేసుకోవాలని ఆమెకు ఎంతో మక్కువగా వున్నది. తన కొడుకు- ఉజ్వలను గాఢంగా ప్రేమిస్తున్నాడని, ఈ కార




'ఈ మెషీను మీ పనిలో సగాన్ని చేసేస్తుందండి'

'ఐతే రెండివ్వండి.'

ణంగానే ఆమెకు రెండు సంవత్సరాల నుంచి పాఠాలు చెబుతున్నాడని ఆమె భావించింది. ఉజ్వల తల్లికి కూడా వినయ్ ఎంతో నచ్చాడు. దుర్గేశ బాబు కట్నంగాని పేణా ఏమీయిచ్చుకో లేడని వినయ్‌తల్లికి తెలుసు, తనకు ఆస్థి లేకపోతేగా! అందుకే ఆమె ఈ సంబంధానికి ఒప్పుకున్నది.

ఈ విషయం ఉజ్వలకు తెలిసింది. ఆమె మనస్సుకూ, అంతరాత్మకూ అనిర్వచనీయ ఆనందం కలిగింది. ఎన్నెన్నో ఆలోచనలు ఆమెను చుట్టుముట్టాయి. దిండులో తల దూర్చి అలాగే చాలాసేపు పడుకున్నది - 'పుస్తకం పేజీలలోనుంచి వినయ్ తన జీవితంలోకి ప్రవేశించబోతున్నాడన్న మాట! నిద్రిస్తున్న అతనిఆత్మ తన స్పర్శకు చైతన్యవంత మవుతుంది కాబోలు! పసిపిల్లవాడివలె విప్పారిన నేత్రాలతో ఆశ్చర్యంగా తన కళ్ళలోని కాంతిని చూస్తాడు కాబోలు! అప్పుడు '—

ఆరోజు రాత్రి ఆమె నిద్రపోలేదు. నీలాలనింగిమీద మిణుకు మిణుకు మంటున్న నక్షత్రాలను లెక్కపెడుతూ పడుకున్నది. ఆ రెండవరోజు వినయ్ కోసం ఉజ్వల సిగ్గరితనాన్ని తనలో యిముడ్చుకుని రిక్కు రిక్కుమంటూ ఎదురుచూసింది. ఆరోజున అతను రాలేదు. మూడవరోజున వచ్చాడు

మహో ఉగ్రుడై వచ్చాడు. తుమ్మినట్లు మాట్లాడాడు. అప్పుడే దుర్గేశబాబు ఆఫీసునుంచి వచ్చాడు.

వినయ్ ఎటువంటి ఉపోద్ఘాతమూ లేకుండానే - ఆకాశం ఎత్తున లేచ్చి పోయి - 'మీరింతటి అఘాయిత్యానికి పాల్పడతారని నే నెప్పుడూ అనుకో లేదు ! మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చేయాలని సంకల్పించారటగా !' అని రెట్టించాడు. ఇంతకు కొద్దిక్షణాల క్రితమే అతని తల్లికి అతనికీ మధ్యన వివాహవిషయంలో ఘర్షణ జరిగింది.

'ఎదో పెద్దవారు అడిగారుగదా అని, మీ అమ్మాయికి పాఠాలు చెప్ప డానికి ఒప్పుకున్నాను. మీ మనస్సులో ఈ అభిప్రాయం వున్నదని తెలిసివుంటే నే నందుకు ఒప్పుకొని వుండేవాణ్ణి కాను !' అని మళ్ళా అన్నాడు.

దుర్గేశబాబు ఒక్కసారిగా నిశ్చేష్టు డైనాడు. 'వినయ్ ! ఏందర పడు తున్నావు నాయనా ! ఏదో అను కున్నాను - చివరకు - ముహూర్తం కూడా నిర్ణయమై పోయింది. ఆఖరి క్షణంలో నీవిలా పేచీపెడితే ఎలా చెప్పుబాబూ !' అని ప్రాధేయ పడు తున్నట్టు మొహంబెట్టి అన్నాడు.

'అయ్యా ! ముహూర్తం నిర్ణ యించుకోమని మీకో ఎవరు చెప్పారండీ ? పెళ్ళిచేసుకో వలసింది నిశ్చయించడానికి మీరెవరండీ ?' అని గద్దింపుగా ముందుకొచ్చి అన్నాడు వినయ్ !

'బాబూ ! ఉజ్వలకు . ' అని ఎదో చెప్పబోయాడు దుర్గేశబాబు !

'మీ ఉజ్వల చాలా తెలివిగలదే నండి. ఆమె ప్రస్తావన ఎందుకు లెండి ! నా అభిప్రాయం నేను చెబుతున్నా వినండి - ఇప్పుడప్పుడే నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు. మరొక విషయం కూడా వినండి ; రేపటినుంచి నేను మీ యింటి గడప తొక్కేదిలేదు. గుర్తుంచుకోండి !' అని వచ్చిన వాడు వచ్చినట్టే వెళ్ళి పోయాడు.

దుర్గేశబాబుకు ఊపిరి సలపలేదు. కూర్చున్న వాడు కూర్చున్న పళంగానే వుండిపోయాడు. నోటివెంట మాట పెకిలిరాలేదు.

వాకిలి పక్కన నిల్చొని ఉజ్వల అన్ని మాటలూ విన్నది. ఆమె తల తిరిగి పోయింది. ఆమె ఆశలు అడియాస లైనాయి. మాటా పలుకూ లేకుండా ఆమె అక్కడే నిలబడి పోయింది.

* * *

ఈ రోజున ఉజ్వలపెళ్ళి జరగ బోతున్నది.

వరుడు ఎవరో, ఏం చేస్తున్నాడో, ఏవూరో ఏమిటో ఎవరికీ తెలియదు.

పిల్లను చూచుకోనడానికికూడా అత గాడు రాలేదట! మరి ఈ సంబంధం ఎలా కుదిరిందో ఏమి కథా కమామీషో ఆ మహానుభావుడికితప్ప నురెవరికీ తెలియదు.

ఉజ్వల ఈ సంబంధానికి వెంటనే ఒప్పేసుకుంది. 'ఏదో జరగవలసిందేదో జరిగి తీరుతుంది - మధ్యన అడ్డు పడడానికి నే నెవరిని ? జీవితంలో నాకు ఏ ఆశా లేదు. ఆశలన్నీ ఎప్పుడో అడుగంటి పోయాయి. తన బతుకు చీకటి గొయ్యారమై పోయింది.' అని ఉజ్వల తన గుండెను రాయి చేసుకున్నది.

ఆమె హృదయంమీద అగస్మాత్తుగా వినయ్‌రూపం కనిపించింది. ఆమె పెదాలు వణికాయి. కోపంతో ఆమె 'వినయ్' అని ఒక్కసారి ఉచ్చరించింది. 'ఈ రోజుతరువాత అతన్ని తాను ఎప్పుడూ గుర్తుంచుకోదు! యిదే చివరిరోజు! అతన్ని శాశ్వతంగా మరచి పోతుంది. తన పట్ల అంత నిర్దయగా వ్యవహరించిన వ్యక్తిని తా నెందుకు గుర్తుంచుకోవాలి?' అని అనుకున్నది.

బయట మేళతాళాలు విన్పిస్తున్నాయి. శంఖధ్వనులు కూడా వీటిలో మిళితమైనాయి బయట కోలాహాలంగా వున్నది.

ఒక చిన్నపిల్ల పరుగెత్తుకుంటూ గదిలోకివచ్చి- 'ఉజ్వలాదీదీ !-ఉజ్వలా దీదీ - పెళ్ళికొడుకు వచ్చేశాడు!' అని చెప్పింది.

అలంకరణలన్నీ తీసేసి అవతల పారేయా లనిపించింది - ఉజ్వలకు, మరి ఆ తరువాత ?

...ఆమె ఏదో ఆలోచించబోయింది. ఇంతలోనే బయట పెద్ద పెట్టున గోల వినిపించింది.

'ఈ పెళ్ళికొడుక్కి అరవై యేళ్ళకు తక్కువ వుండవు.'

'జుట్టంతా తెల్లబడి పోయింది'

'ఈ దుర్గేశబాబుకు ఈ ముసలివాడెక్కడ దొరికాడో ?'

'పిల్ల జీవితం నాశనం చేస్తున్నాడు.' ఉజ్వలకు రకరకాల మాటలు విన్పిస్తున్నాయి. వాళ్ళతోపాటు తనుకూడా వెళ్ళి వికటాట్టహాసం చేయాలనిసించింది. లేకపోతే నాన్న తనను ఒక ముసలివాడికి కట్టబెడతాడా? ఇంకొక రెండు సంవత్సరాలు గడిస్తే తనకు తెల్లబట్టలే గతి! ... ఉజ్వల కళ్ళ దట రకరకాల చిత్రాలు కదిలి పోతున్నాయి. బయట రకరకాల అరుపులు . కేకలూ

ఇంతలో వినయ్ తల్లి ఉజ్వల కూర్చున్న గదిలోకి వచ్చింది. ఆమె వెనుక ఆమెతల్లి కూడా ప్రవేశించింది- కన్నీళ్ళు తుడుచుకుంటూ! అందరికంటే వెనుక ఆమెతండ్రి వచ్చాడు - ఏదో తప్పుచేసిన వాడిలాగా!

'దుర్గేశబాబూ ! ఏమిటీ గొడవ ?' అని వినయ్ తల్లి కోపంగా ప్రశ్నించింది.

'ఏంజేయమంటారు చెప్పండి ? మరి నా అంతస్తుకి తగినట్టుగా —'

'ఏమిటి నీ అంతస్తు ? — పిల్లదాని గొంతు కోయడమేనా ? ఇంతకాలం పెంచి పెద్దదాన్నిచేసి చివరకు నువ్వు చేసే నిర్వాకం యిదేనా ?'

'పరిస్థితి అలావచ్చింది మరి ! ఈ వాడకట్టు యువకులంతా కలిసి పెళ్ళికొడుకు కారు ఆపేశారు. 'కారుదిగి పెళ్ళిపందిట్లో అడుగు పెట్టారంటే - మీకు ముప్పుతప్పద'ని ,వాళ్ళు కారు చుట్టూమూగి అతగాణ్ణి ఆటలు పట్టిస్తున్నారు. లగ్నంవేళ కూడా మించిపోయేట్టున్నది !' అని విచారంతో కృంగిపోతూ అన్నాడు !

'అవునవును ! ఆగొడవ నేనుకూడా చూస్తున్నాను.' అని వినయ్ తల్లి వెనక్కుతిరిగి 'వినయ్ !' అని కేక వేసింది,

తల్లి పిలుపు విని గది బయట నిల్చున్న వినయ్ లోనికొచ్చాడు. అంత వరకూ ఉజ్వల తటస్థంగా కూర్చున్నది. వినయ్ గదిలో ప్రవేశించేప్పటికి ఉజ్వలకు ఎక్కడలేని ఆవేశం ముంచుకొచ్చింది. వినయ్ పట్ల చెప్పడానికి వీల్లేనంత ఈసడింపుభావం ఆమెలో వుద్భవించింది. 'ఎంత నిర్దయుడు ! లేకపోతే ఒకవైపున తన పెళ్ళి అరవైయేళ్ళ ముసలివానితో జరుగుతుంటే యిక్కడికెందుకు రావాలి ? తనను గేలిచేయడానికి కదూ ? తనజీవితాన్ని నవ్వులపాలు చేయడానికికదూ ?' అని అనుకున్నది ఉజ్వల !

'వినయ్ !' వినయ్ తల్లి అతన్ని మరింత దగ్గరకు పిలిచింది. వినయ్ ఆమెవద్దకు వచ్చాడు. అక్కడికి కొద్ది దూరంలోనే ఉజ్వల పెళ్ళికూతురు వేషంలో కూర్చొని వున్నది. వినయ్ ముభావంగా ఆమెవైపు చూశాడు.

'చూడరా ! కుందనపు బొమ్మలాగా ఎంత చక్కగా ఉన్నదో ! ఈ చక్కనిచుక్క జీవితం పాడైపోవడం నీకిష్టమేనటరా ! ' అని అడిగింది తల్లి అతన్ని !

వినయ్ ఉజ్వలను పరీక్షగా చూశాడు. తలవంచుకొని కూర్చున్న ఉజ్వల పెదాలు వణికిపోతున్నాయి ! వినయ్ ఆమెను చూశాడు. ఆ మొదటి రోజున ఎలా చూశాడో, అలాగే చూశాడు. ఆ చూపులో ఎటువంటి మార్పూలేదు.

'నన్నేం చేయమంటావో చెప్పమ్మా !' అన్నాడు వినయ్ !

'ఉజ్వలను పెళ్ళి చేసుకోవాలి.




'చూశావా, రాత్రి నా పాట కచేరీలో హాలంతా నిండిపోయింది'

'నిజమే, చాలామంది తమ స్థలాలు ఇచ్చేసేరు నింపడానికి.'

లేకపోతే దుర్గేశబాబుగారి మర్యాద కాస్తా మట్టిలో కలిసిపోతుంది. ఉజ్వల భవిష్యత్తు అంధకార బంధురమై పోతుంది '

వినయ్ ఒక్క క్షణంపాటు మౌనం వహించి నిలబడ్డాడు. 'అలాగేనమ్మా! ఉజ్వలను నేను పెళ్ళిచేసుకుంటా.' అని అన్నాడు, మొదట్లో మాటమాత్రంగా అడిగినంతనే ఇకగ్లీషు పాఠాలు చెప్ప డానికి ఒప్పుకున్నట్టుగానే! అతని కంఠంలో అప్పటికి ఎటువంటిభావం ప్రస్ఫుటం కాలేదు.

దుర్గేశబాబు విన్నయ్‌ను అమాంతంగా కౌగలించుకున్నాడు. గద్గద కంఠంతో — 'నన్ను గట్టెక్కించావు బాబూ!' అని అన్నాడు.

'ఆ ముసలి పెళ్ళి కొడుకును వెనక్కు పంపించివేసే ఏర్పాట్లు చేయండి! నేనింతలో వినయ్‌ను పెళ్ళి కొడుకునుచేసి తీసుకొస్తాను. ఇంకొక రెండు గంటలలో వేరే లగ్నం వున్నది.' అని వినియ్ తల్లి అన్నది.

గదిలోనుంచి వరుసగా అందరూ వెళ్ళిపోయారు. గదిలో ఉజ్వల ఒక్కత్తే మిగిలిపోయింది. ఈ సంఘటనకు సంతోషించాలో, విచారించాలో ఆమెకే బోధపడలేదు. ఆమె హృదయంలో తుపాను చెలరేగింది. ఆమె కేమీ పాలుపోవడంలేగు. మరల బయటనుంచి మేళతాళాల ధ్వనులు

విన్పిస్తున్నాయి. బహుశా ముసలి పెళ్ళికొడుకు అవమానంతో తిరిగి వెళ్ళిపోయి వుంటాడు. ఎందుకో వినయ్‌తో పెళ్ళి కాబోతున్నదంటే ఆమెకు ఈషణ్మాత్రంగా కూడా సంతోషం కలగడంలేదు.

అగస్మాత్తుగా ఆమె వయస్సులో వున్న ఆడపిల్లలు నలుగురైదుగురు నవ్వుకుంటూ, పరిహాసాలాడుకుంటూ ఉజ్వల గదిలోకి ప్రవేశించారు.

'అబ్బ! ఎంతమంచి నాటకం! ఉజ్వలా!' అని అన్నారు అందరూ ఒక్కసారిగా!

'మొత్తానికి వినయ్‌బాబు కూడా చాలా విచిత్రమైన వ్యక్తే! అసలు విషయం ఆయనగారికికూడా తెలియ లేదు - ' అన్నారు ఎవరో వాళ్ళల్లో నుంచి!

ఉజ్వల చకితురాలైంది, ఈ మాటలువిని!

'ఏమిటా విషయం ?' అని ఉజ్వల వాళ్ళను ప్రశ్నించింది.

'అయితేనీకూ తెలియదన్నమాట!' వాళ్లంతా ఒక్కసారి నవ్వారు.

'ఈ వాడకట్టు యువకులంతా కలిసి ప్లానువేసి వినయ్‌బాబు వివాహం నీతో జరిగేట్టు చేశారు. ఈ ప్లానులో మీ నాన్న, వినయ్‌బాబు తల్లి వాళ్ళు కూడా వున్నారు! అయితే ముసలి పెళ్ళికొడుకు వేషం వేసింది ఎవరను కున్నావ్ ?. మన ఎమెచ్యూర్ క్లబ్ సభ్యుడు అభిన్‌దా! — మొత్తా నికి నాటకం పెళ్ళికొడుక్కీ, పెళ్ళి కూతురికీ - ఉభయులకూ తెలియ లేదు. బావుంది' అని ఎవరో అనగా అంతా మళ్ళా పెద్దపెట్టున నవ్వారు.

'నాటకమా ?' సిగ్గుతో ఉజ్వల తల వంచుకున్నది. చివరకు వినయ్ తనకు భర్తగా లభించాడు - మామూ లుగా కాదు, నాటకమాడితే లభిం చాడు. ఎంత అవమానం! ఆడపిల్ల పరిస్థితులకు లొంగక తప్పదు. చివ రకు తను పరాజిత అయింది అని అనుకున్నది ఉజ్వల!

ఉజ్వల తనలోతాను నవ్వుకున్నది. బయటనుంచి అప్పుడే మేళతాళాల ధ్వనులు మరింత ఉన్నత స్థాయిలో విన్పించాయి.



# సౌదీగుండం

**— విజయ —**

బొంబాయి జి.టి.లో దిగాను. మధ్యాహ్నం ఒంటిగంటయింది. కూలీచేత సామాను దింపించి శర్మకోసం కాచుకుని నిల్చున్నాను. ఇక రాడేమో అనుకుంటూ వుండగా కన్పించాడు.

వాడి నడక మారలేదు...కాని మనిషిలో ఎంతో బేధం అగుపించింది. ముఖం ముద్దబారి, ఎర్రబడింది. జుత్తు పొట్టిగా కత్తిరించి, పైకి లేచి వుండి సన్నటి గొట్టాంలాంటి పంట్లాం వేశాడు. కాళ్ళకి మాంచి స్టైలిష్ బూట్లు తొడిగాడు. ఇద్దరం బయటికి బయల్దేరాం.

"ఏరా, ఆలశ్యమయిందేం?" అన్నాను బయటికి చేరి. మాట్లాడకుండా టాక్సీ దగ్గరకు తీసుకుపోయాడు. చూచాను. అందులో ఎవరో — యువతి కూర్చునివుంది.

"ఎవరో వున్నట్టున్నారు" అన్నాను ఆగి.

"ఎక్కరా బాబూ, మనదే టాక్సీ" అన్నాడు.

సామాన్లు డిక్కీలో వుంచాను. ముందు సీట్లో కూర్చున్నాడు వాడు. నేనూ, ఆ యువతీ వెనకాల కూర్చున్నాం...కారు, ఎవరూ ఏమీ చెప్పకుండానే ముందుకు లంఘించింది

"ఆఁ. దిసీజ్ మిస్ వీణ — మిస్టర్ మధు..."అని పరిచయం చేశాడు. కరకమలాలు నాజూగ్గా జోడించి మధురంగా 'నమస్తే' అంది.

అక్కడ్నుంచి మతుంగా చేరేదాకా ఎవరమూ మాట్లాడలేదు. కింగ్స్ సర్కిల్ వద్ద టాక్సీ ఆగింది. 'మిస్ వీణ' దిగింది శర్మకూడా దిగి ఏదో మాట్లాడాడు. వాళ్ల అభినయం చూచినా అర్థంకాలేదు ఏమిటో. ఆఖరికి ఆవిడ పోతూపోతూ వెనుతిరిగి నాకో నమస్కారం, నవ్వుల మెరపూ బహూకరించి చక్కాపోయింది. టాక్సీ బయలుదేరింది.

"ఎవర్రా ఆవిడ?" అన్నాను వుండబట్టలేక.

"బాగుంది కదూ?" అన్నాడు సిగరెట్టు వెలిగించి, నాకోటి అందిస్తూ.

"నాకు అలవాటులేదు...ఎవరసలు?" అన్నాను సిగరెట్టు వద్దని. పొగ వూదాడు గుప్పున...కాస్సేపు మాట్లాళ్ళేదు.

"మా కంపెనీలో స్టెనో...ప్రస్తుతం మన గర్ల్ ఫ్రెండ్..." అన్నాడు.

"అంతే?" అన్నాను...నవ్వాడు. ఆ నవ్వు వెనక అసహజమైన, వికృతమైన విశేషం ఏమిటో కన్పించింది. అంతకుముందెప్పుడూ వాడి నవ్వు నాకు అలా అనిపించలేదు.

"ఒరేయ్...చాలా వుందిరా...... ముందు ఇల్లు చేరనీ..." అన్నాడు.

సమోన్‌లో ఇల్లు. గదిలోకి పోయాం...చాలా అందంగా అలంకరింపబడివుంది. గోడలకు రంగురంగుల కాలెండర్లున్నాయి. సోఫాలూ, టేబిలూ, పంకా, ఫిలిప్స్ కాబోలు – టేబిలు ట్రాన్సిస్టరూ వున్నాయి.

"అవతలవేపు మరో గది వుంది... అదే నా బెడ్ రూం...వెనక స్నానాల గది వగైరా...ఎలావుంది?" అన్నాడు..

"ఎంత ధారపోస్తున్నావు?" అన్నాను. నవ్వాడు.

"రెండు వందలు...ఏం?" అన్నాడు సిగరెట్టు వెలిగించి, మళ్ళీ.

"మరేంలేదు...నా జీత మంత..." అన్నాను. మళ్ళీ నవ్వాడు,

స్నానం కానిచ్చి, బయటికి వెళ్ళి భోంచేశాము ఇద్దరం.

"నువ్వు నేరుగా రూముకు పో... నేను ఆఫీసులో కనబడి వస్తాను. సాయంత్రం అలా పోదాం..." అన్నాడు, కన్ను గీటి.

"అదెందుకూ?" అన్నాను.

"చెప్తానులే..." అన్నాడు. టాక్సీ పిలిచి అందులో వెళ్ళిపోయాడు.

నేను రూముకుపోయి పడుకున్నాను. ఆలోచనలు అలల్లాగా రాసాగాయి...

ఎంత మెత్తగా, ముభావంగా, భయం భయంగా వుండేవాడు – కాని, ఇప్పుడు? పీణట! వాడి వైఖరిచూస్తే పెద్ద కథలాగే కన్పించింది.

ఆ రోజుల్లో వీడూ, వీడి బాధ చూడలేక చచ్చేవాడిని...వాసూ, వాణి, శర్మ, నేనూ, అంతా ఒక గ్రూపుగా వుండేవాళ్ళం. వాసూ, వాణీ పెండ్లి చేసుకుంటా



రని అందరం అనుకుంటూ వుండే వాళ్ళం...శర్మ మాట్లాడటమే రానట్టు వుండేవాడు. వాడిలో రగిలే మథన నాకు అర్థమయింది. వాసుకీ,వాణికీ తెలుసు... కాని వెలిబుచ్చేవారు కాదు...

విధివేసిన చదరంగపు ఎత్తుల్లోపడి విడిపోయాం అందరం...వాణి పూనాలో వుద్యోగంలో చేరింది. శర్మ బొంబాయిలో ఏదో కంపెనీలో చేరాడు......వాసు హైద్రాబాదులో లెక్చరర్‌గా చేరాడు. నేను మావూర్లో...

ఇది జరిగి మూడేళ్ళయింది.....పరిస్థితులన్నీ మారిపోయాయి...ఆ తర్వాత శర్మను చూడడం ఇదే మొదటిసారి.

సాయంత్రం అయిదున్నర, ఆరుకు ఇద్దరం టాక్సీలో మెరైన్ డ్రైవ్ పోయాం. చైనీస్ రెస్టారెంట్‌కు తీసుకుపోయాడు నన్ను. ఏదో నంజసాగాను.

"ఏమిట్రా సంగతులు ?" అన్నాడు మధ్యలో.

"నేనడగాలిరా నిన్ను....ఏమిటి సంగతి ? నీకు జీత మెంత ? నీ వుద్యోగం ఎలా వుంది ? ఈ అమ్మాయి గొడవేమిటి ?'' అన్నాను.

"వుందరా బాబు ! ఒహటొహటిగా చెప్తాను...విను – సంగతి ఏమీలేదు... జీతం ఆరువందలు. సేల్సు డివిజన్ నాది...త్వరలో మూడు సున్నాల



వుద్యోగం అవుతుంది...ఆ అమ్మాయి ఒకానొక స్టెనో...తెలుగు వచ్చు. కొంచం...ప్రస్తుతం మన ఆదరణలో వుంది...చాలా ?" అన్నాడు.

''అదేమిటి ? పెండ్లి చేసుకుంటున్నావా ?" అన్నాను.

''నీ మొహం ! పెళ్ళికాదు - ప్లే - ప్లే - అంతే - " అన్నాడు.

తల వంచుకున్నాను... ఇద్దరం మాట్లాళ్ళేదు చాలా సేపు.

"కోపం వచ్చిందిట్రా ?" అన్నాడు నాకేసి చూసి తర్వాత.

తలెత్తి చూచాను.

ఆ ఎర్రబడ్డ కండ్ల వెనుక, ముద్ద బారిన ముతకముఖం క్రింద ఇంకా కొంచం మిగిలిన నా పూర్వమిత్రుడు శర్మ చూచాయగా, శిధిలావస్థలో కన్పించాడు...కాలం పూసిన మసిలోంచి వాడి మనసూ, మాటలూ అస్పష్టంగా కన్పించాయి. విన్పించాయి. నేను మాటలు రాక, గుటక వేశాను.

"జాలివేస్తోంది కదూ ? నిజమే..." అన్నాడు. సిగరెట్టు వెలిగించి పొగ వదలసాగాడు నెమ్మదిగా...

''నిన్నో సంగతి అడగదల్చుకున్నాను.'' అన్నాను.

"ఏమిటి ? అడుగు -'' అన్నాడు.

"వాణి జ్ఞాపకం వుందా ?" అన్నాను.

తలవంచుకున్నాడు. తలూపాడుఅలాగే..

"పూనాలో వుందిరా...'' అన్నాను.

తలూపాడు.

''తెలుసు...ఏదో రిసర్చి చేస్తోందట కదూ...'' అన్నాడు. ఆ మాటలు చాలా సహజంగా, తనకేం సంబంధం లేనట్లు అనబోయి, విఫలుడుకాగా, కృత్రిమంగా విన్పించాయి...

"అవును – వాసుకూడా హైద్రబాదులోనే రిసర్చి చేస్తున్నాడు - " అన్నాను

"అవును – విన్నాను.'' అన్నాడు కొంచెం ధైర్యం, ముందటి ధీమా డాబూ, దర్పం తెచ్చుకున్నాడు.

"పూర్ ఫెలో – వట్టి పిరికివాడు - అన్నాడు హేళనగా.

''మరి నీవు ?'' అన్నాను. నాకేసి చూచాడు.

''నాకేం ? హాయిగా వున్నాను నాకేంకావాలి? వుద్యోగం, దర్జా, డబ్బూ హోదా – ఇంకా ఏం కావాల్రా ? అన్నాడు. వాడి మాటల్లో సవాలు నన్ను తాకింది...

''మనశ్శాంతి'' అన్నాను.

క్షణకాలం స్థంభించి నిలిచిపోయాడు వెంటనే తేరుకున్నాడు.

''వేదాంతం మాట్లాడకు...అదంతా వట్టి నాటకం...నన్ను భయపెట్టకు !'' అన్నాడు.

''నేను ఎందుకు భయపెట్టాలి !... నిన్ను చూచి నీవే జడుసుకుంటున్నావు– నీవు ఏమీ మారలేదు...నీవు ఎప్పటి పిరికి శర్మవే - పైగా ఇప్పుడీ కృత్రిమ దర్పం సృష్టించుకుని కాకి నెమలి

ఫించం పెట్టుకున్నట్లు తిరుగుతున్నావు.. అసహజత్వం పూసుకుని మరింతగా నీ నిజరూపం తెల్పుకుంటున్నావు.'' అన్నాను. అడ్డంగా తలూపాడు.

''పొరపడుతున్నావు మధూ — నీ కర్థంకాదు —'' అన్నాడు.

"నాకంతా తెలుసు — ఒక ప్రశ్న అడుగుతాను : ఈ వీణ ఒక్కతేనా, ఇంకా ఎవరయినా వున్నారా గర్ల్ ఫ్రెండ్స్ ?'' అన్నాను. నా వేపు చూచాడు — మొట్టమొదటిసారిగా వాడి ముఖంలో కోపం కన్పించింది.

"ఏం ? తప్పా ?'' అన్నాడు.

"నేను నిన్నర్థం చేసుకోలేదన్నావు ! నిన్ను చూడగానే నీ విషయం అర్థం చేసుకున్నాను — వాణి నిన్ను తిరస్కరించింది — అందుకని ఆమెమీద తీర్చుకోలేని కసిని, కోపాన్ని, ద్వేషాన్ని, ఇలా వీళ్ళమీద తీర్చుకుంటున్నావు ! వాణిని నీవు ఏమీ చేయలేవు కనుక, అసహాయులయిన ఈ అబలల్ని ఏడిపిస్తున్నావు ! వీళ్ళు నీ చేతుల్లో కీలుబొమ్మలు — అవునా ?'' అన్నాను.

''అవును — నా ఇష్టం వచ్చినట్లు చేస్తాను నేను — వాళ్ళు — నా క్రింది వుద్యోగులు — నే రమ్మంటే వస్తారు — ఏం చేయమంటే అది చేస్తారు — ఏదయినా — ఏదయినా సరే చేస్తారు — ఒక్క ఇంక్రిమెంటు కోసం — మరో పాతిక రూపాయిలు ఎక్కువ ఇస్తారని ఆశ ! నా మాట వాళ్ళకి దైవవాక్కు — అన్నాడు — దాదాపు అరిచాడు.

"మరి ఇదంతా ఏమిటి ? మనస్తత్వ శాస్త్రం చదువుకోలేదు నేను — కాని, ఇదంతా పిరికితనం కాక మరేమిటి ? ధైర్యమూ, అర్హతా వుంటే పోయి అడగరాదూ ?" అన్నాను అంతకన్నా కోపంగా. హోటల్లో మాతోపాటు ప్రక్కన వున్న కొంతమంది మా వేపు ఎగాదిగా చూడ్డంతో ఇద్దరం వాదన ఆపేయాల్సి వచ్చింది.

ఇద్దరం రూము చేరుకునేసరికి తొమ్మిదయింది. నేను నేరుగా పోయి సోఫామీద పడుకున్నాను. శర్మ చాలా సేపు పచార్లుచేస్తూ గడిపాడు. సిగరెట్లు వరసగా పీల్చిపారేయసాగాడు. తర్వాత లోపల్నుంచి ఏదో వాసన వచ్చింది... పోయి చూచాను.

శర్మ పడకమీద కూర్చుని వున్నాడు. వాడి చేతులో చిన్న గ్లాసులో ఎర్రటి ద్రావకం వుంది, ప్రక్కన టేబిలుమీద పొడుగాటి సీసాలో వున్న అదేరంగు ద్రావకం బల్బు వెలుగులో మెరిసింది... పల్చటి నెత్తుటి రంగు...

"శర్మా, ఏమిట్రా ఇదంతా ?'' అన్నాను. జవాబులేదు. దగ్గరికిపోయాను. నెమ్మదిగా పక్కనచేరి వాడి చేతుల్లో గ్లాసు తీసుకోబోయాను — విసురుగా లాక్కున్నాడు — అందులో ద్రావకం

వొలికి, క్రింద పోయింది. గుప్పుమంది ద్రాక్షాసవం —

''తెలిసి తెలిసి ఎందుకు చెడిపోవాలని ప్రయత్నిస్తావు ?'' అన్నాను. విన్నట్లు కూర్చున్నాడు.

''ఇదంతా మానేయి శర్మా ; నీ మంచి కోరి చెప్తున్నాను'' అన్నాను.

''లాభంలేదురా...అంతా అయిపోయింది. మొదట బాధ మర్చిపోట్టానికి మొదలెట్టాను — ఇప్పుడు ఇక నన్ను వదలదీ శని — నాకు తెలుసు —'' అన్నాడు బాధగా.

''ప్రయత్నించు శర్మా ; అనుకుని సాధించలేం దేదీ లేదు ప్రపంచంలో ! ప్రయత్నించు, నిన్ను నీవు రక్షించుకో— మనస్థైర్యం తెచ్చుకో'' అన్నాను. తలూపాడు.

''నిజమే ! — కాని, ఎవరి కోసం ? ఎవరున్నారని ?''

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేక పోయాను. ఆఖరికి అన్నాను.

''నీకోసంరా — నీ కోసం — మా అందరి కోసం — ''

''థాంక్స్ — ఇదలాపోనీ......ఈ విధంగా నయినా నన్ను మరిచిపోనీ —'' అన్నాడు పడకమీదికి వొరుగుతూ —

ఆరోజు ఇంటర్వ్యూ,కాగానే మరుసటి రోజు బయలుదేరాను మళ్ళీ. స్టేషనుకు పోయే దార్లో శర్మ మాట్లాడ లేదు. పూనాదాకా దక్కన్ క్వీన్‌లో పోవాలి... శర్మ నా ప్రక్కనే కూర్చున్నాడు రైలు కదిలే సమయం వరకూ.

''పెండ్లిచేసుకో శర్మా......'' అన్నాను రైలుకదలబోయే ముందు. పెదిమ విరిచి అడ్డంగా తలూపాడు.

''మరో నిర్భాగ్యురాల్ని ఎందుకు తయారు చేయటం !'' అన్నాడు.

''కాదు...నిజంగా చెబుతున్నాను.'' అన్నాను.

తలూపాడు.

''ఈ అలవాట్లు మానుకోడానికి ప్రయత్నించు'' అన్నాను. మళ్ళీ తలూపాడు. రైలు కదిలింది. షేక్‌హాండ్ చేశాడు శర్మ.

''వుంటానురా...జాబు వ్రాయి'' అన్నాడు రైలుతో నడుస్తూ. జాలివేశింది వాడ్ని చూచి. రైలు వేగం హెచ్చించింది. దూరంగా అచేతనంగా నిలబడి పోయిన శర్మ కన్పించాడు —

పూనా స్టేషనులో నన్ను రిసీవ్ చేసుకుంది వాణి...అదే ఆకారం...ఇంకా ఎర్రబడింది...నిర్లక్ష్యం, మొండితనం కన్పించాయి ఆమె ముఖంలో...

టాక్సీలో బయలుదేరాము...దక్కన్ జింఖానాకు. ''నీ రూములోనేనా నాకు బస ?'' అన్నాను...తలూపింది...

''భయపడకు...నేనంతగా మారి పోలేదులే...'' అంది...

''స్టేషను దగ్గర నీతో మాట్లాడిన వాడెవడు ?'' అన్నాను.

ప్రొద్దున్నే లేచేసరికి కాఫీతో తయారయింది వాణి. రాత్రి ఎంత నిస్సహాయంగా అవుపించిందో అంత బెట్టుగా, అంత మొండిగా నిల్చునివుంది...

"రాత్రి నిన్ను నేనేం చేయలేదు కదా ?'' అంది నవ్వి.

"మరేం ఫరవాలేదు...నేను అంత ఖీరుడ్నికాదు—వాసులాగా" అన్నాను..

క్షణంపాటు తెల్లబోయింది. మరు క్షణంలో మళ్ళీ అదే మొండితనం, నిర్లక్ష్యం నిల్చాయి ముఖంమీద...

"కాఫీ ఎలావుంది ?" అంది నా ప్రక్కనే కూర్చుని.

"నీ వడగ దల్చుకుంది అదికాదుగా.. ఏమిటి సంగతి ?" అన్నాను. జడను తమాషాగా—కారక్టరిస్టిక్‌గా—వక్షం మీదినుంచి వెనక్కు విసిరేసింది...కళ్ళల్లో నక్షత్రాలు మెరిశాయి...

"నేనూ హైద్రాబాదు రానా ?" అంది చిలిపిగా...

"వాసును బ్రతకనీవా ?" అన్నాను..

"నేనేం చేశాను ? ఏదో తేల్చుకుందామని..." అంది...ముఖం గంభీరంగా, పెట్టి, కళ్ళు నేలకుదింపి మ్లా ట్లా డ సాగింది...

"మా వూర్లో అందరికీ తెలుసు—మా క్లాస్ మేట్సందరూ ఎరుగుదురు... మరేం చేయమంటావు ? నన్ను అందర్లో అవమానం చేయటంకాదా? ఇప్పుడు తను నన్ను మరిచిపోయి, వుత్తరాలు మానేసి, గప్‌చిప్‌గా నేను నిస్సహాయుడ్ని; నన్ను మర్చిపో అంటే నాగతేంకావాలి ?"

"నింజగానే నీవు అడగదల్చుకున్నావా ?" అన్నాను.

"ఏం ? తప్పా ? నేను ఆడదాన్ని... అంతత్వరగా మీలాగా మర్చిపోలేను... అతనిలాగా వాళ్ళపిన్ని చూస్తుదనో, వాళ్ళ మేనకోడలు ఏడుస్తుందనో వుత్తరాలు చింపి పారేయలేను... జీవితంలో మొదటిసారి ప్రేమలో



పడ్డాను...ఆ మధురక్షణాల్ని, చెయిజారి పోయినాసరే దాచుకోదల్చుకున్నాను" అంది...

"అందువల్ల నీ కేమయినా లాభం వుంటుందా ?"

''ఏమో! చింపేసింతర్వాత మరేం మిగలవుకదా! అప్పుడప్పుడూ అవిచూచుకుని జారిపోయిన వసంతం మళ్ళీ జ్ఞప్తికి తెచ్చుకుంటాను...ఆ రోజు సెలవుపెట్టి ఆలోచిస్తూ,ఏడుస్తూ కూర్చుంటాను...!"

"మరినీకు ధైర్యం చెప్పటానికి ఎవరో ఒకరు కావాలిగా ?''

"మరేం ఫర్వాలేదు...నిన్న నిన్ను చూచింతర్వాత అలా ప్రవర్తించాను... నీవు అందరిలాంటి వాడివి కాదుగా ."

"థాంక్స్''...నవ్వింది...అదే గలగలమని సెలయేరు పారినట్లు నవ్వు... పండుటాకులమీద ప్రియురాలి పాదాల చప్పుడు...

"నీ నవ్వు టేప్ రికార్డ్ చేసి వాసుకి విన్పిస్తే ?'' అన్నాను...

"క్షణంలో ఇక్కడికిరాడూ? అయినా ఏమోలే!''అంది. క్షణంలో చిలిపితనం... మరుక్షణంలో నిరాశ, ఆవేదన ...

సాయంత్రం పూనా హైద్రాబాదు కంపార్టుమెంట్లో కూర్చున్నాను...ఇంకా మద్రాసు ఎక్స్‌ప్రెస్ రాలేదు...

కాఫీ త్రాగాము...

"వాణీ, శర్మను పెండ్లిచేసుకో... వాడూ బాగుపడతాడు" అన్నాను...

"వాడా ! బ్రూట్ - డ్రంకర్డ్...'' అంది కోపంగా... "వాసులాగా పిరికి వాడుకాదు... నీవు దార్లో పెట్టగలవు వాడ్ని... స్వతహాగా మంచివాడు అసలు'' అన్నాను.

''నీవెంత పొగడినా సరే, నేను ఆ బ్రూట్‌ని మరిచిపోయాను, మరి మాటాడకు అతన్నిగూర్చి - ప్లీజ్'' అంది.

''సరే" అన్నాను.

"మరి నీ పప్పుకూడు ఎప్పుడో" అంది వెంటనే, అంతా అప్పుడే మర్చిపోయినట్లు. క్షణంలో ఎంత భేదం !

"ఆలోచిస్తున్నాను - మంచి అమ్మాయినిచూచి, కట్నం అదీ...''

''కట్నం ! అదీకూడానా !" అంది నవ్వుతూ...

"ఏం మరి ? అందగాడు, రచయిత, స్పోర్ట్స్‌మన్, పెద్ద సైంటిస్టు ఇన్నీ అయిన నాలాంటివాడికి మార్కెట్‌లో ఎంత డిమాండో తెలుసా ?'' అన్నాను.

రైలు కదలేసరికి అంత నిర్లక్ష్యమూ, ధీమా కరిగిపోయాయి. మళ్ళీ అబల, నిస్సహాయ, విహ్వల అయిపోయింది.

"మధూ, నీవు సెలక్టు కావాలని కోరుకుంటున్నాను - నీవుంటే నాకు ఎంతో అండగా వుంటావు... ప్రతి ఆదివారం నీవు బొంబాయినుంచి రావచ్చు.."

"అవునవును - పూరికే టిక్కట్లిస్తారట నీకోసం !'' అన్నాను.

"నమ్మ మధూ - నీవు పోతుంటే



"జాన్‌సన్ 1767 లో పుట్టేడు. 1776 లో ఏమయిందో తెలుసా?"
''జాన్‌సన్‌కి 9 ఏళ్ళు నిండేయండి.''

ఎలాగో వుంది – మళ్ళీ నిన్నెప్పుడో చూచేది!" అంది. కండ్లలోనీరుపైకి రాకుండా విశ్వప్రయత్నం చేసింది. రైలు కదిలింది.

"వాసు ఎలావున్నాడో వ్రాయి..." అంది హీనస్వరంతో.

''నీ కెందుకు – వాడ్ని అడిగేస్తాను...'' అన్నాను...

తలూపింది...జాలివేసింది చూస్తే...

''వుంటానుమధూ – మర్చిపోకు – వీలు చూచుకుని వచ్చేయి మరోసారి – లేకపోతే ఎప్పుడో పేపర్లో చదువుతావు!" అంది రైలువేగం హెచ్చించి, వాణి నుంచి నన్నుతీసుకెళ్ళింది ... దూరంగా లీలగా కన్పించింది వాణి – నిలిచిపోయి.

*   *   *

వాసుకోసం నాంపల్లిలో అరగంట కూర్చున్నాను... వాడు రాలేదు. రిక్షాలో బయలుదేరి అడ్రసు కనుక్కొని నెమ్మదిగా నారాయణగుడాలో ఇల్లు చేరుకున్నాను ఇంట్లో వున్నాడు...''

"ఏమిరా, రాలేదేం స్టేషనుకు?" అన్నాను...

"రారా, రా...లోపలికిరా....మర్చిపోయాను..." అన్నాడు.

"చంపావు...ఇల్లు దొరికేసరికి మీ తాత అవుపించాడు"

"లేదురా.....పేపరొకటి పంపుతున్నాను జర్నల్ ఆఫ్ కెమికల్ ఫిజిక్స్‌కి...దాంతో...మర్చిపోయాను – రా – కాఫీత్రాగి వద్దాంపద" అన్నాడు.

ఇద్దరం బస్సులో తాజ్ మహల్ చేరుకున్నాం. ఇడ్లీ తినసాగాం తీరిగ్గా...

"ఎలా వున్నావురా ?'' అన్నాడు నన్ను చూచి.

"నాసంగతి కేంలే..నీ గొడవేమిటి ?" అన్నాను.

తలవంచుకుని నెమ్మదిగా స్పూనుతో చట్నీ తీసుకుని చప్పరించసాగాడు. కాస్సేపు ఇద్దరం మాట్లాళ్ళేదు.

"వాణి నిన్ను అడగమంది..." అన్నాను వాడివేపేచూస్తూ....తలెత్తి లేదు వాడు. కాని క్షణంపాటు చేయివణికి నట్లు గమనించాను...తర్వాత నెమ్మదిగా నోరువిప్పాడు.

"ఎలా వుందిట ? ఏం ప్రాబ్లెమ్ చేస్తూంది ? మొన్నకాబోలు ఓ పేపరు చూచాను...'డై ఎలక్ట్రిక్స్ ఆఫ్ పోలి మర్స్' అనుకుంటాను" అన్నాడు సాధ్య మయినంత తేలిగ్గా...

"ఒరేయ్ – నాదగ్గర ఎందుకురా దాస్తావు ?'' అన్నాను.

"దాయటమా ? ఏమిటి ? దేన్ని గురించిరా ?'' అన్నాడు.

"నాకు కోపంతెప్పించకు – ఒక్కటే మాట అడుగుతాను – వాణిని నీవు ప్రేమించావా లేదా ? అవునా, కాదా చెప్పు !" తల దించుకున్నాడు. నాకే బాధవేసింది వాణ్ణిచూస్తే.

"తర్వాత మాట్లాడుతానురా...'' అన్నాడు తలవంచుకునే...

మధ్యాహ్నం లాబరేటరీకి తీసు కెళ్ళాడు...చుట్టూ అంతా ఏవేవో కాగి తాలు, పుస్తకాలు వున్నాయి. ఒక ఆప రేటస్ చూపించాడు.

''ఇది మా కొత్త 'స్కానర్ !' ఎమెర్జెన్సీముందే వచ్చింది... దాంతో చాలా పనిచేయాలి..."

అలా ఏదేదో చెప్పుకుంటూ పోయాడు...జర్మనీలో, జపాన్లో ఎవరో ఏదో చేశారట... దానికి తను ఏదో చేయాలిట... చేత్తో మెరుస్తున్న ఆ యంత్రాన్ని నెమ్మదిగా, ఆప్యాయంగా, మృదువుగా తాకుతూ ఏదేదో చెప్పుకు పోయాడు... అర్థంకాలేదు – అదింతా వింటూ పోయాను... నా ముందు కుర్చీలో కూర్చున్నాడు. తన ప్లానులన్నీ చెప్పసాగాడు ... వాళ్ళ ఆసిస్టెంటు డైరెక్టరు రికమెండ్ చేశాడుట అమెరి కాలో ఎక్కడో యూనివర్సిటీకి... ఆఖరున అడిగాను, అంతా విన్నతర్వాత "వాణి సంగతి చెప్పు –" అని. వెంటనే అతనిముఖం మారిపోయింది... నీళ్ళలో కొట్టుకుపోయేవాడు గడ్డిపోచ పట్టు కున్నట్లు కాగితాలు పట్టుకున్నాడు – వది లేశాడు – అవి వాడి కేరక్షణా యివ్వ లేదు. లేచిపోయి స్కానర్ దగ్గరనిల్చు న్నాడు. మెయిన్ స్విచ్ వేశాడు. లైట్లు వెలుగసాగాయి... కొంత రంగు వచ్చింది వాడి ముఖంలోకి.

ఓ సంగతి చెప్పాలని వచ్చాను... అన్నాడు తర్వాత

"ఏమిటి ?" అన్నాను.

"నా పెండ్లి నిశ్చయం అయిపోయింది" అన్నాడు.

నేను అనుకోకపోలేదు ఇలా అవుతుందని.

"మీ మామగారి..." అన్నాను.

"కాదు..." అన్నాడు

"ఎవరు మరి ? ..."

"నీకు తెలియదు... ఆరువేలు కట్నం... అదీ చెప్తున్నాను"

"వాణి నేం చేయదల్చుకున్నావు ?" అన్నాను...

"నే నేమీ చేయలేను - మా వాళ్ళు వప్పుకోలేదు... నాకు అష్ట కష్టాలుపడి చదువు చెప్పించారు నాన్నగారు. వారికి కృతజ్ఞత చూపాలి - అది నా బాధ్యత... ఏదో వుద్రేకంలో, తెలియని వాగ్దానం చేశాను - అది వీలుకాదు - అయినా వాణికి నేను తగను -" అన్నాడు.

"వాణే అడగమంది -" అన్నాను.

"అడగాల్సిందే - కాని, వాణికి తెలుసు నా సమాధానం ఏమిటో - నీకూ తెలుసు -" అన్నాడు.

ఎవరో వచ్చారులోపలికి.

"ఇప్పుడే వస్తానుండు" అని బయటికి పోయాడు.

ఆరోజు సాయంత్రం హౌరా ఎక్స్‌ప్రెస్‌లో బయలుదేరాను. నాంపల్లికి వచ్చాడు వాసు...

"ఏం రాయమంటావు వాణికి" అన్నాను...

బాధగా చూచాడు నా వేపు... అంతదాకా ఆపుకున్న ఆవేదన అంతా కన్పించింది స్పష్టంగా వాడి ముఖం మీద

"మధూ - నీవు ఒక్కడివే నన్నర్థం చేసుకోవాలి... నే నెవరికన్నా సమాధానం చెప్పగలను - కాని, నీ ప్రశ్నకి చెప్పలేను - నిజాన్ని దాచి అబద్ధం చెప్పలేను నేను - నేను దురదృష్ట వంతుడ్ని అనిమాత్రం నాకు తెలుసు - కాని నేను నిస్సహాయుడ్నిమధూ - నా భవిష్యత్తూ నా జీవితం ఏనాడో నా చేతుల్లోంచి జారి పోయాయి. వాణికి అదే వ్రాయి... జ్ఞాపకం వుంచుకో -" అన్నాడు.

రైలు కదిలి పోయింది... రేపు ప్రొద్దున నేను రాజమండ్రిలో వుంటాను- శర్మ వి. టి. లో సూటుతో తిరుగుతుంటాడు-తన్ను తాను, తెలిసే నాశనం చేసుకుంటూ - వాణి లాబరేటరీలో వుంటుంది, తన్నుతాను మర్చి పోవాలని ప్రయత్నంచేస్తూ - వాసు కౌంటర్ల మధ్య తనూ ఒక యంత్రమై పోతాడు - అందరం అంతే - రోజులుమాత్రం ఇలాగే బాధగా, వంచనతో సాగిపోతూ వుంటాయి.



# కలిసి జీవించుదాము

యల్లాప్రగడ సీతాకుమారి



ఆ రోజున జనవరి ఇరవయ్యారు ఆనాడే చూశాడు మదన బాబు. అరుణాదేవిని నగరంలో ప్రజలు ఏర్పాటు చేసిన రిపబ్లిక్ దినోత్సవాల సభలో అరుణ ఉపన్యాసం ఇస్తూ ఉన్నది. అంతవరకు రాజకీయ నాయకురాలిగా పేరుగాంచిన అరుణాదేవిని గురించి వినడమే కాని ఆమెను చూడడమూ, ఆమె ఉపన్యాసం వినడమూ ఇప్పుడే జరిగాయి

అరుణ గుక్క తిప్పకుండా మాట్లాడుతున్నది; నూరు సంవత్సరాల స్వాతంత్ర్య పోరాటమూ, వీరుల త్యాగమూ, శ్రమజీవుల ప్రధాన్యత, చెప్పుకుపోతూ సరిహద్దుల్లో దురాక్రమణలూ, యువతీ

యువకుల బాధ్యతలూ బంగారుబాండ్ల అవసరమూ ఒకటేమిటి అట్లా అనర్గళంగా చెప్పుకుపోతుంటే మదన మోహన్ వింటూ వుండిపోయాడు.

మదన్‌బాబుకు స్త్రీలంటే కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి మేధావులైన స్త్రీలంటే అతనికి కొంత చులకనభావము. స్త్రీలు లలితకళలు నేర్చుకొని పురుషులను ఆనందింపచేయటం వారి ముఖ్యధర్మమని అనుకుంటూ వచ్చాడు. కాని ఈ రోజున అరుణ తనను ఎందుకు ఇంతగా ఆకర్షించుతున్నదో. తనకే ఆశ్చర్యం వేసింది.

సభ అయిపోయింది. గందరగోళం తగ్గిన తరువాత వేదిక దగ్గరకు పోయాడు. ఎవరో తననుగూడా అరుణకు పరిచయం చేశారు "వీరు మదన మోహన్‌గారు, లలితకళా సంఘానికి అధ్యక్షులు" అని అరుణ నమస్కారం



చేసింది. ఒకసారి తనవైపు పరిశీలనగా చూచింది. తన మెత్తనిజుట్టూ, బంగారు కళ్ళజోడూ, వులనుసూటూ, ఖరీదైన బూట్సూ అన్నీ ధన్యమైనాయని అనుకున్నాడు.

ఆ రాత్రి మదనబాబుకు పాత విషయాలన్నీ జ్ఞాపకం వచ్చాయి అప్పటికి కొంతకాలం క్రిందిమాట. తన తండ్రి పట్టాభిరామయ్యా, అరుణతండ్రి సీతారామయ్యా స్నేహితులుగావుండి కాలేజీలో చదివే రోజుల్లో కొంతకాలం సన్నిహితులుగావుండేవాళ్ళు. తరువాత వారి మార్గాలు భిన్నంఅయ్యాయి సీతారామయ్యా మీద ఆనాటి జాతీయ భావాల వత్తిడి బాగా పనిచేసి కాలేజీవిడిచిపెట్టి తెలుగుదేశంలోని జాతీయపోరాటంలో ప్రధానపాత్ర వహించాడు. ఆతని జీవితమంతా పోరాటమూ, జైళ్ళూ, ప్రవాసమూ ఆర్థిక బాధలూ ఇట్లాగే గడిచిపోయాయి. స్వాతంత్రంవచ్చిన కొద్దిరోజులకే తండ్రినికోల్పోయిన అరుణకు అతని వారసత్వమైన ఆర్థిక చిక్కులతోపాటు సంఘసేవా, పలుకుబడిగూడా పట్టుబడ్డాయన్నమాట.

తనతండ్రి పట్టాభిరామయ్యా దూర ప్రాంతాలలో చాలాకాలంతిరిగి పారిశ్రామికంగా పెద్ద పేరుబొంది విశేషంగా సంపాదించిపెట్టిన ధనంతో తాను ఇక్కడే స్థిరపడి పోయాడు. ఈ మధ్యనే ప్రజారంగంలోగూడా కొంతపేరు ప్రతిష్ఠలు సంపాదించవలెననే పట్టుదలతో ఈ లలిత కళా సంఘాన్ని తన సొంత ధనంతోనే స్థాపించాడు.

అనుకోకుండానే ఆమరునాడు వెతుక్కుంటూ వచ్చి అరుణ యింటి ముందు ఆగింది మదనబాబు కారు. ఇల్లంతా నిరాడంబరంగావుంది. ఆ ముందుగదిలో నాలుగైదు కుర్చీలు వ్రాతబల్ల, పుస్తకాల అలమారు, చిన్న రేడియో, టెలిఫోనూ పరిశుభ్రంగా వాటి వాటి స్థానాల్లో వున్నాయి. గోడమీద వ్రోసినోటిగాంధి, బల్లమీది చలువరాతి గౌతమబుద్ధుడూ తనకు పాతకాలపు స్మృతులను జ్ఞాపకం చేసినట్లనిపించింది.

లోపలినుంచి వచ్చింది అరుణ. అప్పుడే స్నానంచేసిన తడిజుట్టూ, పెద్ద కళ్ళూ, చిన్నబొట్టూ, ఎర్రంచు తెల్ల చేనేతచీరా,నవ్వుముఖమూ. సొమ్ములు లేకుండాగూడా స్త్రీలు అందంగా వుండవచ్చునని ఇప్పుడేతోచింది మదనమోహన్‌కు.

అరుణ మందహాసంతో ఆహ్వానించింది మదనబాబును. మర్యాద చేసింది. కాఫీ తెప్పించి ఇచ్చింది. కొంతసేపు లోకంపోకడలూ, సరిహద్దు ఘర్షణలూ, దేశంలో అత్యావసర పరిస్థితులూ మాట్లాడింది. ఇద్దరూ తమ

తల్లిదండ్రులకు సంబంధించిన పరిచయాలు వెల్లడించుకున్నారు. ఆ సందర్భంలోనే తెలిసింది మదనబాబుకు అరుణ యమ్. ఎ. పాసయ్యి ఒక ప్రయివేటు కంపెనీలో పనిచేసుకుంటూగూడా పురాణజ్వరంలాగా సంక్రమించిన ఈసంఘసేవాభిలాషను విడిచిపెట్టుకోలేక పోతున్నదని. ఆమె అప్పుడప్పుడు పత్రికల్లో పేదవారి పక్షం అవలంబించి వ్రాసేవ్యాసాలూ కథలూ తనలో కొంత చికాకు కల్పించినా ప్రత్యక్షంగా చూచినప్పుడు ఆమెలో కొంతఆవేదనన లేకపోలేదని అనుకున్నాడు.

చివరకు గొంతు సవరించుకొని చెప్పాడు "అరుణాదేవి గారూ, మా లలితకళా సంఘానికి వార్షికోత్సవాలు పస్తున్నాయండీ వచ్చేనెలలో. ఈ లోపలమీరుఒకసారివచ్చి ఆ సంఘాన్ని చూడాలి. మీ కభ్యంతరం లేకపోతే ఈరోజున తీసుకుపోదామనే వచ్చాను"

"లలిత కళలకు సంబంధించిన ప్రావీణ్యం అంతగా నాకులేదు. కాని మీరు రమ్మంటే అలాగే వస్తాను."

మదన్ మోహను కళ్ళు ఆనందంతో మెరిసిపోయాయి.

అయిదు నిముషాల్లో తయారయి వచ్చింది అరుణ. నగరంలోని విలాసమైన వీధులన్నీ చుట్టుకుంటూ లలితకళాసంఘం ఆవరణలోకి వచ్చింది మదన్ బాబు కారు.

ఒక్క-క్షణం అరుణ విభ్రాంతి పడిపోయింది. లలితకళాసంఘం అంటే ఏదో చిన్నగదిలో వున్నదనుకున్నది గాని ఈ విశాలమైన భవనాలూ ,ఈ తోటం అంతా ఆ సంఘానికేనా !

మదన్ మోహను గర్వంగా చూచాడు ఒకసారి అరుణవైపు. నిన్నటినుండీ తన గొప్పతనాన్ని తన అధిక్యతనూ ఆమె గ్రహించినట్లే లేదు. ఇప్పటికైనా కొంత తెలిసికొని వుంటుంది అనుకున్నాడు.

నిజంగా అరుణకు గూడా మదన్ ఇప్పుడిప్పుడే అర్థమవుతున్నాడు! తను తలచినంత పనికిమాలిన మనిషి కాడు అతను. అతనిలోగూడా కొంత క్రియాశక్తి వుంది. అయితే దాన్ని వుపయోగించుకునే విధం తెలుసుకోవాలి.

"ఇదేనండీ మా సంఘం. రండి లోపలికిపోదాము'' లోపలికి దారి తీశాడు. 'లోపలికి పోతే నేగాని లోపం ఎక్కడుందో తెలీదు' అనుకొని "సరే చూద్దాం పదండి" అతణ్ణి వెంబడించింది.

మదనమోహను అరుణను సగౌరవంగా లోపలికి తీసుకుపోయినాడు. విశాలమైన ఆ భవనాలను ఎట్లా శాఖోపశాఖలుగా విభజించిందీ వివరించాడు. ఒకక్షణం తనలో తనే కే

ఆశ్చర్యం వేసింది. అరుణవంటి ఒక సామాన్యస్త్రీకి తాను ఎందుకు ఇంత గౌరవం చూపుతున్నానో అని. తనకు తెలియకుండానే తాను అరుణకు అధీనుడై పోతున్నాడా ఏమిటి!

"ఇది నృత్యమందిరమండీ" అన్నాడు మదనబాబు ఒక హాలులోకి తీసుకుపోతూ "తెలుస్తూనే వున్నదె గాదూ ఈ నటరాజ విగ్రహమూ, ఈ నిలువుటద్దాలూ, ఈ నాట్యచిత్రాలూ; వీరేనా మాష్టరు గారు?"

డాన్సు మాష్టరు శాంతివర్ధన్ నమస్కారం చేశాడు. ఆతని విశాల నేత్రాలూ, ఉంగరాలుతిరిగి బుజాల వరకూ వ్యాపించిన శిరోజాలూ, బరువైననడక ఆడపిల్ల వేసిన మగవేషం లాగా సౌకుమార్యాన్ని వొలక బోసినాయి.

గోడలమీది వివిధ సాంప్రదాయాల విన్యాసాలూ, ప్రఖ్యాత నర్తకుల ఛాయాచిత్రాలూ చూస్తూ ఒక నిముషం నిలబడిపోయింది అరుణ.

"నృత్యశిక్షణ సాయంత్రం ప్రారంభం అవుతుంది, గానమందిరం చూద్దామురండి." తోవతీశాడు మదన బాబు. "ఈమె, శచిప్రభ. సంగీతం నేర్పుతారు" పరిచయం చేశాడు... సంగీత మందిరంలో వాయిద్యాలను పరిశీలిస్తున్న ఒకయువతిని చూపిస్తూ.

శచి పెద్ద సౌందర్యరాశి కాదు. గాని ఒకసారిచూస్తే, మరికొంచం సేపు చూడ బుద్ధి అవుతుంది. గుండ్రని ముఖమూ మెరకకండ్లు, పొడుగాటిజడ, నవ్వు చిందేముఖమూ, బుగ్గమీదిగుంట.. కొత్తఅతిధిని చూచి గౌరవ భావం ప్రదర్శించింది

"ఏమేమి వాయిద్యాలు వాయించుతారు?" అడిగింది అరుణ, తనకు ఎక్కువ పరిచయం లేని వాయిద్యాలని అక్కడ పరిశీలిస్తూ

"గాత్రమూ, ఫిడెలూ, గూడా నేర్పుతాను గాని నాకు వీణఅంటేనే కొంచెం ఇష్టం" అంటూ మదన మోహనువైపు సానుభూతికోసం వాంఛిస్తున్నట్లు చూచింది.

"అవును, శచిగారికి వీణ మీదనే పక్షపాతం ఎక్కువ" సమర్థించాడు. శచి కృతజ్ఞతా సూచకంగా మంద హాసం చేసింది

"ఐతే మదనబాబుగా! ఎన్ని వందల మంది విద్యార్థులున్నారు ఈ సంఘంలో?" అడిగింది బయటకువస్తూ.

"వందలమంది ఎక్కడ! ఏ శాఖ లోనూ పది పన్నెండు మందికంటే ఎక్కువమంది లేరు. ఆలోపం ఎక్కడున్నదో గూడా మీరే కనిపెట్టాలి."

మాట్లాడుతూనే చిత్రశాలకు వచ్చారు. విద్యార్థులు కొందరు అప్పుడే పని నేర్చుకుంటున్నారు. అరుణకు ఆ చిత్రాలన్నీ పాతపోకడలవి



"అలా గంతులేస్తున్నా వేమిటి?"
"ఇందాకా మందు షేక్ చేసి తాగడం మరిచిపోయాను."

గానే కలిపించాయి సౌందర్యవతులైన స్త్రీలనూ, బలిష్టులైన పురుషులనూ వారి శరీరంలోని అందమైన భాగాలను మాత్రం ప్రదర్శించి దానికి కళ అని పేరుపెట్టుతున్నట్లు అనిపించింది.

నిరుత్సాహంతో లోపలిహాలులోకి వెళ్ళిన అరుణని అక్కడ కొన్ని చిత్రాలు ఆకర్షించాయి. కేవలం సౌందర్య ప్రధానమయినవిగాక ఒక సందేశాన్ని ప్రజలకు ఇచ్చే భావప్రధానమయినవిగా అని కనిపించి ఆమెలో ఆశను కల్పించాయి

"ఈచిత్రాలు వేసిన విద్యార్థిని పిలిపిస్తారా కొంచెం"

మదన్ గతుక్కుమన్నాడు. ఈమెకు ఈ పిచ్చి చిత్రాలు నచ్చలేదుగదా!

"అట్లాగే పిలిపిస్తాను. అతనుగూడా ఒక మాష్టరే, కృష్ణభూషణ్. ఏవో గీస్తాడు పిచ్చి చిత్రాలు. సౌందర్యము గాని కళగాని వుండదు వాటిల్లో" అంటూనే కబురు చేశాడు.

కృష్ణభూషణ్ వచ్చాడు. ముందు మదనమోహన్‌కూ తరువాత అరుణకు నమస్కారం చేశాడు.

అరుణకు కృష్ణభూషణ్ కళ్ళల్లో ఏదో అర్థంకాని వెలుతురు కనిపించింది. మేధాశక్తికి నిలయమైన ఆతని పెద్దనుదురూ, పొడుగాటి చేతులూ నిడారంబరమైన వేషమూ ఆమెహృదయంలో ఏదో ఉద్రేకాన్నీ, ఉత్సాహాన్నీ కలిగించాయి. ఇట్లాంటి మనిషికోసం ఎదురు చూస్తున్నది తాను ఇంతకాలమూను.

అరుణ తన ఉద్వేగాన్ని అణచుకుంటూ "మీరేనా ఈ చిత్రాలు వ్రాశారు ? మిమ్మల్ని చూచిన తరువాత నాకు మనకళాకారులమీద కొంతవిశ్వాసం కలిగిందిలెండి. ఎప్పటికైనా మీలాటి వ్యక్తిత్వంఉన్నవాళ్ళకి సంఘంలో నిజమైన స్థానం దొరక్కపోదుగూడాను " అంటూ గబగబా మాట్లాడింది అరుణ.

కృష్ణభూషణ్ కళ్ళు ఆనందంతో మెరిశాయి. తన చిత్రాలను ఇంతగా పొగిడినవాళ్ళు తనకు దొరకలేదు. అరుణవంటి పేరుబొందిన సంఘ సేవకురాలు మధుర ప్రేమార్ద్రమైన వాక్యములతో తన్ను ప్రశంసిస్తూ వుంటే ఎట్లా కృతజ్ఞత చెప్పాలో గూడా తెలీక బొంగురు పోయిన గొంతుతో "మీరను కుంటున్నంత గొప్పవాణ్ణి కాదనుకోండి. మన దేశంలోని చిత్రకళలో ఒక ప్రత్యేకతను తీసుకురావడానికి కొంత ప్రయత్నం చేశాను. అంతమాత్రాన.."మధ్యలోనే అరుణ అందుకుని "ఇది సామాన్యమైన ప్రతిభ కాదు కృష్ణభూషణ్ గారూ. రవివర్మ చిత్రాల్లోనూ, బాపిరాజుగారి చిత్రాల్లోనూ కనిపించే భావకుశలత మీ చిత్రాల్లో కనిపిస్తున్నది రాజులకోసమూ, జమీందార్ల కోసమూ కాకుండా ప్రజాజీవితానికి సంబంధించిన ఇట్లాంటి చిత్రాలు మనకు ఎంతైనా అవసరం వుంటాయి చూడండి."

మదనమోహన్ ఆశ్చర్యపోయాడు అరుణ ధోరణికి. ఇంతసేపూ అంత గంభీరంగా మాట్లాడుతూ వచ్చిన అరుణ కృష్ణనుచూడగానే అంత చొరవగా మాట్లాడుతూ వుంటే అతను అర్థం చేసుకోలేక పోయాడు. "అతని చిత్రాల్లోనే కళ వున్నదా ? తన నిర్మాణ పద్ధతిలో కళలేనే లేదా?" నాలుగువైపులూ చూచాడు. ఇంత కాలమూ తానెంతో విలువైనవిగా తలచిన సుందరమైన చిత్రాలు వీని ముందు అర్థరహితమైనవిగా వెలాతెలా బోయాయి. సజీవమైన గ్రామీణ జీవితాల్ని, పచ్చని గ్రామాలనూ శ్రమజీవితపు విలువల్ని ప్రదర్శించే కృష్ణభూషణ్ చిత్రాలు తనలోగూడా ఏదో ప్రేరణ కలిగిస్తున్నట్లు భావించాడు.

"వచ్చే సంవత్సరోత్సవాల్లో ఈ చిత్రాలన్నీ ప్రదర్శించుతాము లెండి" బయటికి దారితీశాడు. అరుణ అందరి దగ్గిరా శలవు తీసుకుంటూ తటాలున కృష్ణభూషణువైపు చూచి "ఇంతకూ మీరు ఉండడం ఎక్కడంటారూ" ప్రశ్నించింది అప్పుడే ఆ అనుమానం తట్టినట్లు. "ఈ తోటలోనే" మదన్‌బాబు అందుకున్నాడు "ఇక్కడ పనిచేసే వాళ్ళందరికీ ఇళ్ళుగూడా ఇక్కడేవున్నాయి"

ఈ సారి అరుణ కృష్ణభూషణు వైపే సూటిగా చూస్తూ "ఒకసారి మా ఇంటికి మీరుగూడా రండి, మీకు వీలైనప్పుడు. ఏవో కబుర్లు చెప్పుకుందాము కళను ఎట్లా వుద్ధరించాలో" నవ్వింది

"అంతకంటేనా ? తప్పకుండా వస్తాను" తనుగూడా కొంత చొరవ తీసుకున్నాడు కృష్ణభూషను "అప్పుడప్పుడు మీ సూచనలను గూడా తీసుకుంటాను"

కారులో ఇంటికి తీసుకొస్తూ అరుణతో లలితకళాసంఘాన్ని ఎట్లా పైకి తేవాలో మాట్లాడాడు మదనబాబు. సునుపటికంటే అరుణకు తాను సన్నిహితుడైనట్లుగూడా తన ధోరణిలో చూపించాడు. ఒకటి రెండు సార్లు మాటల సందర్భంలోలాగా ఆమెచేతిని తనచేతిలోకి తీసుకున్నాడు గూడాను.

అరుణ ఇవ్వేవీ గమనింపనట్టే మాట్లాడింది. "చూడండి మదనబాబు గారూ, ఈ సంఘంలో ఏవో లోపాలు కనిపిస్తున్నాయి. మీ దగ్గర కళాకారులకు కూడా తక్కువేమీ లేదు. అయితే ప్రజాజీవితానికి మరింత దగ్గరగా రావడానికి ప్రయత్నం చెయ్యలేదేమో అనిపిస్తున్నది" అంటూ తానుగూడా సానుభూతిసూచకంగానే మాట్లాడింది.

ఒకటి రెండువారాలు గడిచాయి. మదనమోహన్ అప్పుడప్పుడు వచ్చి సంఘంగొడవలు మాట్లాడి పోతూన్నాడు. కృష్ణభూషణుడు వస్తాడేమోనని ఆశించిందిగాని అరుణ. అతను ఒకసారిగూడా రానేలేదు.

అరుణహృదయంలో ఈ సుధ్యతుపానులు వీస్తున్నాయి. ఇంత కాలము తాను తలచనివీ తనకు తెలీనివీ అయినభావాలు తనమీద వత్తిడి చేస్తున్నాయి. తన కుటుంబానికి తానే పోషకురాలు. అందుకనే ప్రేమ, పెండ్లి అనే మాటలనే తన దగ్గిరకు రానివ్వలేదు. అందులోనూ ఇప్పుడు దేశంవున్న పరిస్థితుల్లో తనలాటి సంఘ సేవకురాలి కర్తవ్యం ఎంతైనా వున్నది. అయితే ఈ ప్రశాంతమైన తన వాతావరణము మదనబాబు ప్రమేయంతో కలతబారింది అతని వుద్దేశం ఏమిటో ఇప్పుడిప్పుడే గ్రహింపగలుగుతున్నది. కాని మధ్యలో ఈ కృష్ణభూషణ్ ఎవరు? తనను ఇంతబలంగా ఆకర్షించడము ఎందుకు? ఈ వ్యవహారం ఎంతవరకు పోతుందో! పోనీ, తానే మరొకసారి అతన్ని కలుసుకుంటేనో.

ఒకనాడు సాయంత్రం ఆరుగంటల తరువాత తానే రిక్షాచేసుకొని లలిత కళాసంఘానికి వెళ్ళింది. అక్కడి నౌకర్లతో తెలుసుకొనిసరాసరి కృష్ణభూషణ్ యింటికే వెళ్ళింది. కృష్ణ

భూషణ్ ఒక్కసారి అదిరిపడ్డాడు. అరుణాదేవి తన ఇంటికి రావడమా? అసలు ఆతని హృదయంలోగూడా ఈ మధ్య కొంత సుడిగాలి ఏచింది చాలాకాలంనుంచి తను శచిప్రభ మీద కొంత ఆశపెట్టుకున్నాడు ఆమె వీణవాయిండడం మొదలు పెట్టగానే తనలో ఏవో మధురమైనభావాలు కలుగుతూ వుంటాయి. అయినా శచి హృదయంలోని లోతులు ఇంకా తనకు అవగాహన కాలేదు. ఆమెకు మదన్ బాబువంటి ఆడంబరజీవులే నచ్చుతారేమోనని గూడా అనుకున్నాడు. అయితే ఈఅరుణను చూచిన తరువాత, అరుణ తనకిచ్చే వ్యక్తిగత ప్రాధాన్య తను చూచుకొని ఎందుకో తన కర్తవ్యాన్ని తానునిర్ణయించుకోలేక పోతున్నాడు ఈ రోజున అరుణ స్వయంగా తనయింటికి రావడమంటే సౌభాగ్యదేవత అడుగు పెట్టినట్లనిపించింది.

కోటిదివ్వెల కాంతులు తన ముఖంలో వెలుగుతున్న వికాసంతో కృష్ణభూషణు అరుణను ఆహ్వానించాడు. ఆమెఅడక్కముందే "నేను అనుకుంటూనే వున్నాను, నా మీద మీకు బాగా కోపంవచ్చి ఉంటుందని. ఏం చెయ్యమంటారు చెప్పండి? వార్షికోత్సవాలు దగ్గరకు వస్తున్నాయి గదూ, బొత్తిగా తీరికలేకపోయింది'' అంటూ నీళ్ళు నమిలాడు తనుగూడా కొంత బాధపడుతున్నట్లు. నిజంగా తనకు వచ్చిన కోపంగూడా పురిచి పోయింది అరుణ నవ్వుతూ "ఇంతకూ మీ వార్షికోత్సవాలకు కొత్తచిత్రాలు ఎమైనా వేస్తున్నారా" అని పరామర్శ చేసింది. చేతివృత్తుల విలువలను నిరూపించుతూ ఈ మధ్యతాను గీసిన చిత్రాలన్నీ చూపించాడు కృష్ణ. పండ్లూ కాఫీ తెప్పించాడు.

సరిగా ఈ సమయానికే వచ్చింది శచిప్రభ. ఆమె అప్పుడప్పుడు అట్లా రావడం మామూలేకాని తలవని తలంపుగా అరుణను చూచి కొంచెం చెకితురాలయింది.

అరుణ ఆమెను ఆహ్వానించింది తనప్రక్క కుర్చీచూపించి ఆమెకు తన కాఫీని అందించింది. శచిప్రభ కృష్ణ వైపు చూస్తూ "నాకుమాటమాత్రం చెప్పలేదుగాదూ, ఈ రోజు అరుణాదేవి వస్తున్నట్లు" నిష్ఠూరం వేసింది.

కృష్ణ ఏదో చెప్పబోయి నిలుపు దొక్కుకొని" అవును, తొందర్లో మరిచి పోయినట్లున్నాను" అని అరుణవైపు చూసి "మీరు శచిప్రభపాట కొంచెం వింటారా" అంటూ మాట తప్పించడానికి కొంచెం ప్రయత్నం చేశాడు.

"వినాలని వుందిగాని ఆమె ప్రక్కవాయిద్యాలఘోష లేకుండా పాడితేగదా!" నవ్వింది.

కృష్ణ కూడా నవ్వు ఆపుకోలేక పోయాడు అదేగర్వమండీ ఈ సంగీతవిద్వాంసులకుండేది కవులకూ చిత్రకారులకూ పరికరాలుకావాలట తమకళకు పరికరాలు లేకపోయినా పరవాలేదట ఏదీ శచిగారూ ఒక పాట వినిపించండి!

శచికి ఎక్కడినో హృదయాంతరాళంలో చెప్పలేనంతబాధ కలిగింది తను ఇంతకాలంగా వాంఛిస్తున్నది ఈ కృష్ణభూషణ్ణే నన్నమాట ఎప్పటికైనా మదనమోహను తనకు అందని చందమామేగా పంజరంలో చిలుకలాగా తనుతలచిన కృష్ణ తనకు ఇంతగా కావలసినవాడని ఇప్పుడే తెలిసిందన్న మాట తను సాధారణవ్యక్తి గాదనీ తనవిద్య అనన్య సామాన్యమనీ అరుణ గూడా గ్రహించాలి ఒక్కసారి తన సర్వశక్తుల్నీ కూడతీసుకొని తనకు బాగా ఇష్టమైన మీరాబాయిగీతాన్ని ఒకదాన్ని మొదలుపెట్టింది

అరుణ దిగ్భ్రాంతురాలై పోయింది ఇదేమిటి ఇది సంగీతమా చంద మామలోనించి ప్రవహించే సుధా ప్రవాహమా! అనిపించింది ఒక్క క్షణం తనఎదురుగా కూర్చున్నది మీరాబాయి కాదుగదా అనీ గూడా అనుకున్నది ఇంత గొప్ప శక్తిమంతురాలిని ఎట్లా ఉపయోగించుకోవాలో వీరికి తెలియదన్నమాట

శచి పాడుతూనే వున్నది పాడుతున్నంతసేపూ కృష్ణభూషణువైపు చూస్తూనే వున్నది ఆ చూపుల్లో నేను ఇంత మహాశక్తి సంపన్నురాలినని నీకు తెలీదుగదూ అన్న భావమే కనిపిస్తున్నది

కృష్ణభూషణు చకితుడై నాడు ఇదేంపాట! ఇదివరకు శచి ఎప్పుడూ ఇంత భావప్రధానంగా పాడనేలేదే! ఎంతసేపూ తాళాలూ లయలూ ఎక్కడ తప్పుతాయోనన్న బాధేగాని గుండె కాయపండించి తన పాటలో పెట్టుతున్నదామెమిటి క్షణ క్షణం అతని ముఖంలో ఆనందపు మెరుపు నిండి పోతున్నది

అరుణ తలంపుల్లో ఒకచిన్న కదలిక గలిగింది ఈ కృష్ణభూషణు శచిని ప్రేమించుతున్నాడా ఏమిటి! శచికి ఇతనమీద ఇంత చనువున్నదా! తన ప్రేమేయంకన్న వారి ప్రేమపథం కంటకావృతం గాదుగదా!

శచిపాడుతూనే వున్నది మరొక మధురగీతాన్ని కారు ఆగినచప్పుడు వారి ప్రశాంతతను భగ్నంచేసింది హడావిడిగా ప్రవేశించాడు మదన్ మోహను అరుణాదేవి ఇక్కడ వున్నారా అమ్మయ్యా! మీ ఇంటికి వెళ్ళాను మీరు సంఘానికి వెళ్ళారని అక్కడ చెప్పతేను మళ్ళా ఇక్కడికి వచ్చాను ఆఁ మీరు పాడండి శచి

ఆపక్కన్లేదు" అంటూ జేబుగుడ్డతో ముఖం తుడుచుకొని కృష్ణచూపిన కుర్చీలో కూర్చున్నాడు.

అరుణ మనస్సును కూడదీసుకొని "అవును కృష్ణగారి చిత్రాలు మరొక్కసారి చూడాలని బుద్ధిపుట్టి వచ్చానుగాని తలవని తలంపుగా శచిప్రభ సంగీతంగూడా వినే అవకాశం గలిగింది. నిజం చెప్పాలంటే మదన మోహన్‌గారూ రత్నాలలాంటి కళాకారులను సంపాదించారండీ"

తన మనుష్యులను అరుణ మెచ్చుకుంటున్నందుకు తన ఆనందాన్ని పైకి రానీయకుండా అణచుకుంటూ మదనబాబు "ఏమిలాభం చెప్పండీ! ఇంత మేధావంతులున్న మా సంఘం ఎందుకో వెనకబడే వున్నది! ఇప్పుడు చూడండి, వార్షికోత్సవాలు ఈ నెలలోనే ఉగాదిపండుగకు ఏర్పాటు చేశాము. ఎట్లాజరుగుతుందో ఏమో. మంత్రిగారుగూడావస్తున్నారు. అందుకని అరుణాదేవిగారూ, ఈ సంఘాన్ని మీ చేతుల్లో పెడతాను, మీరు దీన్ని సరిగా నడిపించగలరు". మధ్యలోనే అందుకుంది అరుణ "ఇంతత్వరలోనే కొత్తవాళ్ళను నమ్మితేఎట్లాచెప్పండి" "కొత్తవాళ్ళు కాదు మీరు అరుణాదేవిగారూ! మీ మీద కొన్ని ఆశలు పెంచుకున్నాను గూడాను" కొత్తవాళ్ళు వున్నారని గూడా మరిచిపోయాడు మదనబాబు "అంతేగాదు నా గుండెల్లో అట్టడుగున వున్న ఒక బాధ, స్వాతంత్ర పోరాటంలో నాకు వారసత్వం లేదనేబాధ ఇట్లా తుడిచి వెయ్యాలను కున్నాను". "వుండనియ్యండి ఆ విషయాలు. నాకుఅర్థం అవుతూనే వున్నాయిగదా" ధోరణిని తప్పించింది అరుణ "రెండువిషయాలు చెప్పుదా మనుకుంటున్నాను. అవి మీకిష్టం అయితే మీతోకలిసి పనిచెయ్యడానికి నాకు అభ్యంతరం వుండదు"

"చెప్పండి,చెప్పండి, రెండేఎందుకు ఎన్నివిషయాలుచెప్పినా వింటాము"

అరుణకు మదనబాబు తొందరచూచి ఆశ్చర్యం అయింది. తన్నుతాను సంపూర్ణంగా తనకుసమర్పించుకున్నాడన్నమాట. అరుణ కళ్ళు ఆర్ద్రాలైనాయి. గొంతు బొంగురుబోయింది క్షణంఆగి తనేఅందుకుంది.

"ఒక్కసంగతి మదనబాబూ! ఈ రోజుల్లో ఏ సంఘముకాని జాతీయ భావాలులేకపోతే వృద్ధిలోకిరాదు. ఈ సంఘానికి జాతీయ కళాకేంద్రం అని పేరు పెట్టుకుందాం. మన చిత్రకళ, సంగీతము, నృత్యమూ, కవిత్వమూ ఈ కళలన్నిటిద్వారా ప్రజల్లోజాతీయ భావాలను ప్రజ్వలింపజేసి కళ కళ కోసం గాదనీ, దేశం కోసమనీ నిరూపించుకుందాము"

కృష్ణభూషణ్ అందుకొని "మన కేంద్రంలో వుండే ఆడంబర మంతా తీసివేసి ప్రజల నిత్యజీవనానికిదగ్గిరగా తీసుకువద్దాము. కళల్లో వుండే మహత్తరమైన ప్రయోజనాన్ని దేశక్షేమానికి వినియోగించుకుందాము, సరేనా" అన్నాడు.

మదన్‌బాబుకు ఈ భావాలు అర్థం కాలేదు. అయినా వొప్పుకోకతప్పదు. "మీ యిష్టం! మీరు ఎట్లా నడిపినా అభ్యంతరంలేదు, ఆ రెండో విషయం గూడా చెప్పండి.''

ఈసారి అరుణగొంతు మరింత బొంగురు పోయింది "ప్రస్తుతానికి నేను కొంతకాలం మాత్రం సెలవుపెట్టి మీ దగ్గరికి వస్తాను. ఈ కేంద్రాన్ని పైకి తేవడమే లక్ష్యంగా పెట్టుకొని మనం కలిసి పని చేద్దాం, కలిసి జీవిద్దాం" కృష్ణవైపు చూస్తూ "ఇందులో ఎవరికీ ఎక్కువ తక్కువ హోదాలుగాని ఈర్ష్యా అసూయలు గాని లేని ప్రశాంత వాతావరణంలో మనంకలిసి పనిచేద్దాము. కొంత కాలం వరకు ప్రేమ, పెళ్ళి ఈ మాటలు కట్టిబెట్టుదాము"

మదన్‌బాబు అర్థంకాని ధోరణిలో, కృష్ణవైపు చూచాడు. కృష్ణభూషణ్ గంభీరంగా "అవును మన కందరికీ ఈనాటి పరిస్థితుల్లో దేశంమీద ప్రత్యేక బాధ్యతలున్నాయిగదా !'' అరుణకు సంతోషం కల్గింది. అతను తనభావాన్ని అందుకున్నాడన్న మాట. "తరువాత పరిస్థితుల ననుసరించి మన జీవితాలు ఏ మలుపు తిరుగుతాయో గమనించుదాము."

కృష్ణ దీర్ఘవిశ్వాసం విడిచాడు శచి సంతృప్తిబడ్డది. గడువుదొరికితె కృష్ణమనసు తనవైపు మళ్ళించుకో కలదు.

"అరుణాదేవి తన కుటుంబాన్ని తెచ్చుకొని ఇక్కడనే వుండిపోతారు మదన్‌బాబు ఆనందంతో ముగించాడు

"ఏదమ్మా శచీ నీ శంకరాభరణం కట్టిపెట్టి ఒక్క దేశభక్తిగీతం పాడుదూ" అన్నాడు.



# డుంబుకి సన్మానం

రచన బొమ్మలు

బుజ్జాయి
















వద్దురా నేనుండను మంత్రిగా నా కిష్టంలేదు!
మొదట అందరూ అలాగే అంటారు
తప్పదు నువ్వే ఉండాలి!


సరే ఏర్పాట్లు చేయండి! రేపు సాయంకాలం జరిగిపోవాలి!


మర్నాడు సాయంకాలం —
ఢాం ఢాం ఢే!
ఢుంయ్ ఢుంయ్!


ఢుంఢుంకి జై!
ఢుంఢు జిందాబాద్!
జై!


హారతి ఇవ్వనీయండి!


రండి! ఇలా రండి!
అదుగో మంత్రిగారు కూడా వచ్చారు


సోదర సోదరులారా! మీరు నాకు సన్మానం చెయ్యడం నాకిష్టంలేదు,
నువ్వే కాదురా చెయ్యమన్నావ్!


నేను దేనికి తగను!
అవును తగవు!
లేకపోతే నీకు సన్మానం ఏంటిరా!


ఏమిట్రా! ఇది ఈ గొడవంతా ఎవడ్రా నా శాలువ తీసింది?


అబ్బే ఏంలేదు! డుంబుగారికి సన్మానం చేస్తున్నాం!
పడిశారు! నడవండి జైలుకి! అంటాం!




ఏంటిరా డుంబూ! సన్మాన సభ ఎలా జరిగిందంటావ్!
బాగానే జరిగింది, కానీ చివర్న మాత్రం కొంచెం గొడవ ..




శ్రీమతి శర్మాజీ

చల్లటి సముద్రపుగాలి నీరజ మొహాన్ని మృదువుగా తాకుతోంది. గాలికి నుదుటిమీదకు పడుతున్న ముంగురులను వెనకకుతోస్తూ మురళి మాటకు జవాబివ్వ లేదామె.

ఇసుకలో చతికిలబడ్డ మురళి తన ప్రశ్నకు జవాబు రాకపోయేసరికి తలెత్తి నీరట మొహంవేపు చూశాడు. ఆశ్చర్యంతో నోటమాట రాలేదతనికి. ఇన్నేళ్ల పరిచయంలో ఎన్నడూ అలాటి ముఖభావాన్ని చూసి ఎరుగడు.

"ఏమిటి నీరజా'' అంటూ ముందుకు జరిగాడు.

ఆమె అందమైన మొహాన్ని నల్లటి నీడలు క్రమ్ముకున్నట్టున్నాయి. కళ్ళలో విచారం చోటుచేసుకుంది. పళ్ళతో నొక్కి-పెట్టబడిన క్రింది పెదవి ఆమె పట్టుదలను

సూచిస్తోంది. ఆక్కడ మరెవరూ లేనట్టు తన ఆలోచనా సముద్రంలో మునిగిపోయి మురళి మాటలను వినిపించుకోనేలేదు నీరజ.

ఆమె చేతులను తన చేతుల్లోకి తీసుకుని ఆప్యాయంగా "నీరజా" అన్నాడు. ఉలిక్కిపడి అప్పుడే



అతని వేపు చూస్తున్నట్టు చూసింది నీరజ.

"అలా ఉన్నావేం?"

"నేనా? ఏమీలేదే."

"మరి పలకరిస్తూంటే జవాబు చెప్పక అలా కూర్చుండి పోయావేం?"

"ఓ అదా? ఏంలేదు. నువ్వు అడిగిన ప్రశ్నకు ఏం చెప్పాలో తోచక ఆలోచనలో పడ్డాను."

మురళి చిన్నగా నవ్వాడు.

"అదంత కష్టమైన పనికాదే!"

"కాదనే అనుకున్నా నింతవరకూ. కాని......"

"కాని...... ?"

"నన్ను ఆలోచించుకోనీ మురళీ."

"ఓయస్. శుభ్రంగా ఆలోచించు కోవచ్చు. అభ్యంతరమేమీలేదు."

చిలిపిగా నవ్వాడతడు. ఆ నవ్వులోని స్వచ్ఛత నీరజను కలవరపెట్టింది.

"అదికాదు. ఇంతవరకూ నీ సంగతు లేమీ చెప్పలేదు నువ్వు. నేనూ అడగ లేదనుకో. అదే ఇప్పుడు నాకు పెద్ద సమస్య అయింది. ఎటూ నిర్ధరించుకోలే కుండా ఉన్నాను. వేళాకోళంకాదు. నిజం గానే నేను ఆలోచించుకోవాలి మురళీ."

"నేను నా సంగతు లెప్పుడూ నీ దగ్గర దాచిపెట్టలేదుగా? ఇప్పుడు కొత్తగా ఏం వచ్చిపడింది నీరజా ?"

నీరజ జాలిగా అతనివైపు చూసి లేచి నిలబడింది.

"ఇక వెడదాం. రేపు మళ్ళీ కలుసు కుందాం."

"ఉహుఁ. అసలు విషయమేమిటో చెప్పేవరకూ లేవను." అన్నాడు మురళి మొహం అటువైపుకు తిప్పుకుంటూ.

"అదే వద్దన్నది. అంతలో అలా బెంబేలు పడిపోతావేం? ఈ రోజు నేనేమీ చెప్ప లేను. రేపు ఏదో ఒకటి తేల్చి చెప్పేస్తాగా."

మురళి మొహం నల్లబడింది. నీరజ అప్పుడే తన్నువదలి వెళ్ళిపోతున్నట్టని పించింది. ఎందుకు ఇలా మాట్లాడు తోంది ? అసలేం జరిగింది ? తనేమి అప చారం చేశాడు. ఉహుఁ. నీరజ లేందే తను బ్రతకలేడు.

"నన్ను వదలి వెళ్ళిపోకు నీరజా" అంటూ తన చేతుల్లో మొహం దాచు కున్నాడు.

నీరజ అతనిదగ్గరకు వచ్చి అతడి చెయ్యి పట్టుకుని మెల్లిగా లేవదీసింది. పసికుఱ్ఱాడికిమల్లె ఆమె వెంట బయల్దే రాడు మురళి. త్రోవలో మళ్ళీ ఏమీ మాట్లాడుకోలేదు.

*　　*　　*

మురళి యూనివర్సిటీ కాలేజీలో చేరిన మొదటిరోజుల్లో బెరుగ్గా ఉండేవాడు. ఎవరితోనైనా మాట్లాడటానికికూడా భయపడేవాడు. ఆడపిల్లలవైపు కళ్లెత్తి చూసేవాడేకాదు. తన చదువేమోతనేమో అంతే. తెలివైన కుఱ్రాడవటంచేత మంచి మార్కులు తెచ్చుకునేవాడు. ఒక సంవత్సరమంతా అలాగే గడిచి పోయింది. అప్పటికి కాస్త సర్దుకున్నాడు.

అంతర్ కళాశాలల చర్చలపోటీలో ప్రథమబహుమతిని గెల్చుకొన్నాడని, తెలివైన కుఱ్రాడని తోటి విద్యార్థులకు గౌరవం, లెక్చరర్లకు అభిమానం.చర్చల పోటీలో గెలుపొందినపుడు ఆడపిల్లలలో నుండి ముందుకువచ్చి అభినందించింది నీరజ.

"థేంక్స్" అన్నాడు మురళి. తరువాత సహాధ్యాయులంతా అతడిని చుట్టు ముట్టేశారు. ప్రైజు కొట్టినందుకు కాదు గాని, నీరజ అభినందనలు అందుకొన్నందుకు ఆకాశాని కెత్తేశారతన్ని. ఎందుకో అర్థంకాలేదు మురళికి.

"అదేమిట్రా, కాలేజిబ్యూటీ కదూ ఆ అమ్మాయి! అసలెవర్నైనా కన్నెత్తి చూస్తుందా, మాట్లాడించడం సంగతటుంచి"

"మొన్ననేం జరిగిందో తెలుసానీకు? ఆ షోకిల్లా రామారావు లేడూ, వాడు అద్భుతంగా తిన్నాడు."

"ఏమిటి?"

"అదే లెంపకాయ......మరి మూడ్రోజులు ఎవరికీ మొహం చూపలేదు. అందుకే ఆ అమ్మాయంటే హడల్ అందరికీ"

ఇలా చెప్పుకొస్తుంటే మొదటిసారిగా విన్నాడు మురళి. అతనికిదంతా వింతగా ఉంది. కాని ఏమీమాట్లాడలేదు.

మళ్ళీ ఇంకోరోజు నీరజ పనిగట్టుకుని తన్ను పలకరించేసరికి ఆశ్చర్యపోయాడు. స్నేహితుల మాటలు గుర్తుకొచ్చి పరీక్షగా చూశాడు నీరజని. వాళ్ళ మాటల్లో అతిశయోక్తి ఏమీలేదు. నీరజ నిజంగానే సాటిలేని రూపసి. తనను పరీక్షగా చూస్తున్న మురళినిచూసి చిరునవ్వునవ్వి. "ఫిలాసఫి నాకు అగమ్యగోచరంగాఉంది. కొంచెం సహాయం చేయగలరా?" అని అడిగింది. అదే వాళ్ళ పరిచయానికి నాంది.

మురళి అందంలో సౌకుమార్యం ఉంది. ఠీవి ఉంది. అవి రెండూకలిసి అతనికి వింత అందాన్నిచ్చాయి. నల్లని ఉంగరాల జుట్టు, మెరిసేకళ్ళు, నిండైన విగ్రహం, చూసిన వాళ్ళనిట్టే ఆకర్షించే రూపం అతనిది.

ముఖ్యంగా అతనిలోని ఠీవి ఆకర్షించింది నీరజను. రానురాను వాళ్ళిద్దరి మధ్య పరిచయం ప్రేమగా రూపొందింది. మురళి అప్పుడప్పుడూ నీరజ ఇంటికి వచ్చేవాడు. నీరజ తండ్రికికూడా మురళి నచ్చాడు. జీవితం విషయంలో నీరజ వివేకంతో ప్రవర్తిస్తుందనే నమ్మకం ఉండడంచేతనే వాళ్ళిద్దరూ చనువుగా తిరగటాన్ని ఆయనెప్పుడూ అభ్యంతర పెట్టలేదు. నీరజ ఇష్టపడితే సరి అనుకున్నారాయన.

నీరజ అందం అసమానమైనది. అంతేకాదు. తాను అందగత్తెననే భావం ఆమెలో ఎప్పుడూ మేలుకొనే ఉంటుంది. ఠీవిగా నడిచేటప్పుడు, కన్నెత్తి పలకరించేటపుడు ఆ భావం ఎత్తి కనబడుతూ ఉండేది. కాలేజి కుర్రకారంతా తన అందానికి జోహార్లర్పిస్తూ, తనప్రేమ కోసం తన ఒక్క మందహాసంకోసం పడిగాపులు పడి వున్నారనే గర్వంతో, వాళ్ళను తిరస్కారంతో చూసేది. అలాంటి నీరజను మురళిలోని వింత

అందం ఆకర్షించింది. అతనిలోని సహృదయతా, మృదుత్వం మరింత దగ్గరచేసింది.

ఏకాంతంలో అతను మరీ అమాయకంగా, పసిపిల్లాడిలా ప్రవర్తించేవాడు. స్వచ్ఛమైన హృదయంతో తన ఆరాధనను వ్యక్తపరిచేవాడు. దాంతో నీరజ హృదయం ద్రవించిపోయేది. తను లేకపోతే జీవితమే లేదనుకొనే అతన్ని ప్రేమావేశంలో హృదయానికి హత్తుకునేది. పైకి గంభీరంగా ఉండేమురళి ఈ విషయంలో మటుకు పిరికివాడు, అమాయకుడు, అని నీరజకు స్పష్టంగా తెలుసు. అందుకే అతన్ని దూరంచేసుకోవాలంటే నీరజ సులభంగానిర్ధరించుకోలేకపోయింది.

మురళి ఎప్పుడూ ఖరీదైన దుస్తులే ధరించేవాడు. దేనికైనా డబ్బుఖర్చుపెట్టడానికి ఎప్పుడూ వెనుకాడేవాడు కాదు. నీరజ పుట్టినరోజు పార్టీలకు కూడా తను అనుకోనంత విలువ కలిగిన వస్తువులను ప్రెజెంట్ చేసేవాడు. శలవుల్లో తను ఊరికి వెళ్ళేటప్పుడు నీరజను తనతో రమ్మనేవాడు. ఎందుకులే అని నీరజ ఎప్పుడూ వెళ్ళలేదు. "వెళ్ళిఉంటే బాగుండేది" అనిఇప్పుడను కుంటోంది.

కావాలన్నప్పుడల్లా డబ్బు తెప్పించుకుంటూ, లక్ష్యంలేకుండా ఖర్చుపెట్టే మురళి ఓ లక్షాధికారి కొడుకై ఉంటాడనుకుంది తను. కాని లోకువైపోతుం దేమోనని ఆ వివరమేమీ అడగలేదు. తను చేసిన పొరపాటే అది. తమిద్దరి మధ్యా ఇంత అనుబంధం పెంపొందిన తరువాత తెంచుకోవటం ఎలా ? మురళి ఏమయిపోతాడో అన్నబెంగ ఆమెను తలక్రిందులు చేస్తోంది.

పరీక్షల గొడవ వదలిపోయి మనసు తేలిగ్గాఉంది. క్లాసు వస్తుందనే నమ్మకం ఉంది ఇద్దరికీనూ. చల్లటి గాలి పీలుస్తూ సముద్రపుటొడ్డున కూర్చున్న మురళి నీరజతోతమపెళ్ళి ఎప్పుడు ఎలాజరగాలో వివరిస్తూ అన్ని సంగతులూ చెపుతున్నాడు. తమఊరిలో వాళ్ళకేమీ పెద్దగా ఆస్తిలేదు. భూములన్నీ ఒకటొకటిగాఅమ్మి కొడుకును చదివించాడు తండ్రి. డబ్బు కావాలని అడిగినప్పుడల్లా కాదనకుండా పంపించారు. పట్నవాసంలో తోటికుర్రాళ్ళముందు తమకొడుకు ఏమీ తక్కువగా ఉండకూడదనే వాళ్ళ తాపత్రయం. ఇలా భూములన్నీ హరించుకుపోగా ఏకొంతభాగమో మిగిలి ఉంది. అదికాక పూర్వులు కట్టించిన పెద్ద భవంతిఒకటి ఉంది. తను ఉద్యోగం చూచుకుని తలి దండ్రులను పిలిపించుకోవాలి, తనకోసం బెంగ పెట్టుకున్న వాళ్ళను ఆదరించాలి. ఈ విషయంలో నీరజ సహకారం తనకెప్పుడూఉంటుంది. ఇలా చెప్పుకుపోతున్న మురళి మాటలు విని కొయ్యబారిపోయింది నీరజ.

మురళి ఇంకా పైకి చదువుతాడు.



పెద్ద ఉద్యోగం చేస్తాడు. కావలసినంత ఆస్తి, కార్లలో తిరగొచ్చు. నౌకర్లు, చాకర్లతో నిండినబంగళా, తన సౌంద ర్యాన్ని వెదజల్లుతూ రాణిలా జీవితమంతా గడపవచ్చుననుకున్న నీరజ కలలు చెరిగిపోయాయి. ఏదో ఉద్యోగంచేస్తూ అలసివచ్చే భర్తకు వండిపెడుతూ, అత్తమామల సేవచేస్తూ వంటలక్కగా పడి ఉంటుందా తను? అయితే ఈ అందమంతా ఎందుకు? వంటింట్లో మాడి మసిబొగ్గయిపోయేందుకా?

ఊహుఁ... తన అందానికో అర్ధ ముండాలి, పోషణ ఉండాలి. మురళిని చేసుకుంటే అంతా మర్చిపోవాల్సిందే. ఇక లాభంలేదు. ఈ బంధాన్నుండి బయటపడాలి అనుకుంది నీరజ ఆ రాత్రి తన పక్కమీద పడుకుని ఆలోచిస్తూనే.

కాని, మురళితో ఈ విషయం చెప్పడ మెలా? సందేహాస్పదంగా మాట్లాడి నందుకే మనిషి డీలాపడిపోయాడే? అదేదిగులు పట్టుకుంది నీరజకు. కాని చెప్పక తప్పదు. విడిపోవాల్సిందే అను కున్నప్పు డామె హృదయం చిన్నగా మూలిగింది. ఛ...నోరుమూసుకో, నేను జీవితం విషయంలో ఇంతపెద్దనిర్ణయం తీసుకొంటూంటే మూలుగుతావేం! అని ఆ మూలుగును అణిచేసింది. ఆమెది వివేకంకల బుద్ధి.

* * *

విషయమేమో తెలియక కలవరంతో రోజంతా వేచిఉన్న మురళి మరునాడు కనిపించిన నీరజను చూచి నివ్వెర

పోయాడు. ఈమె తన నీరజకాదు. ఇలాంటి ముఖభావాన్ని తను ఎన్నడూ చూసి ఎరుగడు. ఆఖరికి తనను వంచించ టానికి నిర్ణయించుకుందా ఏం? మురళి హృదయం అల్లకల్లోలమయింది.

నిశ్శబ్దంగా కూర్చున్న నీరజని మురళి పలకరించలేదు. అపరిచితుల్లా మౌనంగా కూర్చున్నారిద్దరూ. ఆ మౌనం ఇద్దరికీ అసహనీయంగానే ఉంది. ఆఖరికి నీరజే నోరువిప్పింది.

''నన్ను క్షమించు మురళీ.''

"ఆహాఁ, అవశ్యంగా'' అనబోయిన మురళి మొహం పక్కకు తిప్పుకుని కూర్చున్నాడు.

"నాదే తప్పు, ముందే అన్నీ అడిగి తెలుసుకోవాల్సింది. నిన్ను ప్రేమించాను నిజమే. కాని నా ఆశలన్నీ మరిచి నిన్ను పెళ్ళిచేసుకునేంత త్యాగం నాలో లేదు."

మురళి ఆశ్చర్యంతో తనవైపు తిరిగాడు.

"నాకేం అర్ధంకావటం లేదు. ఆశ లేమిటి? త్యాగ మేమిటి? ఎప్పుడూ ఇలా మాట్లాడలేదే నువ్వు?''

నీరజ చెపుతూంటే మౌనంగా విన్నాడు మురళి, ఆఖరికి నెమ్మదిగా.

''నీరజా, నీ కోరికలన్నీ సహజమే. కాదనను. కాని అన్నిటినీ మించి నిన్ను ప్రాణప్రదంగా ప్రేమించే పురుషుడు కావాలంటావా?"

"అది ఉండనే ఉంటుందిగా. నన్ను కోరి చేపట్టేవాడినేకదా చేసుకుంటాను''

మురళి చిన్నగా నవ్వాడు.

"నువ్వింత చపలచిత్తురాలి వనుకో లేదు. నన్నెంత సులభంగా త్యజించావు! అక్కడికి ఐశ్వర్యంమీద నీకెంత మోజు ఉందో అర్ధంచేసుకోగలను. కాని అంత ఐశ్వర్యం లేక పోయినా నీకే లోటూ రానివ్వనన్న విషయం నీకు తెలియదా? నాకున్న కొద్దిసంపదలోనే నిన్ను పువ్వులలో పెట్టి పూజించే వాడిని. ఇంత తేలిగ్గా నిర్ధరించుకున్నావే! ఇన్ని రోజులూ నా మీద నువ్వుచూపిన ప్రేమంతా కపట మేనా? అందులో సత్యంలేనేలేదా?" ధీరంగా పలుకుతున్నా ఆఖరిలో మురళి కంఠం వణికింది.

''లేదు. అందులో కపటమేమీలేదు." కాని ప్రయత్నిస్తే మరిచిపోగలను"

''నిజమే. నువ్వు కఠినాత్మురాలివి. సులభంగా మరవగలవు. నేనే...మరిచి పోలేనేమో. నువ్వులేని జీవితం...ఛ. అసహ్యంవేస్తోంది. నేను దురదృష్ట వంతుణ్ణి. నీలాంటి అపాత్రలో నాప్రేమ ప్రవహించింది." మసక చీకటిలో అతని కళ్ళనుండి ప్రవహిస్తున్న కన్నీరు నీరజకు కనిపించలేదు.

తనకాళ్ళు పట్టుకుని 'లేదు నీరజా, నువ్వు లేకపోతే నేను జీవించలేను' అంటే ఏవిధంగా తన అసమ్మతిని తెలియజేయాలా అనుకుంటున్న నీరజకు ఈ పరిస్థితి ఏమంత కష్టమనిపించలేదు.

దూషిస్తే దూషించనీ. ఆఖరి ఘట్టం పూర్తయితేచాలు అనుకుంది.

మళ్ళీ మౌనం రాజ్యంచేయసాగింది. అలాగే అరగంట గడిచింది.

మురళి లేచి నిల్చున్నాడు.

''చీకటిపడింది. వెడదాంపద'' అన్న అతని కంఠంలో స్థిరత్వం ధ్వనించింది. నిశ్శబ్దంగా ఇంటివైపు నడిచారిద్దరూ.

విడిపోయేముందు,

"జీవితంలో నిన్ను ఎప్పటికీ మరిచి పోలేను. అది నా దుర్బలత. కానీ భావి జీవితంలో నీ కోరికలుతీరి శుభం కలగాలనే ఆశీర్వదిస్తున్నాను.''

అనే మురళి కంఠంలోని ప్రశాంతత నీరజను ఆశ్చర్యపరిచింది.

* * *

కాలచక్రంలో ఆరేళ్ళు కలిసిపోయాయి.

తన కెదురుగా వస్తున్న వ్యక్తుల్ని చూసి కారాపింది నీరజ.

"మురళీ"

చటుక్కున తలెత్తిచూశాడు మురళి. అతని ప్రక్కనున్న యువతి ఆశ్చర్యంగా కారువైపే చూస్తోంది. అందమైన ఆమె కళ్ళలో కుతూహలం చోటుచేసుకుంది. నీరజ ఒక్క నిమిషం ఆ అమ్మాయిని పరీక్షగా చూసి దిగివచ్చింది.

"ఈ ఊరెప్పుడొచ్చావ్ మురళీ? ఏం చేస్తున్నావు?''

"నాలుగేళ్ళగా ఈ ఊళ్ళోనే ఉంటున్నానే! ఇంకా నువ్వెప్పుడొచ్చావని అడుగుదామనుకుంటున్నా: కులాసాగా ఉన్నావుకదా? ఇంతకూ మీ ఇల్లెక్కడ?"

మురళికంఠంలో ఆప్యాయత ఉట్టిపడుతోంది.

''ఈమె నా భార్య రుక్మిణి. నీరజ-నా క్లాస్‌మేటు'' అంటూ ఒకరి నొకరికి పరిచయంచేశాడు.

రుక్మిణి చేతులు జోడించింది.

నీరజ నవ్వుతూ "మా యింటికి రాకూడదూ వెడదాం.'' అంది.

మురళి "ఉహుఁ. ఇపుడు కాదు. టైమయిపోయింది. ఇంకోసారి వస్తానులే.'' అన్నాడు.

"అలా అని తప్పించుకోకేం? తప్పక రావాలి మరి'' అంటూ నవ్విన నీరజ మొహంలో లీలగా మెరిసి మాయమయి పోయిన విషాదరేఖను గమనించిన మురళి చకితుడయ్యాడు.

"సరే, కారెక్కండి. మీ ఇంటిదగ్గర దిగబెడతాను.''

"వద్దు నీరజా. నువ్వటు వెడుతున్నావు. మేమిటువైపు వెడుతున్నాము.''

"ఈ మాత్రానికే! ముందు కారెక్కు అంటూ తలుపుతీసింది నీరజ.

కొంచెం సేపట్లోనే మురళిఇంటి ముందుదాగింది కారు.

"లోపలికిరండి" అంటూ ఆహ్వానించింది రుక్మిణి. వద్దనుకున్నా కుతూ

హలం ఆగక కారుదిగి ఇంట్లోకి వెళ్ళింది నీరజ.

అంత పెద్దదేమీ కాకపోయినా ఇల్లు చక్కగా అలంకరింపబడి ఉంది. ముందు గదిలో నాలుగు కుర్చీలు, మధ్యలో టీపాయి; ఒక మూలలో చిన్న రేడియో. టేబుల్ క్లాత్‌పైనా, రేడియోకవరుపైనా చక్కటి అల్లికపనిచేసి ఉంది. ఆ గది లోని ప్రతివస్తువులోనూ రుక్మిణి కని పిస్తూనే ఉంది.

రుక్మిణి ఎంతో అప్యాయంగా నీరజను పలకరించింది. ఆ మాటల్లోని ఆప్యాయత చల్లనిగాలి సోకినట్లనిపించింది నీరజకు. ఆమె మురళివైపు చూచినప్పుడల్లా నీరజ గమనిస్తూనే ఉంది. వారిద్దరూ కళ్ళతోనే మాట్లాడుతున్నట్టుంది. ఆమె కళ్ళలో ఆరాధనా, తృప్తి తాండవమాడు తున్నాయి. ఆమె అతన్ని పూజిస్తోంది. సందేహంలేదు అనుకుంది. అక్కడ నుండి వెళ్ళేటప్పటికి ఆమె మనస్సు సంతోషంతోనూ, వ్యాకులంతోనూ నిండి పోయింది. కారుదాకా వచ్చిన మురళితో "రేపుమా ఇంటికి తప్పకరావాలి, నీతో చాలా మాట్లాడాలి'' అంది. ఆ మాటలు ఏవో గుసగుసలు చెప్పినట్టుంది.

* * *

ప్రభాకరాన్ని నీరజ ఇష్టపడే చేసు కుంది. ప్రభాకరానిది మంచి పర్సనాలిటీ. చూపరులను ఇట్టె ఆకర్షించగలరూపం. వెనకాముందూ ఎవరూలేని పెద్ద ఆస్తికి వారసుడు. దానికితోడు పెద్ద ఉద్యోగం. అతడూ నీరజను చూసి ఇష్టపడ్డాడు. పెళ్ళి జరిగిపోయింది.

పెళ్ళయి అత్తవారిఇంటిలో అడుగు పెట్టిన కొత్తలో అంతా హడావిడిగా, సందడిగా ఉండేది. ఇంటికివచ్చే బంధు మిత్రులకు అంతు ఉండేదికాదు. ఆ గొడ వల్లో మురళి జ్ఞాపకమే రాలేదు నీరజకు. కొద్దిరోజుల్లో ఆ సందడంతా తగ్గిపోయి ఇంటికి ఇద్దరే మిగిలారు. ఎన్నో ఏళ్ళుగా ప్రభాకరాన్ని కనిపెట్టుకుని ఉన్న వంటావిడమాత్రం ఉంది.

ప్రభాకరం నీరజకోసం ప్రత్యేకంగా ఓ కారు కొన్నాడు,

''ఎందుకూ, ఉన్నకారు చాలదా''అని నీరజ వాదించింది,

"నేను అప్పుడప్పుడూ క్యాంపులకు వెళ్ళవలసి ఉంటుంది. నీకు ఏమీ తోచక పోతే అలా తిరిగి రావచ్చుకదా" అన్నాడు.

నెలలు గడిచినా ప్రభాకరాన్ని అర్థం చేసుకోలేకపోయింది నీరజ. అతడికి తన మీద ప్రేమ ఉందో లేదోకూడా అర్థం చేసుకోలేకపోయింది. ఆఫీసు, క్లబ్బు స్నేహితులు ఇవే అతని ప్రపంచం. ఉదయం ఆఫీసుకు వెడితే సాయంకాలం ఇంటికి వచ్చేవాడు. స్నానంచేసి డ్రస్సు చేసుకుని క్లబ్బుకు బయల్దేరితే మళ్ళీ రాత్రి పదిగంటలకే ఇంటికి రావటం.



"మీ భార్య పుట్టినరోజు జ్ఞాపకంచేస్తే ఈపని జరిగిందంటారు."

నీరజ భోజనంచెయ్యకుండా కనిపెట్టుకుని కూర్చునేది.

"నాన్సెన్స్, నువ్వెందుకు అలా కాచుక్కూర్చోవటం ? భోంచేసేయరాదూ ? నాకు భోజనానికి వేళాపాళా ఉండదు.'' అనేవాడు ప్రభాకరం.

ఆదివారాలుకూడా ఇంటిపట్టున ఉండేవాడు కాదు. ఉన్నా స్నేహితుల్ని ఆహ్వానించేవాడు వాళ్ళంతా భార్యలతో వచ్చినా పరిచయంతప్ప ఎవరితోనూ హృదయపూర్వకమైన స్నేహం కలుగలేదు. అందరితో కలసి సరదాగా కాఫీ ఫలహారాలు సేవించినా అందులో ఏదో లోటు కనిపించేది నీరజకు. వాళ్ళంతా నీరజ అందాన్ని, ఆదరాన్ని తెగపొగిడేవారు. దాంతో నీరజ హృదయం వికసించడానికి బదులు మరింత ముడుచుకొనిపోయేది. "హల్లో" అంటే "హల్లో" అనుకునే ఈ పరిచయాలు, వాళ్ళమాటలూ కృత్రిమమనిపించి అసహ్యం పుట్టేది.

రానురాను నీరజ అసంతృప్తిని గమనించిన ప్రభాకరం స్నేహితుల్ని ఇంటికి ఆహ్వానించడం మానుకున్నాడు. నీరజ హాయిగా ఊపిరి పీల్చుకుంది. కాని ప్రభాకరంకూడా లేని ఇంట్లో ఏమీ తోచేదికాదు. ఎంతసేపు పుస్తకాలు చదవటం, ఎంతసేపు రేడియో వినటం? ఈ ఒంటరితనం విసుగుపుట్టించేది. ప్రభాకరం నెలకు పదిహేనురోజులు క్యాంపులోనే గడిపేవాడు. అతడు

క్యాంపులో ఉన్నన్ని రోజులూ ఒంటరితనంతో పిచ్చెక్కుతుందేమోననిపించేది నీరజకు. కాని ప్రయాణపు బడలికతో అలసివచ్చిన భర్తను చూడగానే అన్నీ మర్చిపోయేది.

కాని ఎక్కడో భర్త తనను చూడవలసినట్టుగా చూడటంలేదనే భావం మెదిలేది. కాని అభిమానంతో ఆ భావాన్ని తుడిచివేయ ప్రయత్నించేది నీరజ.

ఇలా సంవత్సరం గడిచిపోయింది. ఒకరోజు ఏమీతోచక దగ్గరే ఉన్న గుడికి వెళ్ళింది. అక్కడ అనుకోకుండా పాతస్నేహితురాలు లలిత కనిపించేసరికి నీరజ ఆనందానికి పట్టపగ్గాలేకుండా పోయాయి. బలవంతాన తమఇంటికి లాక్కునివచ్చింది. ఎన్నో విషయాలు మాట్లాడుకున్నారు. ఇల్లంతా చూపించింది నీరజ. మేడమీద తమ గదిలోకి కూడా తీసుకొని వెళ్ళింది. టేబుల్ మీద ఉన్న పెళ్ళిఫోటోచూసి గతుక్కుమంది లలిత.

"మావారు" అంటూ నవ్విన నీరజ లలితమొహంచూసి ఆశ్చర్యపోయింది.

"నువ్వెరుగుదువా మా వారిని ?"

"అహా ! అయినా ఈ ఊళ్ళో మీ వారిని ఎరుగని వారెవరులే !''

"అంటే ?"

"పెద్దఉద్యోగంకదూ. ఎక్కడో చూసే ఉంటాం.''

మాటలకోసం వెతుక్కుంది లలిత.

నీరజకు ఆ సమాధానం తృప్తికరంగాలేదు. లలిత ఏదో దాస్తోందని మాత్రం అర్థమయింది మరి ప్రశ్నించక ఊరుకుంది.

మళ్ళీ వాళ్ళ మాటల్లో మొదటి ఉత్సాహం లేకపోయింది లలిత ఏదో ముళ్ళమీదున్నట్టు తొందరగా అక్కడనుండి బయటపడింది

ఈ మారు భర్త క్యాంపునుండి రాగానే సూక్ష్మంగా పరిశీలించసాగింది నీరజ కాని ఏమీ తెలుసుకోలేక పోయింది అవ్యక్తవేదన హృదయంలో చోటు చేసుకుంది.

తను ఏమిపొందలేక పోయిందో నీరజకు అర్థంకాలేదు. అందరి దాంపత్యాలలా లేదా తమది ! ప్రభాకరం తనను ప్రేమగానే చూస్తాడు. పనిచేస్తే కంది పోతానేమోనని వంటమనిషిని, నౌకర్లను ఏర్పాటు చేశాడు. తను కోరుకున్నదే తడవుగా చీరలు, నగలు కళ్ళముందుంటాయి. కాని ఎందుకో అవన్నీ ధరించాలన్న ఉత్సాహమే ఉండదు. మడత విప్పని చీరలెన్నో అలాగే పడిఉన్నాయి. తనలోని ఈ నిరాసక్తికి మూలమేమిటి ? ఎక్కడుంది అది ? శూన్యంలో వెదుకుతోంది నీరజ.

మరో నాలుగునెలలు ఇలాగే గడిచిపోయాయి.

ఒకరోజు ఇంటిముందు మెట్లమీద నిలబడి తోటలోని పూలవైపు చూస్తోంది

పరధ్యానంగా.

"హల్లో, నీరజేనా ?"

ఎవరోనని తిరిగి చూసిన నీరజకు సైకిలుపట్టుకుని నిల్చున్న అమ్మాయి కనబడింది. ఎక్కడో చూసినట్టుందే ఎవరా అని చూస్తూండగానే ఆ అమ్మాయి గేటుతెరుచుకుని లోపలకువచ్చింది.

"ఓహో ! గుర్తుపట్టలేదన్నమాట. నేనేనోయ్. పాత రమణిని, ఇప్పటి రీటాని."

రమణి ! చక్కగా చీరకట్టుకుని నుదుట కుంకుమతో పమిట నిండుగా కప్పుకుని ఉండే రమణిని తల్చుకుంటూ ఆశ్చర్యంగా చూసింది నీరజ.

"ఆశ్చర్య పడుతున్నావు కదూ ! అదంతేలే ఇంతకూ నువ్విక్కడున్నావేమిటి ? ఇది మీ ఇల్లేనా ? ఎన్నాళ్ళయింది ఈ ఊరొచ్చి?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించింది రీటా.

"మా ఇల్లే, ట్రాన్స్‌ఫర్ అయి ఈ ఊరొచ్చాం కాని, ముందు లోపలికిరా" అంటూ ఇంట్లోకి తీసుకుని వెళ్ళింది నీరజ.

రమణి వేషంతోబాటు మాటకూడా మారిపోయింది.కళ్ళలో మునుపటి ప్రశాంతత, మనిషిలో నిండుదనం మాయమయి పోయాయి. మల్లెపూవులాంటి రమణి కాగితపు పువ్వుగా మారిపోయింది. ఏమిటి చిత్రం !

రమణి చెప్పినగాధవిని నీరజకళ్ళు చెమ్మగిల్లాయి.

డబ్బులేక రమణి చదువు సగంలోనే ఆగిపోయింది. మంచంలో తీసుకుంటున్న తల్లిని, తమ్ముళ్ళను, రమణిని అనాధుల్నికుచేసి తండ్రి చనిపోయాడు. ఎదిగిన కూతుర్ని ఇంట్లో పెట్టుకునే ధైర్యంలేక మామయ్యతెచ్చిన వయసు మళ్ళినవరునితెచ్చి వివాహంచేసింది తల్లి. కాపురానికి వెళ్ళకుండానే విధవై కూర్చుంది రమణి. ఇంట్లో సంసారం గడిపే దిక్కులేదు. తను చనిపోతే రమణిగతి ఏమవుతుందోనని పెళ్ళిచేసిన తల్లి యింకా మంచంలోనే తీసుకుంటూనే వుంది. ఇక పొట్టగడిచేమార్గం ఆలోచించాల్సిన భారం రమణిమీద పడింది. మనస్సు రాయిచేసుకుని గ్రద్దల్లాగా పొడుచుకు తినాలని చూస్తున్న పురుషుల మధ్యకు ధైర్యంగా దూకింది. తన అందాన్ని, తెలివినీ ఉపయోగించి ఉద్యోగాన్ని సంపాదించింది. రమణిగా చనిపోయి రీటాగా జీవిస్తోంది. తల్లిని పోషిస్తూ తమ్ముళ్ళ భవిష్యత్తుకోసం కృషిచేస్తోంది.

అంతావిని నోటమాటరాక నిశ్చేష్టురాలైన నీరజను తట్టిలేపింది రమణి... కాదు రీటా.

"సరేలే, నాదంతా మామూలు గొడవలే. అలవాటుపడిపోయాను. నిన్నుచూస్తే పూర్వపురోజులు గుర్తుకొచ్చి బాధకలిగిందంతే. నువ్వెలా

ఉన్నావో చెప్పు? మీవారేరి? పిల్లలా?''

నీరజ కాస్తతేరుకుని చిన్నగా నవ్వింది.

"పిల్లలేరు. మావారు అర్జంటుపని ఉండి రాత్రి క్యాంపుకెళ్ళారు.'' అంటూ వంటమనిషితో కాఫీ, టిఫిన్ పైకి తీసుకురమ్మనిచెప్పి మేడమీదికి వెళ్ళింది స్నేహితురాలితో సహా.

''నీకథవింటే లోకంమీదనే ద్వేషం పుడుతోందినాకు.''

''లోకాన్ని, పురుషుల్ని ద్వేషిస్తూనే వాళ్ళమధ్యనే నవ్వుతూ బ్రతుకుతున్నాను మరి.''

టేబుల్ మీదున్న ఫోటో చూసి ఆశ్చర్యంతో రీటాకళ్ళు పెద్దవయ్యాయి.

"ఇతనేనా నీ భర్త?" అంటున్నపుడు ఆమె కళ్ళలో తళుక్కుమన్న భావాన్ని చూసి చకితురాలయింది నీరజ.

నువ్వెరుగుదువా మావారిని?" అని అడగలేకపోయింది.

రీటా తనలోని ఆవేశాన్ని మెల్లగా అణచుకొని నీరజ దగ్గరకువచ్చి ఆమె ముఖాన్ని తనవైపుకు తిప్పుకొని,

''నిజం చెప్పు నీరజా, నువ్వు సుఖంగా ఉన్నావా?'' అని అడిగింది

నీరజ ఇక ఆపులేకపోయింది ఎన్నాళ్ళనుండో హృదయంలో దాగి ఉన్న దుఃఖమంతా పెల్లుబికిరాగా రీటా ఎదలో తనముఖాన్ని దాచుకుని వెక్కివెక్కి ఏడ్చేసింది.

''మీవారి సంగతంతా తెలుసానీకు?"

"ఉహుఁ. ఎమీ తెలీదు తెలియకనే ఇంత బాధాను ''

''అయితే ఒద్దులే, నీకు తెలియక పోవటమే మంచిది "

"కాదు. ఈ జీవితం నేను భరించలేను. నీకు తెలిసిందేదో నాకూ చెప్పు."

"ఇంత మాత్రం తెలుసుకోకుండా ఎలా ఉన్నావో అర్థం కావటంలేదు నాకు. నీ భర్త ఇంతకుముందుకూడా ఈ ఊళ్ళో ఉన్నాడని తెలుసా నీకు? అతడు క్లబ్బులో అందరికీ పాతదోస్తు.

"అందరూ అతనిచే ఆకర్షింప బడతారు. కాని ఏ ఒక్కరి మీదా అతడికి ఎక్కువరోజులు మోజుండదు. క్రొత్త పక్షులకోసం వేట సాగిస్తూనే ఉంటాడు. వలలో పడగానే ఎగరేసుకుని వెళ్ళి జల్సాగా కాలం గడపుతాడు.

''అన్నట్టు రాత్రి అతడు ఎక్కడికి వెళ్ళాడో తెలుసా?''

నీరజ కళ్ళు పొడిగా ఉన్నాయి. మొహం తెల్లగా పాలిపోయింది?

"క్యాంపుకు కాదా?''

"క్యాంపే అనుకో, కాని ఆఫీసు పని మీద కాదు.''

"మరి?''

''కొత్తగా వచ్చిన అందాలరాణి మిస్ నందాతో బెంగుళూరు వెళ్ళాడు. ఆ అమ్మాయికోసం ఎంత పోటీ అనుకున్నావ్? ఆఖరికి ప్రభాకరమే గెలిచాడు.



"ముసలాళ్లు ప్రేమించుకుంటున్నారు"

గెలువడూ మరి. అందరినీ మించిన అందగాడు. దానికి తోడు చాతుర్యమూ, డబ్బూ......''.

''డబ్బు! డబ్బు! '' ప్రపంచమంతా నీరజ కళ్ళముందు గిర్రుమని తిరిగినట్టు అనిపించింది.

నీరజ స్థితి చూసి రీటా చలించింది. మెల్లగా ఓదార్పు మాటలు చెబుతూ కాస్సేపు కూర్చుని వెళ్ళిపోయింది.

నీరజ అసలు ఈ ప్రపంచంలో లేనే లేదు. మెల్లిగా ఆమె హృదయకవాటం తెరుచుకుంది. అందులోనుండి తొంగి చూస్తున్న మురళి.

"నీరజా! నీకోరికలన్నీ సహజమే కాని వాటన్నిటికీ మించి నీ పు రు ష ని ప్రేమ కావాలంటావా?'' అంటున్నట్టనిపించింది.

హృదయాన్ని రెండు చేతులతోనూ గట్టిగా అదుముకుని లేచి నిలబడింది. తడబడుతున్న అడుగులను ముందుకు వెయ్యబోయి క్రిందపడిపోయింది.

కాఫీకప్పులను తీసుకెళ్ళడానికి వచ్చిన వంటావిడ క్రింద పడివున్న నీరజను చూసి కెవ్వుమని కేకవేసింది. నౌకర్లు పరుగెత్తుకుంటూ వచ్చారు. వంటావిడ నీరజ మొహంమీద నీళ్ళుచల్లి తెలివి తెప్పించడానికి ప్రయత్నించి విఫలురాలయింది. మెల్లిగా మంచంమీద పడుకోబెట్టారు. కంగారుగా డాక్టరుకోసం పరిగెత్తారు.

ఇంజక్షన్ చేసిన తరువాత కళ్ళు తెరచింది నీరజ కాని ఎవ్వర్నీ గుర్తు పట్టలేదు. టెలిగ్రాం అందుకుని వచ్చిన నీరజ తండ్రి కూతురి పరిస్థితిచూసి ఏమీ అర్థంకాక కుమిలిపోసాగాడు. వారం రోజులు నిలవకుండా కాచిన జ్వరం నీరజను పీల్చి పిప్పిచేసింది. వారం రోజుల తరువాత ఇంటికి వచ్చిన ప్రభాకరంకూడా నీరజ పరిస్థితికి ఆశ్చర్య పోయాడు. నీరజ ప్రక్కనుండి కదల కుండా దగ్గరే ఉంటున్నాడు ప్రభాకరం. కాని నీరజ మాత్రం భర్తని సూటిగా చూడలేకపోయింది. జ్వరం తగ్గినా త్వరగా మామూలు మనిషి కాలేక పోయింది నీరజ.

వంటావిడనుండి ఎవరో ప్రాకు తొడుక్కున్న పిల్ల వచ్చిందనీ ఆ పిల్ల వెళ్ళిపోయాకనే నీరజ తెలివితప్పి పడి పోయిందనీ తెలుసుకున్న ప్రభాకరానికి నీరజ పరిస్థితి కొంచెం కొంచెం అర్థమవ సాగింది. వంటావిడచెప్పిన రూపు రేఖలనుబట్టి రీటాను సులభంగా పోల్చు కున్నాడతడు.

నెలరోజులు గడిచాయి. నీరజతండ్రి వెళ్ళిపోయాడు. ఈ నెలరోజులూ ఆఫీసు టైములోతప్ప మిగతా టైములో ఇంటి పట్టునే ఉన్న ప్రభాకరానికి ఏమీ తోచటం లేదు. నీరజ ఇపుడిపుడే కొంచెం కొంచెం కోలుకుంటూఉంది.

ఏదో చదువుకుంటూ మంచంమీద పడుకునివున్న నీరజ ప్రభాకరం రావ టంతో అటు తిరిగింది. జబ్బువల్ల నీర సించినా ఆమె మొహంలో లావణ్యం ఉట్టిపడుతూనే ఉంది.

ప్రభాకరం లోపలకువచ్చి ఓ కుర్చీని మంచందగ్గరగా లాక్కుని కూర్చున్నాడు. అతడిని నీరజ వింతగా చూస్తోంది. ఆమె హృదయం ఏదో అజ్ఞాత భయంతో వణికింది.

"నీకు రీటా నా విషయమంతా చెప్పే ఉంటుంది'' అన్నాడు కిటికీలోనుండి కనపడుతున్న ఆకాశాన్ని చూస్తూ.

నీరజ పెదవి మెదపకుండా వింటోంది

"నీది సున్నితహృదయం కాబట్టే సహించలేకపోయావు నేను చాలా దుర్బ లుడిని. నిన్ను హృదయంలో దాచుకుని ఆరాధించవలసిన పురుషుణ్ణి పొంద వలసిన నువ్వు దురదృష్టంకొద్దీ నన్ను పెళ్ళాడావు ''

ఆశ్చర్యంగా చూస్తోంది నీరజ.

''నీలాంటి సౌందర్యమూర్తిని సుగుణ రాశిని చేపట్టికూడా పొందలేకపోయా నంటే దానికి కారణం నా దుర్బలతే కాని మరేమీకాదు. నేను నీకు తగినవాడిని కాదు. నిన్ను సుఖపెట్టలేకపోయాను. నన్ను క్షమించమని అడిగే అర్హతకూడా నాకు లేదు ''

ఆశ్చర్యంతో నీరజ కళ్ళు పెద్ద వయ్యాయి. అలాగే చూస్తూ ఉండి




"మీ చేతిలో రాజయోగం ఉంది ఈ తాయిత్తు కట్టుకుంటే
సువర్ణయోగం కూడా కలుగుతుంది"
"అయితే అప్పుడే మీకు కూడా స్వర్ణయోగం పడుతుంది."

పోయింది.

"ఇంతా తెలిసిన మీరు మారే అవకాశంలేదా ?"

నీరజ కంఠం వణికింది. ప్రభాకరం చలించాడు.

"మారాలనే నాకూ ఉంది. కాని నన్ను అదుపులో పెట్టుకోగల శక్తి నాకు లేదు."

ప్రభాకరం దృష్టి కిటికీ వెలుపల వున్న ఆకాశంమీదనే ఉంది

"మీరు మారవచ్చునన్న ఆశతోనే జీవితాన్ని నిలుపుకోగలను. అదీలేకుంటే ఇక ఈ జీవితం దుర్భరమవుతుంది."

నీరజ కళ్ళనీళ్ళు ఆపుకుంటూ అటు తిరిగింది

"ప్రయత్నిస్తాను" అన్న మాటతోనే వెళ్ళిపోతున్న అడుగుల చప్పుడూ వినబడింది

నీరజ మామూలు మనిషయి చిగురించిన ఆశతో ఎదురు చూడసాగింది. కాని ఆ రోజు రానేలేదు. రోజులు, నెలలు ...... సంవత్సరాలు కూడా గడిచి పోయాయి. భారంగా రోజులు గడుస్తున్నాయి. ఆ సమయంలోనే మురళి కనిపించి పాతగాయాన్ని రేపాడు.

* * *

ఇంట్లో అడుగుపెట్టిన మురళిని చిరునవ్వుతో ఆహ్వానించింది నీరజ.

"ఏరీ మీవారు? ఇంట్లోఉన్నట్టులేదే?" అన్నాడు మురళి.

"ఆయన ఇంట్లో లేరుకాని కూర్చో మరి."

"అదేమిటి, సాయంకాలం ఇంటికి రారా? ఆయనను చూడవచ్చుననే ఇప్పుడు వచ్చాను."

"ఆయన ఇంటికి వచ్చేసరికి తొమ్మిది దాటుతుంది. ఇంతకూ నీ సంగతులు చెప్పు. ఎలా ఉన్నావు? ఏమిటి కథ?"

"నాదేముంది. మామూలు జీవితం. హాయిగానే ఉన్నాను."

నీరజ సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది. అతడి స్వచ్ఛమైన హృదయం అతడి కళ్ళలో ప్రతిబింబిస్తోంది. తాను బుద్ధిపూర్వకంగా దూరంచేసుకున్న ప్రేమమూర్తిని తదేకంగా చూస్తూ కూర్చుంది నీరజ.

"హాయిగా ఉన్నావు, అది తెలుస్తూనేవుంది కాని అంతా చెప్పు మరి వివరంగా." అంది చిలిపిగా.

మురళి మొహం గంభీరమయింది.

"ఆనాడు నిన్ను వదిలి ధైర్యంగానే వెళ్ళాను, కాని ఆ ధైర్యం నాలో ఎంతో సేపు నిలవలేదు, తల్లి ఒడిలో తలదాచుకుని అంతా మరచిపోదామనుకున్నాను. కాని అక్కడా నాకు శాంతి దొరకలేదు. బెంగతో ఆర్నెల్లు మంచానపడ్డాను తల్లిదండ్రులను ఇంత బాధ పెడుతున్నందుకు నా మీద నాకే అసహ్యం వేసింది. కాని నన్ను నేను అదుపులో పెట్టుకోవడానికి సంవత్సరం పట్టింది. నాన్నకు అంతా తెలుసును కాని నన్ను ఒక్క మాట కూడా అనలేదు.

"అక్కడే రుక్మిణితో పరిచయం కలిగింది. తను కలవారిపిల్ల. తనే వచ్చి పరిచయం చేసుకుంది. తన స్నేహంతో నన్ను మనిషిగా చేసింది. తన ప్రేమతో నన్ను గెల్చుకుంది. బీదవాడినయిన నన్ను పెళ్ళి చేసుకుని నాకు ఆసరాగా నిలబడింది. ఆమె లేకపోతే నా జీవితమేమయ్యేదో?

"నీ సంగతంతా తనకు తెలుసు. క్రొత్తలో నిన్నుగురించి "మిమ్మల్ని నాకు ప్రసాదించిన ఆమెకు ఎంతో కృతజ్ఞురాలిని" అంది అంతే. తరువాతెప్పుడూ పొరపాటున కూడా నీ పేరెత్తలేదు. ఆమె పరిపూర్ణ ప్రేమావరణంలో నేను తృప్తిగా జీవిస్తున్నాను."

రుక్మిణి జ్ఞాపకంతో అతనికళ్ళు మెరిశాయి.

మురళి కొత్తరూపాన్ని నీరజ ఈ రోజే చూస్తోంది.

మురళి తనను ఆరాధించాడు. తను ఆ రత్నాన్ని పారవేసుకుంది.

రుక్మిణి మురళిని ఆరాధించి తన వాడిగా చేసుకుంది.

మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్న నీరజను మురళి పలుకులు ఈ లోకంలోకి దింపాయి.

''నువ్వు సుఖంగా ఉన్నావుకదా ?''

ఎంతో ఆప్యాయంగా ఉంది ఆ గొంతు. తనకు అంతకన్నా దగ్గరవారెవరున్నారు? రెండు చేతులతోను మొహాన్ని కప్పుకుని ఏడవసాగింది, నీరజ.

విస్తుపోయాడు మురళి.

చటుక్కునలేచి లోపలికి వెళ్ళిపోయింది నీరజ మురళి విస్మయానికి అంతులేదు. నివ్వెరపోయి చూస్తూ కూర్చున్నాడు.

పదినిమిషాల్లో నవ్వుతూ వచ్చింది నీరజ. మొహం కడుక్కుని వచ్చినట్టు తెలుస్తూనే ఉంది. కుర్చీలో కూర్చుని మెల్లిగా తన కథంతాచెప్పింది. అంతా విన్న మురళి అలాగే కుర్చీకి అతుక్కుని పోయాడు. ఏమని ఓదార్చటం ?

"చూశావామురళీ, నా జీవితం ఎలా తయారయిందో ?"

"..................''

''ఇది నిన్ను తిరస్కరించినదాని ఫలితమేనంటావా ?''

''లేదు,లేదు.అలాఎప్పటికీ అనుకోను."

''ఈ జీవితాన్నుండి నిష్కృతే లేదా మురళీ ? ఇందులోనుండి తప్పించుకుని దూరతీరాలకు వెళ్ళేమార్గమే లేదా? అలసిపోయాను ఇక ఈ జీవితాన్ని నేను భరించలేను మురళీ."

ఆ గొంతులోని విచారానికి, ఆర్ద్రతకూ చలించాడు. కళ్ళెత్తి నీరజ దృష్టిని ఎదుర్కొన్నాడు.

''డబ్బూ, హోదా కావాలన్నాను కాని ఈ నీరస జీవితాన్ని కోరుకోలేదు మురళీ ! ఈ బంగారుపంజరం నుండి విడుదల లేదా అని తపించి పోతున్నాను. ఇప్పుడు.''

"నిజమే ఈ జీవితం బంగారు పంజరమే. కాని ఈ బంగారు పంజరాన్నుండి బయటపడి ఎక్కడికోవెళ్ళి శాంతిని సాధించాలను కోవటం పిచ్చితనం. ప్రభాకరంలో ఈరోజుకాకపోతే మరో రోజునైనా మానవత్వం మేల్కొన వచ్చును. ఆ క్షణంకోసం ఎదురు చూస్తూ ఉండటమే నీకర్తవ్యమూ, మార్గమూను. ఇంకే దారీ లేదు.''

''అంతే నంటావా ?"

''ఖచ్చితంగా అంతే. నీ దైవం నిన్ను వెతుక్కుని వచ్చే రోజు రాకపోదు. ఆ రోజు త్వరగా రావాలని, నువ్వు సుఖపడాలని ఆశిస్తున్నాను." అంటూ లేచి నిలబడ్డాడు మురళి.

''మళ్ళీ కనిపిస్తావా ?"

"ఊహుఁ రేపే పల్లెకు వెడుతున్నాము. బహుశః మళ్ళీ ఇక్కడకురాము''

నీరజ పరీక్షగా అతని మొహంలోని భావాలను చదవడానికి ప్రయత్నించింది. కాని కనిపించలేదు.

వెళ్ళిపోతున్న అతనివైపే చూస్తూ, ''తను పోగొట్టుకున్న దాని విలువెంతో లెక్కకట్టడానికి కావలసినంత జీవితం మిలిగింది" అనుకుంది నీరజ. 

# సినిమా క్విజ్







పై రెండుబొమ్మలూ రెండు సినిమాల పేర్లు తెలియజేస్తవి ఏమిటవి
(జవాబులు 128 వ పేజీలో)



# యువతీలోకం



## విఫల వివాహాలు: కారణాలు

వైవాహిక జీవితం సౌఖ్యప్రదం చేసుకోవట మనేది సాధారణంగా తేలిక విషయం కాదు. తెలివితేటలూ మెలకువతో జరుపుకోవలసిన కార్యక్రమం. ఇది సంకుచిత స్వార్థపరాత్ముల శక్తికి అతీతమైన గురుతరవిషయం అనటం కూడా సత్యేతరంకాదు. స్త్రీ పురుషులకు సంబంధించిన రెండు వ్యక్తిత్వాలు సంపూర్ణంగా సంలీనమై ఒకేఒక పూర్ణ మానవజీవితంగా రూపం దిద్దుకోవడమే వివాహంయొక్క మూలాశయం. వ్యక్తికి నిర్మలంగా ప్రేమించే మరో సహజమయిన స్నేహహృదయం అరుదుగా తటస్థపడుతుంది. కాని ప్రతి మానవుడికీ వివాహానంతరం ఈ స్థితి చేకూరుతుంది. భార్యా భర్తలు నిర్మల హృదయంతో ప్రేమించుకున్నట్టుగా ప్రేమించే స్నేహ హృదయం యెవరికీ లభించదు. ఈ పరస్పర స్నేహాన్ని ప్రపంచంలో యేశక్తీ జీవితకాలంలో విడదీయలేదు. వివాహం కేవలం మానసిక వాంఛా పరిపూర్తి కోసరమే జరిగేది కాదనీ మానవతా పరిపూర్ణత దీని ధ్యేయమనీ గమనించవలసి వుంది. వివాహం రెండు వ్యక్తిత్వాలని పరస్పరాశ్రితం చేస్తుంది. ఈ పరస్పరాశ్రిత మనేది బానిసత్వంపద్ధతిలో గాక జీవితాభిరుచుల ఏకైకానుభవ నిమిత్తం మాత్రమే యేర్పడింది. భార్యాభర్తలు ఉభయులూ బుద్ధికుశలత గలిగి వివాహం యొక్క పరమార్థాన్ని ఆకళింపు చేసుకుంటే వాళ్ళ జీవితాలు స్వర్గానికి తీసిపోవు.

వివాహంయొక్క పరమోత్కృష్టమైన మహదాశయానికి పూర్తి విరుద్ధంగా నేటికాలపు వైవాహిక జీవితాలు సాధారణంగా నిష్ప్రయోజనం, విఫలం అవుతూండడం దురదృష్టకరమైన విషయం. సంతోషంతో ప్రారంభమైన వివాహాలు చివరకంటా అదేస్థితిలో సాగిపోక విషాదకరంగా అంతం అవుతోన్నాయి. నేటి కాలంలో వైవాహిక జీవితాలు అధికంగా విఫలం అవుతూ వుండడానికి కారణాలు పరిశోధించి చూసుకోవలసిన అవుసరం యెంతైనా వుంది. పాశ్చాత్య

ఊటుకూరి శకుంతలాదేవి

సంప్రదాయాభిమానులు పాశ్చాత్య నాగరికతా సంస్కృతీ స్వభావులూ అయిన వారలూ మనదేశంలో వివాహాలు అపరిచితులైన స్త్రీ పురుషులమధ్య అంతకు పూర్వం ప్రేమలేకుండా జరుగుతున్నాయి కాబట్టి విఫలం అవుతున్నాయనికారణాలు చెపుతూంటారు. పాశ్చాత్య సంస్కార నాగరికతలు పూర్తిగా వంటబట్టివున్న నేటి కాలంలో పవిత్రమైన వివాహ వ్యవస్థను గురించి విచిత్రమైన అభిప్రాయాలు సమాజంలో యేర్పడి వున్నాయి. వ్యక్తులలో స్వార్థం ప్రబలిపోయింది. వైవాహిక మూల సిద్ధాతం విస్మృతమై స్త్రీ పురుషులు ఒకరికోసం మరొకరు కనీసత్యాగంకూడా చేయలేని స్థితి దాపురించింది. ఎవరికి వారే తమ స్వీయ సౌఖ్యం సంతోషంకోసం స్వార్థంతో ప్రయత్నిస్తుండటంవల్ల హృదయాలలో ఒకరిపట్ల ఒకరికి ప్రేమ అనేది ఉద్భవించటం దుర్ఘట మవుతూన్నదేమో నని పిస్తోంది. ఒకరినొకరు గమనించకుండా పరిశీలించకుండా త్వరపడి అభిప్రాయాలేర్పరుచుకోవడం ఒకరితో నొకరు ప్రమేయం లేకుండా ఏకపక్ష నిర్ణయాలు జరుపుకుంటూ ఒకరికొకరు అర్థంకాని పరిస్థితి కల్పించుకొంటూ వుండటమే నేటి అనర్థాలకు అధికంగా కారణం. మన జీవిత సాంఘిక పరిస్థితులను దృష్టిలో వుంచుకొని ఈ విషయాలు తీవ్రంగా పరిశీలించవలసి వుంది.

వివాహానికి ముందుగా స్త్రీ పురుషుల మధ్య పరిచయం సమ్మేళనంలేని పక్షంలో వారు ఉభయుల మధ్య ప్రేమోత్పత్తి జరగదనీ వైవాహిక జీవితం ఫలప్రకాశితం కాదనీ కొందరంటూంటారు. ఇది దురభిప్రాయం అని చెప్పవచ్చును. వివాహానికి పూర్వం యువతీ యువకులు పరస్పర సంబంధాలు కలిగివుంటే మాత్రం ఏమవుతుందని.

ఒక అందమైన యువతి, మరో యువకుడు యిద్దరూ యే తోటలోనో సినిమాలోనో పార్కులోనో రోడ్డుమీదో యెక్కడో ఒకచోట యేదో యొక హఠాత్సంఘటన కారణంగానో యాదృచ్ఛికంగానో కలుసుకోవటం తటస్థపడడం, అది స్నేహంగా మారటం మారని పక్షంలో యెవరో ఒకరు ప్రయత్నపూర్వకంగానైనా మారేలా చేయటం జరుగుతుంది. దీంట్లో ఒకరి బలహీనతలూ శాపాలూ మరొకరికి తెలియకుండా మొదటినుంచీ కపటనాటకమే ప్రారంభమై ఒకరినొకరు అమితంగా ఆకర్షించుకొనటమనే గుంజాటనలుపడి యెత్తులు వేసుకుంటుంటారు. ఎవరి బలహీనతలు వారు దాచిపెట్టుకుంటూనే ఉభయులూ ఒకర్నొకరు పూర్తిగా అర్థం చేసుకున్నామని భ్రమలుపడి వివాహాన్ని జరిపించుకుంటారు... వైవాహిక క్రియానంతరం ఇదివరకు లేనంత పరస్పర సాన్నిహిత్యం సమక్ష




"కలసివుంటే కలదు సుఖం"

స్థితిలో ఉభయుల స్వరూపాలూ ఒకరి కొకరికి లోగడకన్నా ప్రకాశమానంగా క్షుణ్ణంగా అర్థమవుతుంటాయి... ఒకరి అభిరుచులు మరొకరికి సరిపడని మూల భిన్న ప్రకృతి యేర్పడుతుంది. ఒకరి పొరపాట్లను మరొకరు సరిదిద్దుకొని పోతుంటేనే యే దాంపత్యమైనా మన గలుగుతుంది.

ప్రాచ్యదేశాల సాంప్రదాయంలో అధికభాగం వర నిర్ణయ బాధ్యతను, తల్లిదండ్రులూ, యితర స్నేహిత బంధువులూ స్వీకరిస్తారు. తోటలూ, రోడ్లూ, సినిమాహాళ్ళలో గాకుండా యేదోఒక శుభదినాన అలంకృతమైన స్వగృహంలో యువతీ యువకులకు ప్రథమ వీక్షణం యేర్పాటు చేస్తారు. యువతీ యువకు లిరువురికీ పరస్పరం నచ్చినమాటైతే మిగతా ఆర్థేయపౌరుషాలు, సంపద సంస్కారాలూ మొదలైన వాటిని గురించి పెద్దలే స్వయంగా విచారిస్తారు. తగిన సంబంధమని నిశ్చయంగా విశ్వసిస్తే వివాహానికి ముహూర్తం యేర్పాటై సలక్షణంగా జరిగిపోతుంది.. ఇందులో యే ఒక్క విషయంలో అసంతృప్తి యెవరికి గోచరించినా వివాహానికి లగ్నం పెట్టుకోవటం జరగదు., వధూవరుల ఉభయపక్షాలలోనూ అనుసరించబడే ఆచారం యిది.

స్త్రీ దృక్పథంతో పరిశీలిస్తేమట్టుకు పాశ్చాత్య దేశాలలోని ప్రేమానంతర

వివాహాలకన్నా ప్రాచ్యదేశాలు ముఖ్యంగా భారతదేశంలోని వివాహ పద్ధతులే మెరుగనిపిస్తాయి. వివాహపూర్వం ప్రేమించుకోవటం జరిగే పద్ధతిలో పురుషుడు స్త్రీనీ, స్త్రీని పురుషుడూ వంచించుకోవటానికి తగిన వాతావరణం యేర్పడుతుంది...ఒక్కోసారి వివాహం సంగతి అటుంచి మరి దేనికోసమో ప్రేమంటూ యేర్పడి, చివరకు వివాహాలు భగ్నమైనట్టి జీవితాలే మిగిలిపోతూ వుంటాయి.

మానవజీవితంలో దేన్ని స్వంతం జేసుకోవాలన్నా తనదిగా వరించాలన్నా పరిశీలన అత్యవసర మవుతూంది. ఆఖరుకు బంగారం కొనాలన్నా అనుభవజ్ఞుడైన కంసాలితో సంప్రదించుతాము. విశ్వాసపాత్రంగా వుంటేనే స్వీకరిస్తాం. ఏదన్నా మోసం వుంటే నిరాకరిస్తాం. ఇక జీవితానికి సంబంధించిన వివాహాల విషయంలో ఎలాంటి పరిశీలనా లేకుండా ముఖ్యంగా అనుభవజ్ఞులైన పెద్దలతో సంప్రదించకుండా త్వరపడి నందువల్ల భవిష్రత్ప్రయోజనం శూన్యమేఅవుతుంది. స్వార్థం, స్వప్రయోజనం, వంచనలు ఆధారంగా జరిగే వివాహాలు మధ్యలో జీవితాలను నరకప్రాయం చేస్తాయి.

సాంప్రదాయకంగా పెద్దలు వధూవరుల ఆర్షేయ పౌరుష సంస్కృతీ సంపదలను పరిశీలించి సరియైనవిగా నిర్ణయించి జరిపే వివాహాలే చాలాభాగం, సుఖప్రదాలూ సుస్థిరములుగా అనుభవంలో గోచర మవుతూన్నాయి. తమ సంతానం భవిష్యత్తు అంధకారం కారాదన్న కోర్కెతో పెద్దల పరిశీలన జరుగుతుంది. ఉభయులూ ఒకరి సంసార పరిస్థితులను గురించి మరొకరు పూర్తిగా తెలుసుకునే సంబంధాలకు అంగీకరిస్తారు కాబట్టి ఇందులో ఒకర్నొకరు మోసం జేసుకోవట మన్న ప్రశ్నే వుదయించదు. తప్పు జరిగినా ఒప్పు జరిగినా ఫలితాలు వధూవరుల కుటుంబాలు సమానంగానే అనుభవించవలసి వస్తుంది.

నేటికాలపు వివాహాలు తరుచుగా విఫల మవుతూండడానికి గల కారణాలు సూక్ష్మంగా లోతుగా పరిశీలిస్తే కొన్ని కనిపిస్తుంటాయి. సోదరీమణులూ పిల్లల తల్లిదండ్రులూ వీటిని ముఖ్యంగా గమనించాలి. వివాహ వ్యవస్థ దోషా లెంచడం కన్నా ప్రవర్తనను చక్కదిద్దుకోవటమును గురించి ఆలోచించాలి.

భార్యా భర్తల దాంపత్యం పరస్పర ప్రేమ సౌహార్ద్రాలమీద అధికంగా ఆధారపడుతూంటుంది. అసలు వివాహం అంటేనే సంతోష జీవితానికి మారుపేరు. పరస్పర ప్రేమ సౌహార్ద్రాలు హృదయాలనూ, అభిరుచులనూ, అలవాట్లనూ పరస్పరం పూర్తిగా అర్థం చేసుకోవటం వల్లనే కలుగుతాయి. ఒకరిని మరొకరు గుర్తించక ఒకరి అవసరం మరొకరు అర్థం చేసుకోక వుంటూవుంటే క్రమంగా

ఒకరిమీద ఒకరికి అనురాగం సన్నగిల్లి ఆవేశం ప్రభవిస్తుంది. దాంపత్యం అర్ధాంతరంగానే అంతర్ధాన మవుతుంది. ఒకరినొకరు సున్నితంగా అర్థంచేసుకోవటం జరగాలి.

ధనంకోసం ఆశపడి వివాహాలు జరపడం జరుపుకోవడం నైతిక దురాచారాలూ నేరాలుగానూ కూడా పరిగణించాలి. చివరికి ఆ ధనమే దాంపత్యానికి శత్రువై సంసార విచ్ఛిన్నానికి కారణం అవుతూండే సంఘటనలుకూడా యేర్పడతాయి. ఒక పేదయింటి పిల్ల మరొక ధనవంతుడి కుటుంబంలో యువకుడిని వివాహమాడటం జరిగితే అది అసమ వివాహమై అననుకూలంగా మారుతుంది. తమకన్నా ఉన్నతస్థితిలో నున్నవారినే వివాహ మాడాలన్న ధ్యాస నేటికాలపు యువతులలో అధికంగా కనిపించడం నేటికాలపు వైఫల్యాలకు సగం కారణం. ఎప్పటికీ వివాహాలు సంపదరీత్యా అసమంగా వుండరాదు.

ప్రతి స్త్రీకి తన గృహం యొక్క ఆర్థిక పరిస్థితులు క్షుణ్ణంగా తెలిసి వుండటం అత్యవసరం. అందుకు అనుగుణంగా దూరదృష్టితో ఆవిడ తన అవసరాలనూ వ్యయాన్ని కుదించుకుంటూ ఆర్థికంగా వీలైనంత పొదుపరితనం అలవరుచుకుంటే వున్నస్థితిలోనే వీలైనంత ఉత్తమంగా జీవించడానికి ప్రయోజనకరమైన పరిస్థితులు యేర్పాటు జేసుకుంటే పురుషుల ప్రాణానికి హాయిగా వుండడమే గాక జీవితాలు ప్రశాంతంగా నడుస్తుంటాయి. దాంపత్య జీవితంలో అధికభాగం ఆర్థిక సమస్యలే అందరికీ యెదురౌతూంటాయి. స్త్రీలు ఆర్థిక స్థితిగతులకు అనుకూలమైన పద్ధతిలో నడిచే గృహాలలో అధికమైన కలతలు వుండవు. ఈ బాధ్యత అధికంగా స్త్రీ మీదనే వుంటుంది ఈ బాధ్యతా నిర్వహణలో పురుషులు స్త్రీలతో సహకరించి తమ ఆర్థిక ఆదాయ వివరాలూ వాస్తవ స్థితిగతులూ తేటతెల్లంగా వారికి స్పష్టపరచవలసి వుంటుంది. స్త్రీ తన జీవనసహచారిణిగా భావించి తమకు ముఖ్యం అనుకున్న ప్రతి విషయంలోనూ ఆవిడకు నిజపరిస్థితులు అర్థం కానీయాలి.

ఈ యుగం మానవ జీవితాన్ని కొన్ని పరిధులలో బంధించివేసింది. మానవత్వపు విలువలు తగ్గిపోయాయి. అయినా మానవుడు లేనిదే యేదీసాగదు. జీవించందే మానవుడికి సాగదు. ఈ పరిస్థిలలోంచి గడిచిపోవలసిన మనుష్యులు యెన్నో అవాంతరాల నెదుర్కొంటూ యెన్నో బాధ్యతలను నిర్వహించవలసి వుంది. ఇందులో ప్రధానబాధ్యత వైవాహిక దాంపత్య జీవిత నిర్వహణ. ఇది నిరాశ, నిస్పృహలకు గురి అయితే స్త్రీపురుషులలో యెవ్వరూ ముందుకు పోలేరు.

జీవితంలో విజయాన్ని సాధించేభర్త తనభార్యను యెప్పుడూ తప్పులు వెదుకుతూ చికాకు పరచడు. భార్య సంతోషంగావుంటే ఈర్ష్యపడడు, ఆవిడ విషయంలో తనకర్తవ్యాన్ని, బాధ్యతలను పవిత్రమైనవిగా భావించి నిర్వహిస్తుంటాడు. భార్య దుఃఖాన్ని తన దుఃఖంగా భావిస్తాడు. ఊహలకన్నా ఆచరణ స్వభావాన్ని అధికంగా పెంచుకుంటాడు. ఇదే విధంగా స్త్రీ కూడా తన భర్తపట్ల తన కర్తవ్యాన్ని పవిత్రంగా భావించి నెరవేర్చాలి.

వైవాహికజీవితాలు జయప్రదం కాకుండా విఫలంఅవటానికి ప్రధాన కారణం ఆధునిక వివాహపద్ధతుల విపరీతం. పాశ్చాత్యనాగరికతా వ్యామోహం, మనకు ప్రణయ వివాహాలనీ,ప్రేమానంతర వివాహాలనూ సమకూర్చిపెట్టింది. ఇవి తప్పు అని అనటంలేదుకాని స్త్రీపురుషుల మనస్సులు పాశ్చాత్య దేశాలలోవలె పరిణత పొందకముందు తార్కిక దృష్టిని అవలంబించకముందు, అలాంటి వివాహాలు జరుపుకోవటం సమాజానికి శ్రేయస్కరం కాదు. సమాజం మొత్తం అన్ని రంగాలలోనూ ఆధునికమై పాశ్చాత్య జీవితాలకి దీటుగా పురోగమించ గలిగినప్పుడే వాటి సాఫల్యం వుంటుంది.

ఇలాగని పాతపద్ధతి వివాహాలు అదే వ్యాపారపద్ధతిలో సంపూర్ణంగా ఆచరించమని సమర్ధించటంలేదు. మన అధునాతనదృష్టికి సరిపోను, పాతపద్ధతిని సంస్కరించుకుని పెద్దల పరిశీలనా విచారణ ఆధారంగా జరిగే వివాహాలు ప్రేమ వివాహాలవలె విఫలం కావని ఘంటాపథంగా చెప్పవచ్చు. వివాహ సమయంలో వివాహంలో యెటువంటి లోపం లేకుండా అన్నీ సక్రమంగానే వుండి అర్ధాంతరంలో విఫలం అయ్యేవి వున్నాయి. వాటికి కారణాలు పైవాటిలో యేవైనా ఒకటి అయివుంటాయి.

మనం ఈ కాలంలో యెంతముందుకు పోయామని గర్విస్తున్నప్పటికీ వ్యాపార పద్ధతితో వరకట్నాలతోసాగే వివాహాలున్నాయి. ఈ వరకట్న విధానం చట్ట వ్యతిరేకం అయినప్పటికీ యిది మానవుల మనస్సులు మారనిదే అంతం కాదు. కేవలం చట్టమేదీన్ని నిరోధించలేదు. ఇందులో మానవ జీవితానికి సంబంధించిన నైతికాంశం కూడా వున్నది. ఈ నైతికస్థాయి సమాజంలో పెరగాలి. ఇందుకు ప్రతి స్త్రీ పురుషులూ తమచేతనైనంతవరకుప్రయత్నించాలి.★

---

సినిమా క్విజ్ జవాబులు

1. బంగారు పాప 2. మాలపిల్ల



తడిసిన ఈ వానరేయి గడుపలేను నేను

మదిలో మెదిలే మగువను మరువలేను నేను

దూరముగా మెరుపుతీగె తోరణాలు చూడగనే

నా ప్రేయసి నవ్విందని నలుదిక్కుల వెతికెదనే

అంతలోనె పెనుచీకటి అన్నిదెసల క్రమ్మగనే

నా చెలి నీలాలకురులు నటించెనని తలంచెదనే

అశాంతితో నాచూపులు ఆమెకొరకు పయనించును

మనసువిరిగి నిరాశతో మరలివచ్చి పవళించును

నింగిలోని మేఘాలూ తొంగిచూచు నయనాలూ

ఏకముగా ఆమెకొరకు ఏకధారగా ఏడ్చును

ఆమెలేని ఈ లోకము తామరలేని తటాకము

ఆమెలేని జీవనము ఆమని యెరుగసివనము

తడిసిన ఈ వానరేయి గడుపలేను నేను

మదిలో మెదిలే మగువను మరువలేను నేను.



# చక్రనేమి

గాజుల చప్పుడుకు ప్రక్కకు తిరిగాడు. చెల్లెలు ఇందిర గడప మీద కూర్చున్నదల్లా లేస్తూ, "నువ్వు చెప్పిన దంతా నిజమన్నయ్యా. కాని, అమ్మకు అర్థం కావు. అలాటివి తెల్సుకోవటానికి విద్యాజ్ఞాన ముండాలి.'' అంది.

నవ్వాడు పాణి. ''లేదమ్మా, నీకు చిన్నతనం మూలాన అలాగనుకుంటున్నావ్. చాలామందిచదువుకున్న వాళ్ళు కూడా అదే ధోరణి. చదువుకున్నంత మాత్రాన సంస్కారమబ్బదు. ఆది హృదయానికి సంబంధించినది

# కోడూరి కౌసల్యాదేవి

### జరిగినకథ

*ఇంగ్లీషు లెక్చరర్ చక్రపాణిని తిరుపతిలో మాధవి అనే విద్యార్థిని పరిచయం చేసుకుకుంది తన పుట్టినరోజు పార్టీకి ఆహ్వానిస్తుంది మాధవి అన్న కేశవరావు పాణిని కారులో ఎక్కించుకుని తమ ఇంటికి తీసుకువెడతాడు. మాధవి తండ్రి అనంతయ్య కోరికపై మాధవికి తన తీరికసమయాల్లో పాఠాలు చెప్పటానికి పాణి అంగీకరిస్తాడు.*

*పూర్వాచారపరాయణురాలైన చక్రపాణి తల్లికి ఈ కుటుంబంతో పరిచయం ఆట్టే ఇష్టం ఉండదు.* — ఇక చదవండి.

కొద్దిసేపు ఎవ్వరూ మాట్లాడలేదు.

“పద్మ జాడలేదేం?” అన్నాడు పాణి.

“పడుకుందన్నయ్యా. చాలా సేపైంది.”

“ప్చ్. ఇదెలా బాగుపడుతుందో నాకు బోధపడదు. త్రిప్పటా, నిద్రాను.”

“పోన్లే అన్నయ్యా. ఆదీవేళ క్రొత్త గనుకనా. చాలా ప్రొద్దుపోయింది. పడుకో” స్విచ్ తీసేసి, తలుపు జేర్లవేసి వెళ్ళిపోయింది ఇందిర.

మర్నాడు క్లాసులో పూర్వంవలె బోధిస్తున్న పాఠంపై దృష్టి నిల్పలేకపోయాడు పాణి. ఎప్పుడూ ప్రశ్న అడగటానికైనా ఆడపిల్లల బెంచివైపు చూడని అతడి దృష్టి ఆరోజు మాధవి ప్రవర్తన క్లాసు రూమ్‌లో ఎలా వుంటుందో పరిశీలించే వుద్దేశ్యంతో నాలుగైదు



సార్లు అటువైపు మళ్ళింది. పరిశీలించాక లోలోనఆశ్చర్యపోయాడుపాణి కొందరు తమ స్వంతగృహాలలో, స్వజనులమధ్య స్వేచ్ఛగా విచ్చలవిడిగా ప్రవర్తిస్తే ప్రవర్తించవచ్చు కాని, ఇతరుల మధ్య చాల అణకువగా వినయంతో ప్రవర్తిస్తారు. కాని మాధవీకుమారి కిటువంటి సంకోచాలేమీ వున్నట్టు కన్పించలేదు. క్లాసులో పాఠందారి పాఠందే — ఆవిడ అల్లరిదారి అల్లరిదే పుస్తకంలో ఏవేమిటో రాసి, సైగలుచేసి, ప్రక్క వాళ్ళ పుస్తకాలు దాచేసి నవ్వించీ — తానల్లరిచేసి మిగతావాళ్ళచేత కూడా చేయిస్తోంది. రుక్మిణన్న పిల్లకూడా అన్నిటిలో మాధవికి సై అంటే సై అంటోంది. చదువుతో నిమిత్తం లేకుండా కేవలం అల్లరి, వినోదాలకోసమే కాలేజీలో చేరే రకం అందరూ ఆడపిల్లల సీట్ల వెనకనే చేరారు. వాళ్ళని లెక్చరర్ పాఠాలకంటే ఆడవాళ్ళ చేష్ట లెక్కువ ఆకర్షిస్తున్నాయి. అలా కొద్దిసేపు చూచిన తరువాత చక్రపాణి ఇక ఓర్చుకోలేక పోయాడు. 'లెక్చరర్ లెక్కలేనట్లు అంత అల్లరేమిటి ? పీళ్లెందు కొస్తున్నట్లు కాలేజీకి ? దీని అంతేమిటో చూడా' లనుకొంటూ మళ్ళీ 'పీళ్ళు నా క్లాసులోనే ఇలా వున్నారా ఏమీ అననవే ధైర్యంతో ? లేక ఎప్పుడూ ఇంతేనా ?' అని ఆలోచించసాగాడు. లెక్చరర్‌గారు పరధ్యానంలో పడటంతో విద్యార్థులకు సంతోష మెక్కువైంది. ఇష్టాగోష్ఠి జరుపుకొనే వారు, పశుపక్ష్యాదుల కంఠాల ననుకరించే విద్య ప్రదర్శించేవారు — కాగితప్పు విమానాలు విసిరేవారు — ఒకటేమిటి ? ఒకటో తరగతి పిల్లలుకూడా చెయ్యనంత అల్లరి. క్లాస్‌రూమ్ చిన్న మార్కెట్‌గా తయారయ్యింది.

అప్పుడు తన పొరపాటు గుర్తించాడు చక్రపాణి పాఠం పుస్తకం మూసేసి బల్లపై విసురుతూ "సైలెన్సు ప్లీజ్" అని వురిమాడు. దానితో విద్యార్థులంతా ఒక్కసారి మౌనం దాల్చారు. కాని పాణి ముఖంలో ఎప్పుడూ అంత కోపం చూడని వారి ముఖాలపై స్పష్టంగా ఆశ్చర్యం తాండవిస్తోంది.

"అంతా సిద్ధంగా వుండండి. ఇంత వరకు చెప్పిన పాఠంలో కొన్ని ప్రశ్నలు వేస్తాను. సమాధానాలు చెప్పండి" అన్నాడు చక్రపాణి.

"మేం సిద్ధంగాలేం. మేం చెప్పలేం". అంటూ గొడవ ప్రారంభించారు, విద్యార్థులు.

ఆ గోలలో రెండు, మూడు కంఠాలు విద్యార్థినులవి కూడా వున్నట్టు తోచింది పాణికి. గద్దించాడు పాణి "మీరు తయారుగా రావటం, రాకపోవటం కాదు నాక్కావలసింది. ఇప్పుడు చెప్పిన పాఠంలోవే అడుగుతాను మీ రెంతవరకు నన్ను 'ఫాలో' అవుతున్నారో తెల్సుకోవాలినేను."




సమాధానం కోసం రెండు నిముషాలెదురు చూచాడు పాణి. ఎవ్వరూ మాట్లాడలేదు.

అదే అంగీకారంగా తీసుకొని ప్రశ్న వేశాడు. "ఒథెల్లో శీలం క్లుప్తంగా వర్ణించు"

చాలమంది స్తంభాలకుమల్లే నిల్చున్నారు సమాధానం చెప్పకుండా.

'ఎవరు చెప్పగలరసలు?"

తీవ్రంగా ప్రశ్నించాడు పాణి.

ముగ్గురు విద్యార్థులు, రుక్మిణి నే విద్యార్థినీ చేతులెత్తారు.

"సరే, నువ్వు చెప్పు" ఒక విద్యార్థిని అడిగాడు. అతడు చెప్పడం పూర్తైంది

"నేనింత శ్రద్ధ తీసుకుని, శ్రమపడి బోధిస్తూవుంటే, డెబ్భైమందిలో నల్గురికి మాత్రం అర్థమైంది. ఏమిటిది?" తీవ్రంగా అడిగాడు. క్లాసునంతనూ పరీక్షగా చూస్తూ ప్రశ్నించాడు పాణి.

"పాఠాలమీద మీకు నిర్లక్ష్యమని అనుకోనా?" రెట్టించాడు.

"హి హి హి హీ" పక్కికిలించారు అమ్మాయిల వెనుక కూర్చున్న సమూహంలో యిద్దరు కొంటెవిద్యార్థులు.

మండిపడ్డాడు పాణి "బోత్ ఆఫ్ యు గెటప్" (మీరిద్దరూ లేచి నిల్చోండి)

ఆ రంకెతో నవ్వులు మానేసి ఆ విద్యార్థులిద్దరూ లేచి నిలబడ్డారు.

"సిగ్గుపడి ఏడవాల్సింది పోయి ఎందుకా వెకిలినవ్వులు? మీరంతా అండర్ గ్రాడ్యుయేట్స్ అయ్యుండీ ఇప్పుడు విన్న పాఠంలో సంగతులిప్పుడే చెప్పలేకపోయా రంటే ఎంత

సిగ్గుచేటు ? పోనీ ఇది చెప్పండి చూద్దాం -

"ఒథెల్లోను, డెస్డెమోనాను దగ్గరకు జేర్చిన పరిస్థితు లేవి ? చెప్పు మాధవీ?"

ఏమాత్రం తొట్రుపాటు లేకుండా సీటులోంచి లేచి కిటికీబయట చెట్టును చూస్తూ నిల్చుంది మాధవి.

అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది చక్రపాణికి. "అలా నిల్చున్నావేం, సమాధానం ?"

ఆ ప్రశ్నకు నిజంగానే వులికిపడిన మాధవిదృష్టి ఇటుత్రిప్పి ఎదురు బెదురుగా చూసింది

ఒక్కక్షణం చూచాడుపాణి, "చెప్ప లేవన్నమాట ? సరే తర్వాత నువ్వు లక్ష్మీ"

లక్ష్మి తలడ్డంగా త్రిప్పింది చెప్పలేనన్నట్టు.

"నువ్వో రుక్మిణీ ?"

టకటకా చెప్పేసింది రుక్మిణి. 'ఈవిడకు అల్లరి, చదువు సమపాళ్ళలో వున్నాయి 'అనుకున్నాడు పాణి లోలోన

అందర్నీ కూర్చోమని అయిదు నిమిషాలు క్లాసునంతనూ కలయచూస్తూ కూర్చున్నాడు. తిరిగి విద్యార్థులలో ఇకిలింపులూ, సకిలింపులు ప్రారంభమయ్యాయి.

"క్లాసులో నలుగురుతప్ప మిగిలిన వారెవరూ 'లెసన్స్' 'ఫాలో' అవ్వడం లేదు. ఏమిటి దీనికి కారణం ?" అడిగాడు.

సమాధానం లేదు.

"అల్లరిచేస్తూ ఆడ్తూ పాడ్తూ చదవటాని కిదేం ఎలిమెంటరీస్కూలుకాదు. గుర్తుంచుకోండి. మర్నాడు క్లాసులో జరగవలసిన పాఠాన్ని 'ప్రిపేర్డై' రావాలి. లెక్చరర్ని 'ఫాలో' అవ్వడానికి ప్రయత్నించాలి. అర్థంకాని చోట్ల నిస్సందేహంగా లేచి అడగవచ్చు పురాణం విన్నట్టు వినకూడదు."

"మీరు చెప్పడమే పురాణం చెప్పినట్టు చెప్తున్నారు." అల్లరి సజ్జు ఒకడులేచి నిలబడి ధైర్యంగా ఎదురు సమాధానం చెప్పాడు.

ఒక్కక్షణం నిర్ఘాంతపోయిన చక్రపాణి వెంటనే తనను తాను సంబాళించుకున్నాడు.

"హౌ డేర్ యూ ? వాటీజ్ యువర్ నేమ్ ? (ఎంతధైర్యం, నీపేరేమిటి?")
అనడిగాడు కోపంగా.

"శ్రీహరి." కాలర్ సవరించుకుంటూ ధైర్యంగాచెప్పి తన స్నేహితులవైపు సగర్వంగా చూచాడు విద్యార్థి.

"ఎవరబ్బాయివు ?" అదే తీవ్రత పాణి కంఠంతో.

"రిటైర్డు జడ్జి రంగనాథంగారి యేకైక పుత్రుణ్ణి." బింకంగా మరొకసారి కాలర్ సవరించాడు. అనుయాయుల గొంతులు కొన్ని ఇకిలించాయి.

అంత కంతకు చక్రపాణిముఖం కోపంతో అరుణిమ దాల్చుతూంది. "జడ్జిగారి ఏకైక పుత్రుడవుగనుక నీకు క్లాస్ రూమ్‌లో నిద్రరావచ్చు, పాఠం పురాణంలా వినిపించవచ్చు, ఔనా ?"

శ్రీహరి ముఖంకూడా కోపంగానే వుంది, కాని మాట్లాడలేదు.

"ఇదే మొదటిసారిగనుక నువ్వన్న మాటను లెఖజేయక క్షమించి వదిలేస్తు న్నాను. ఇంకెప్పుడూ ఇలా జరక కూడదు, తెల్సిందా ?" అంటూ క్లాసు అందరి వైపూతిరిగి —

"పిల్లలు అల్లరి చెయ్యటమనేది తప్పుకాదు. కాని అల్లరి చేసేప్పుడు చెయ్యాలి. చదివేప్పుడు చదవాలి. వాటికీ ఒక హైము వుంది. అదీగాక మీరుబొత్తిగా అల్లరి చేయవలసినంత పిన్నవయస్కులు కాదు. ఈ రెండేళ్లూ గడచిన తర్వాత మీరే ఒకరికి బుద్ధులు చెప్పవలసిన వారౌతారు. అంచేత నే నేదో మిమ్మల్ని కించపర్చుతున్నాననుకోక చెప్పినదిఅర్థం చేసుకోండి. రెండుసంవత్సరాల క్రితం వరకూ నేనూ స్టూడెంట్‌నే. మీలా ఉపాధ్యాయులచేత బుద్ధులు చెప్పించు కొన్నవాడినే.'' బుద్ధులు చెప్పడం ముగించి, తిరిగి పాఠం చెప్పడానికి పుస్తకం చేతికి తీసుకుంటూ—

"ఓ, మర్చేపోయాను. నువ్వింకా నిల్చునే వున్నావే ? కూర్చోవయ్యా." అన్నాడు శ్రీహరిని.

'థ్యాంక్యూ" అంటూ కూర్చున్నాడు శ్రీహరి తలవంచుకుని

''కూర్చోమనకేం జెయ్యగలడులే !" గర గర మంది ఒక కంఠం.

పేజీలు త్రిప్పుతున్నపాణి చటుక్కున తలెత్తాడు. ''ఎవరది ?"

ఎవ్వరూ మాట్లాడలేదు ! "హూ ఈజ్ దట్ యిడియట్ ?''

"మర్యాదగా మాట్లాడండి మాస్టారూ ?'' లాష్ట్ బెంచిలోంచి కరుణా కరం అనే క్రిష్టియన్ విద్యార్థి చర్రున లేచాడు.

"ఇందాక మమ్మల్ని ఏడవలేని నవ్వు లంటే మర్యాదగా వుందాండి మీ విష యంలో మర్యాద పాటించడానికి !" పొగరుగా అడిగాడు.

సహనం పూర్తిగా కోలుపోయాడు చక్రపాణి "నో ఆర్గ్యుమెంట్సార్ నెసెసరీ" (తర్కం అనవసరం) గేటౌట్ ఆఫ్ మై క్లాస్ (నా క్లాసులోంచి బయటకు పో)'' అని అరిచాడు.

''ఎందుకెళ్ళాలి ?'' అదే పొగరుగా అడిగాడు కరుణాకరం

"గేటౌట్, ఐసే, (బయటకు పొమ్మంటున్నాను.")

పాణి కోపం తారస్థాయినందు కొంటూంది.

''ఐ వోంట్‌గో (నేను వెళ్ళను'') మొండిగా కూర్చున్నాడు కరుణాకరం.

''ఐ విల్ నెక్ యూ ఔట్ (మెడబట్టి గెంటుతాను బయటికి'') అంటూ లేచాడు పాణి కుర్చీలోంచి.

అసలే భయంకరంగావున్న ముఖాన్ని మరింత భయంకరంగాపెట్టి లేచాడు కరుణాకరం. "నీ క్లాసులోంచి పొమ్మనే కదూ, అంటావ్ ? సరే. నువ్విక్క డెంతకాలం పనిచేస్తావో నేనూచూస్తాను అసలు నీ పాఠం ఇక వినేదెవడు అని సవాలుచేస్తూ ''రండ్రా, ఇదేమిటో అంతు కనుక్కుందాం.'' అన్నాడు సహవిద్యార్థుల నుద్దేశించి. కరుణాకరం మాట అన్నదే తడవుగా పోలోమంటూ



విద్యార్థులంతా అతని వెనకనే క్లాసు బయటకు వెళ్ళిపోయారు. "చక్రపాణి డౌన్ డౌన్, ఇంగ్లీషు లెక్చరర్ డౌన్ డౌన్" అంటూ కాలేజీ అదిరిపోయేలాగ కేకలు వేస్తున్నారు.

ఆశ్చర్యంతో, అవమానంతో, నీరసంగా కుర్చీలో చతికిలబడ్డాడు పాణి.

'సాధారణంగా మొదలైన గొడవ ఎంతవరకూ పోయింది!

'ఉపాధ్యాయపదవి ఎంతహీనదశకు దిగజారిపోయింది?' అనుకొంటూ క్లాసులోకి మళ్ళీ ఎవరో వచ్చిన చప్పుడై తలత్రిప్పిచూచాడు. కరుణాకరం గుమ్మం దగ్గర నిల్చుని "వచ్చేందుకురావు." అని కళ్ళెర్ర జేస్తున్నాడు ఎవరిమీదో!

అప్పుడుపాణి తరగతివైపు చూచాడు. క్లాసులో విద్యార్థినులతోపాటు పదెనమండుగురు విద్యార్థులుకూడా వుండిపోయారు. వారిలో శ్రీహరి ఒకడు. 'గొడవవచ్చినదే శ్రీహరిమూలంగాకదా! అతడు వెళ్ళలేదేమ?' లోలోన ఆశ్చర్యపోతూ అతడివైపు చూచాడుపాణి. బహుశః అంతర్గత భావాలు ముఖంమీద ప్రతిఫలించాయేమో — అది గ్రహించిన శ్రీహరి తల ఒంచుకున్నాడు.

"సరే, యికమనం క్లాసులో కూర్చోవడం దేనికి? నడవండి" అంటూ లేచాడు పాణి. "మీరు నాతోరండి" అన్నాడు ఆడపిల్లల్నుద్దేశించి వాళ్ళు మౌనంగా అనుసరించారు పాణిని క్లాస్ రూమ్ దాటుతూండగానే గణ గణాగంట మ్రోగింది. అన్నిక్లాసులలోంచి బిలబిలా విద్యార్థులూ, ఉపాధ్యాయులూ బయటకు వస్తున్నారు. కరుణాకరం వగైరాల కంఠాలు కొంచెం అణిగాయి. పాణి ఒక్కక్షణంచూచి, "వెళ్ళగలరా? మీ వెయిటింగ్ రూమ్ వరకు రమ్మంటారా?" అన్నాడు విద్యార్థులను. సుఖముఖాలు



చూచుకోవడమేగాని. వాళ్ళనుంచి సమాధానంరాలేదు.

''మీరువెళ్ళండి మాష్టారూ, మేమున్నాంగా, ఫర్వాలేదు.'' అన్నాడు శ్రీహరి ముందుకువచ్చి.

ఒక్కలి ప్తపాటు అతడికండ్లలోకి చూచాడుపాణి. "సరే. వాళ్ళవిషయంలో ఏ అల్లరీ జరుగకూడదు. కూడావెళ్ళండి" అని మ్మరో మాటు క్లాస్ రిప్రజంటేటివ్‌నూ, శ్రీహరిని హెచ్చరించి తన రూమ్‌కు వెళ్ళిపోయాడు చక్రపాణి.

అదృష్టవశాత్తూ తరువాతగంట క్లాసు లేదు. ఉస్సురంటూ పుస్తకాలు బల్లపై పడవేసి కుర్చీలోవాలాడుతల రెండు చేతులతో పట్టుకొని.

''మిష్టర్ పాణీ! నీ క్లాసులో ఏమిటా గొడవ?'' అడిగాడు ముకుందం పాణి భుజంపై చెయ్యివేసి. సమాధానం చెప్పే లోగానే మరో నలుగురు లెక్చరర్లు, ట్యూటర్లు చుట్టూ జేరారు. పాణికి మరీ చిరాకన్పించిది. ''ప్లీజ్, కాస్సేపు నన్ను ఒంటరిగా వదిలేయండి, ప్లీజ్.'' అన్నాడు మరోవైపుచూస్తూ. అతడి విసుగుదల చూచి ఆ నలుగురూ దూర దూరంగా వెళ్ళిపోయారు

తిరిగి గంటకొట్టగానే అంతా క్లాసులకు వెళ్ళిపోయారు. చక్రపాణిఒక్కడూ మిగిలాడు. తలఒంచి నేలవైపుచూస్తూ ఆలోచిస్తూన్న వాడల్లా బూటుచప్పుళ్ళకు దృష్టి గుమ్మంవైపు సారించాడు. క్లాస్ రిప్రజెంటేటివ్ వెంకటేశం, శ్రీహరి అక్కడ తారట్లాడుతున్నారు పాణి పర్మిషన్‌కోసం. పాణి తమవైపు చూడ గానే అతడు రమ్మనకుండా ఇద్దరూ లోపలికొచ్చేశారు.

''మాష్టారూ. కరుణాకరం చాలా పెద్ద గొడవ లేవదీసేట్టున్నాడు." అన్నాడు రిప్రజెంటేటివ్ వెంకటేశం.

"అయితే : నన్ను బెదరించడాని కొచ్చావా?'' తీక్షణంగా అడిగాడు పాణి.

''లేదు మాష్టారూ.'' నొచ్చుకున్నాడు ఆ విద్యార్థి "మీరు క్రొత్తగా వచ్చారు ఇక్కడి సంగతులేమి మీకు తెలియవు; మీకు చెప్దామని వచ్చాను. నన్ను ధూర్తుడిగా జమకట్టకండి.''

''కూర్చోండి.'' కుర్చీలు చూపిస్తూ అతడిని పరీక్షగా చూచాడు పాణి. ''ఏమిటా గొడవలు?" అనడిగాడు.

''మన ప్రిన్సిపాల్‌కూడా క్రిష్టియనే. ఒక ప్రక్క కులమత నిర్మూలనకోసం మనం ఎంతగా పాటుపడ్తున్నామో మరో ప్రక్క అవంత తీవ్రంగా పెరిగిపోతున్నాయి. ఈయన హిందువులపై – ముఖ్యంగా బ్రాహ్మణుల విషయంలో ఏ చిన్నతేడా కన్పించినా కక్ష సాధించి తీరతాడు.''

"అయితే?" కనుబొమలు ముడివేశాడు పాణి.

"మీరు మధ్యాహ్నం క్లాసు రూమ్‌లో మామూలుగా 'ఎపాలజీ' చెప్పేస్తే క్లాసు

లకు ఎప్పటిలాగా హాజరౌతారట. లేకుంటే సమ్మెచేసి ప్రిన్స్‌పాల్ వరకు వెళ్ళి 'రిటెన్ ఎపాలజీ' తీసుకుంటారట."

ఆ మాటలు వింటూండగానే కోపం వచ్చింది పాణికి. "ఈ రాయబారం నువ్వు తెచ్చావన్నమాట! ఇందుకే బెదరిపోతాననుకున్నావా?"

జాలిగా చూచాడు వెంకటేశం, "క్లాస్ రిప్రజెంటేటివ్‌గా ఆ బాధ్యత నాపైన వున్నది మాష్టారూ. అంతేకాక, నాకు అర్హత లేకపోయినా మీకు సాహసించి సలహా యిస్తున్నాను; క్షమించండి. ఈ ధూర్తులతో గొడవలు తెచ్చుకోకూడదండి. అందుకే ఈ క్లాసులో ప్రతి లెక్చరర్ విధిగా పాఠం చెప్పుకు పోవడమేకాని ఎవరికొచ్చిందీ, రాలేదూ — అని గమనించరు." అని తల వాల్చుకున్నాడు

అతడి వినయానికి ముగ్ధుడయ్యాడు చక్రపాణి. "సరే, నీపై నాకేం కోపం లేదుకాని, ఇది ఎంతవరకు వెళ్తుందో నేనూ చూడదలచుకున్నాను మనిషిగా కొన్ని విలువలు కలిగివుండాలి కాని, తాటాకు చప్పుళ్ళకే బెదరిపోయి నీచులందరికీ దాసోహమని జీవించక పోతే నేం?"

"పోనీ మాష్టారూ! జరిగిన విషయమంతా మీరే ముందుగా చెప్తే ప్రిన్స్‌పాల్ తో?" శ్రీహరి సలహా సూచించాడు.

నవ్వాడు పాణి. "చెప్పవచ్చునుకో. కాని నావల్ల దోషం లేనిది ముందుగా నేనాయన నోటీస్‌లో కెందుకు వెళ్ళాలి? అయినా ప్రిన్స్‌పాల్ ఎటువంటివారో మీరే చెప్తున్నారుగా? ఏమైనా కానీ, నా కటువంటి కాళ్ళబేరాలతో నిమిత్తం లేదు. అవసరమైతే ఉద్యోగమే రిజైన్ చెయ్యగలను. ఇక మీరు వెళ్ళండి."

వెంకటేశం లేచి వెళ్ళిపోయాడు సమస్కరించి. శ్రీహరి ఏదో చెప్పబోయి సంకోచిస్తూ అక్కడే ఆగిపోయాడు.

"ఏం? ఏమిటి?" అడిగాడు పాణి అతడిని.

"నన్ను క్షమించండి మాష్టారూ. ఈ గొడవంతా అసలు నా మూలంగా వచ్చింది. ఇదివరకెవ్వరూ నన్నింత సున్నితంగా మందలించి మనస్సు మార్చలేదు. ఇంకే క్లాసులోనూ ఎప్పుడూ అల్లరి చెయ్యను." మెల్లగా స్పష్టంగా చెప్పాడు శ్రీహరి.

ఆశ్చర్యానందాలు లాస్యం చేశాయి చక్రపాణి ఎదలో. "పోనీలే, బాధలేని సౌఖ్యం లేనట్టే చెడుతో అనుబంధంలేని మంచివుండదేమో? నిజంగా జరిగినదంతా మర్చిపోయాను నేనిప్పుడు. నీలోమార్పుకు చాలా సంతోషిస్తున్నాను. వెళ్ళిరా" శ్రీహరిభుజం తట్టాడు పాణి ప్రేమగా. ఆ స్పర్శలోని వాత్సల్యం ఆ రెండు హృదయాలకే తెలియాలి.

నమస్కరించి, మెల్లగా వెళ్ళిపోయాడు శ్రీహరి.

అనుకున్నట్టుగానే ఇంటర్వెల్‌లో ప్రిన్సిపాల్ దగ్గర్నుంచి కబురు వచ్చింది పాణికి. అతడు వెళ్ళేసరికి ప్రిన్సిపాల్ రూమ్‌లో ప్రిన్సిపాల్, ఇంగ్లీషు డిపార్టుమెంట్ ఛీఫ్ కూర్చుని వున్నారు. చక్రపాణిని ఒకసారి ఎగా దిగా చూచి కూర్చోమన్నాడు ప్రిన్సిపాల్. 'విష్' చేసికూర్చున్నాడు చక్రపాణి. ప్రిన్సిపాల్ ప్యూన్‌ను పిలచి ఏదోచెప్పి పంపాడు. నాల్గు నిముషాలలో అతడు కరుణాకరం, వెంకటేశాలనూ మరొక నలుగురు విద్యార్థులనూ వెంటబెట్టుకొచ్చాడు.

"ఈ రోజు మీరు టేకప్ చేసిన సెకండ్ బి. ఎ క్లాస్‌లో ఏదో గొడవ జరిగిందంటున్నారు ఈ స్టూడెంట్స్?'' అన్నాడు పాణి నుద్దేశించి ఇంగ్లీషు డిపార్టుమెంట్ హెడ్.

పాణి ఒక్కసారి ప్రిన్సిపాల్ వేపు చూచాడు. అతడూ తన సమాధానం కోసమే నిరీక్షిస్తున్నాడు తీవ్రదృష్టితో.

వినయంగా జవాబు చెప్పాడు చక్రపాణి, ''గొడవ ఏమీ జరగలేదండి, కాని చూడగా వీళ్ళకు ఏదోగొడవ చెయ్యాలనే ఉద్దేశ్య మున్నట్లు కన్పిస్తోంది.''

''ఏమంటావ్ కరుణాకరం?'' ప్రిన్సిపాల్ కరుణాకరంవైపు తిరిగాడు.

''ఆయన చాలా అనుచితంగా మాట్లాడారు. క్లాసందరూ సాక్ష్యం చెప్తారా విషయం.''

''మీరేమైనా వివరించి చెప్తారా?'' ఛీఫ్ ప్రశ్నించాడు పాణిని.

"ఏమీలేనిదే వివరణ చెయ్యడానికి మాత్ర మేముంటుంది? ఫిర్యాదుచేసిన వ్యక్తే వివరించుకోవడం సబబనుకుంటాను." అన్నాడు పాణి

ప్రిన్సిపాల్ నుదిటిచెమట ఒత్తుకుంటూ ఛీఫ్‌వైపు చూచాడు. అతడు కొంచెం ఆశ్చర్యం ప్రకటిస్తున్నట్లు ప్రిన్సిపాల్ వైపు చూచాడు.

"ఆయన నన్ను మెడబట్టి క్లాసు వెలుపలికి గెంటి వేస్తానన్నారు." అన్నాడు కరుణాకరం ప్రిన్సిపాల్‌తో, "ఇదుగో, క్లాస్ రిప్రజంటేటివ్, ఇతడి నడగండి" ప్రిన్సిపాల్ కళ్ళు వెంకటేశం మీదికి త్రిప్పాడు.

వెంకటేశం గొంతు సవరించుకున్నాడు. "శ్రీహరి అనే విద్యార్థి పాఠం వినకుండా అల్లరిచేస్తున్నందుకు మందలించారు మేష్టారు. శ్రీహరి సిగ్గుపడి వూరుకున్నాడు కాని అనవసరంగా కరుణాకరం వెనుకబెంచీలోనుంచి ఏకవచనసంబోధనతో మేష్టార్ని అగౌరవంగా మాట్లాడాడు, వారికి కోపంవచ్చి అతడ్ని 'క్లాసులోనుంచి వెళ్ళిపో' మన్నారు, కరుణాకరం వెంకెలసంజేసి తిరిగి వెంకెగా మాట్లాడడంతో మాష్టారు

కోపంలో ఒ మటకు గెంటుతానన్నారు, తప్పంతా మీ విద్యార్థులదే నండి ''

వెంకటేశం మాటలకు ప్రిన్స్‌పాల్, కరుణాకరాల ముఖాలు మాడిపోయాయి పాణి తనకు సంబంధంలేనట్టు ఎటో చూస్తున్నాడు

''ప్రస్తుతానికి మీరు వెళ్ళండి '' అన్నాడు ప్రిన్స్‌పాల్ విద్యార్థుల్ని. వాళ్ళు వెళ్ళిపోయారు.

"మీరేమంటారు ?" అన్నాడు ప్రిన్స్‌పాల్ చక్రపాణి ముఖంలోకి సూటిగా చూస్తూ.

"నేను అనడం అనవసరం. మీరేమంటారు ?'' చక్రపాణి అదే ప్రశ్నను త్రిప్పి అడగడంతో ప్రిన్స్‌పాల్ వుడికిపోయాడు. నొక్కి నొక్కి అన్నాడు; ఒక్కొమాటే – "ఉద్యోగికి వుండవలసినది అహంకారం, అతిశయం కాదు, వివక్షతా, విజ్ఞతలు."

"క్షమించండి. అభిమానాన్ని, అహంకారాన్ని ఒకటిగా భావిస్తున్నట్టున్నారు మీరు. పొట్టకూటికోసం ఉద్యోగం చేస్తున్నాడనే తేలికభావంతో, పై వాళ్ళ అధికారంతో క్రిందివాళ్ళు ఆక్షేపణలతో బాధిద్దామనుకొనే నేటి ప్రపంచంలో వివక్షతా వివేకాలకు తావెక్కడిది ?"

"మీ వ్యాఖ్యానంకాదు నే నడిగింది. అసలు ఆ పరిస్థితి ఎందుకు రావాలి ? లెక్చరర్ అసమర్థుడైతేనే విద్యార్థుల నోళ్ళు లేచేది. క్లాసు నదుపులో పెట్టలేక ఎదురు వాళ్ళను నోటికి వచ్చినట్టు అంటే పడ్తారా ? వీళ్ళందరూ ఎంతంత జీతాలు కట్టి చదువుకుంటున్నారో, ఎంతంత ఉన్నత కుటుంబాలలోవారో మీకు తెలుసా ? ఒక్కొక్కళ్ళెంతెంత ధనవంతులో ఎరుగుదురా ?"

"తెలియదు, తెలియనవసరం లేదు కూడా ' నెమ్మదిగానే చాలా సునిశితమైన



సమాధానం చెప్పాడు చక్రపాణి. "ఒక్కొక్కరి కెంతెంత ధనముందో నా కనవసరం. నాకు కావలసినదల్లా వారు వెచ్చించే ధనానికితగిన ప్రతిఫలం పొందుతున్నారా, లేదా ? — అని తెల్సుకొని, వారు దానిని పొందేట్టు చేయడమే. నేను పొందుతున్న ధనానికి ప్రతిగా నాపై వుంచిన బాధ్యతను నెరవేర్చుతున్నానా, లేదా - అనే ఆత్మపరిశీలనే నా కర్తవ్యం. నా విద్యను నిష్కల్మషంగా, బాధ్యతాయుతంగా నలుగురికీ బోధించడమే నా ధ్యేయం !"

"మిస్టర్ పాణీ !'' ఛీఫ్ అందుకున్నాడు. "మీరూ యువకులే. యౌవనదశ అనేక ఆదర్శాలతో, ఊహాగానాలతో సతమత మౌతుంటుంది. కాని జీవితంలో ఎదురయ్యే యదార్థాలు అందుకు భిన్నంగా వుంటాయి. ఈ ఉల్లాసీదాలను మనం తట్టుకో గలగాలి. ముక్కుకు సూటిగా పోవాలనే భావంతో మనమొక బాటపై నడుస్తున్నామనుకోండి; ఎదురుగా అతి వేగంగా పరుగెడ్తూన్న రైలో, కారో వస్తూంటే మనం మనధ్యేయం మార్చుకోక తప్పుతుందా ? విధిగా దాని ఆధిక్యతను అంగీకరించాలి !"

నీరసంగా తలెత్తాడు చక్రపాణి, "సార్ ! ఇదంతా ఏమిటో నాకు బోధపడడంలేదు. మీరు చెప్పేదేదో సూటిగా చెప్పండి."

"మీరు క్షమాపణపత్రం యిస్తేకాని వాళ్ళు స్ట్రైక్ మానరు. మీ తొందర మాటలకు మీరు క్షమాపణ చెప్పుకోవాలి."

"క్షమించండి. అది నా వలన కాదు. తరగతిని అదుపులో పెట్టాలనీ, సమర్థతనీ ఇందాక యేమేమో చెప్పారుమీరు. మరి నేను ఆ విధంగా చేయప్రయతిస్తే నేగా యిదంతా ? విధినిర్వహణకు దక్కే ప్రతిఫలం యిదా ? విద్యార్థిని పాఠం విషయంలో ప్రశ్న అడగడమే నేరమనేచోట అదుపులో పెట్టేదెలా ? క్రమశిక్షణ నిలబెట్టడమెలాగ ? లక్షాధికారి బిడ్డ అయినా, భిక్షాధికారి బిడ్డ అయినా గురువు సమక్షంలో సమానులే కదా !"

"అవన్నీ వెనుకటిరోజులు మిస్టర్ పాణీ ! మీరుబాగా ఆలోచించండి. ఒక్కో మనిషి తలచుకున్నాడంటే సంస్థ సంస్థనే ఒక్క వూపు వూపి వదలిపెడతాడు. సామాన్యమానవులు గాలిలో దూది పింజెల్లా ఎగిరిపోతారు.''

''క్షమించండి. నాకా భయం లేదు. మీరు ఆమోదిస్తే ఇప్పుడే నాఉద్యోగానికి రాజీనామా యిస్తాను.'' అంటూలేచాడు పాణి కుర్చీలోంచి.

''తొందరపడకండి. మీకు రెండు రోజులు వ్యవధి యిస్తాను. బాగా ఆలోచించుకొని ఒక నిర్ణయానికి రండి. ప్రస్తుతానికి మీరు వెళ్ళవచ్చు.''

నమస్కరించి మౌనంగా ఇవతలకు వచ్చేశాడు పాణి.

## 6

సాయంత్రం కాలేజీనుంచి సరాసరి చక్రపాణి ఇంటికి వచ్చేశారు వెంకటేశమూ, శ్రీహరి. హాలులో కూర్చోపెట్టి చెల్లెల్ని కాఫీతెమ్మని కేకేశాడు పాణి

''అబ్బే, వద్దండీ. కొంచం మాట్లాడి వెళ్ళిపోదామని.'' నసుగుతూ నిల్చున్నారు

పాణి నవ్వుతూ, "అలా సందేహిస్తారేమిటి ? కాలేజీలోనే మన గురుశిష్య బాంధవ్యం, మిగిలిన వేళల్లో స్నేహితులమే, కూర్చోండి.''

వెంకటేశం కొంతవిచారంగా కొంత సంతోషంగా అన్నాడు. "మీతో యింత ఆలశ్యంగా, అందులోనూ ఈ విధంగా సన్నిహితత్వం ఏర్పడడంవిచారకరంగా వుంది మాష్టారూ. ఈ రెండుమూడు నెలలనుంచీ అసలు మీ గురించి ఏదో ఒక లెక్చరర్‌గా తప్ప మిగిలిన వేమీ ఆలోచించలేదు.''

చిన్నగా నవ్వాడుపాణి "నేనైనా మీ గురించి ఎన్నడూ అంతశ్రద్ధ తీసుకోలేదు. పాఠం చెప్పుకు పోవడమే కాని. అంతగా ఏమీ పట్టించుకునే స్వభావం కాదు నాది. ఇదుగో - చిన్నవిషయం కలుగజేసుకున్నందు కింత రాద్ధాంతమైంది." అన్నాడు నవ్వుతూనే.

"దీనికంతకూ కారణం నేను మేష్టారూ. ఇంతవరకూ నన్నూ, నా అల్లర్నీ అసహ్యించుకుని తిట్టి రెచ్చగొట్టినవాళ్ళే కాని, ఈ మాదిరిగా మృదువుగా మనస్సు మార్చినవారు లేరు మీకు చాలా కృతజ్ఞుడిని ఇంకెప్పుడూ అలా అల్లరిగా ప్రవర్తించను." అన్నాడు శ్రీహరి, జాలికొలిపే కంఠస్వరంతో.

"బాగుందయ్యా నీధోరణి." తేలికగా నవ్వేశాడు చక్రపాణి. "నేను మాట్లాడినది ఏదో కొద్ది. అదే నీ అల్లరి ధోరణిని మార్చివేసింది. అదే మరొకనిలో అల్లరి ప్రవృత్తిని రేగగొట్టి విజృంభింప జేసింది చిత్రంగాలేదూ ? ఒక నీతిబోధకమైన మాట చెప్పడంలో కాదు గొప్పతనం — దాని పరిగ్రహీతలలో వుంటుంది. ఒక నవలే తీసుకో — లేక చలనచిత్రమే తీసుకో. అనేక వర్గాలవారు, భిన్నభిన్న మనః ప్రవృత్తులు కలవారు చదువుతారు చూస్తారు. కాని అందరినీ ఒకేవిధంగ ఆకర్షించవది. నీకు మహోన్నతంగ కన్పించినది నాకావిధంగా కన్పించక పోవచ్చు. నిన్ను కదలించి వేసిన ఘట్టాన్ని మరొకరసలు లెఖ్ఖజేయరు అందులోని మహోత్కృష్టమైన నీతి బోధన ఒకరిలో చెరగని ముద్ర వేస్తే ఇంకొకరికి ఛాదసంగా తోచవచ్చు ఉత్తములు మంచిని గ్రహిస్తారు ; రెండవ రకం వారు దానికి వ్యతిరేకంచేతనే ఆకర్షింపబడతారు. కేవలం ఒక మాటా

ఒక రచనే మానవ ప్రకృతిని మార్చ గలిగివుంటే, ఈ సరికి ఈ భూతలం అంత వైజయంతంగా మారి పోయి వుండేది !"

"చాలా ఘనంగా చెప్పావు మాష్టారూ మీరేది మాట్లాడినా ఇలాగే మాట్లాడుతారు. క్లాసులో పాఠం చెప్తూ చెప్తూ ఒక్కో పాత్రను గురించి మీ రిలాగే చాలా సున్నితంగా నిశితంగా విమర్శిస్తారు." అన్నాడు వెంకటేశం.

అంతలో ఇందిర కాఫీలు తెచ్చింది.

"మా చెల్లెలు ఇందిర. స్కూల్ ఫైనల్ చదువుతూంది." "నా స్టూడెంట్స్ వెంకటేశం, శ్రీహరీ, బి. ఎ. చదువుతున్నారు.'' అంటూ పరిచయం చేశాడు పాణి. ఇందిర వాళ్ళతో చనవుగా నవ్వడం చూచి అనుమానం వేసిం దతడికి. "మీ కిదివరకే పరిచయా లున్నాయేమిటి ?'' అనడిగాడు.

"మా ఫ్రెండ్ రుక్మిణీ......" అని ఇందిర ఏదో చెప్తోంటే సైగ చేశాడు వెంకటేశం ఇందిరకు, పాణికి చాటుగా చెయ్యి అడ్డుపెట్టుకుని. అది గమనించ నట్లే నటించాడు చక్రపాణి. "ఏ రుక్మిణీ ?'' అనడిగాడు చెల్లెల్ని.

"మీ స్టూడెంట్ రుక్మిణీ నన్నయ్యా, వెంకటేశంగారికి బంధువే. ఇక్కడ చూస్తుంటాను వీరందర్నీ"

పాణి ముఖకవళికలు ఆశ్చర్యం ప్రదర్శించాయి, ''రుక్మిణి బి. ఎ చదువుతూంది. నీ స్కూల్ ఫైనల్‌కూ ఆవిడకూ స్నేహ మేమిటి ?" అనడిగాడు నవ్వుతూనే.

"మీలాగ ఆడవాళ్ళు చదువులు, వయస్సులు, సరిసమాన హోదాలు చూచుకొని స్నేహాలు చెయ్యరు. మా మనస్సులు ఇట్టే కలిసిపోతాయి." అని విసురుగా లోపలికెళ్ళిపోయింది పాణితోబాటు వెంకటేశమూ, శ్రీహరీ కూడ నవ్వారు.

కాఫీ తీసుకుంటూ మళ్ళీ సంభాషణ కుపక్రమించాడు పాణి. "ఇంతకూ నేను చెప్పేదేమంటే శ్రీహరీ — జరిగినదానికి నువ్వేమీ బాధపడకు. మామూలుగా అయినదానికంటే ఈవిధంగా కలిగిన పరిచయానికే ఎక్కువ ప్రాధాన్య ముంటుంది. కొన్ని తప్పుల ఫలితంగా ఒక ఒప్పు జరుగుతుందన్నట్లు......" సంభాషణ సగంలోనే ఆపివేయవలసి వచ్చింది. వీధిలో అనంతయ్యగారి నల్ల డాడ్జి హారన్ కొట్టింది.

(సశేషం)

Printed and Published by Sri A Sudhakar Rao from Yuva Press, 5-9-88, Public Garden Road, Hyderabad-1. Controlling Editor Sri "CHAKRAPANI"

## ఇతరములు

| | | |
|---|---|---|
| కడపటి మాట | డిటెక్టివ్ నవల | 1.00 |
| మాయమైన మణిహారం | ,, | 1.00 |
| తప్పిపోయిన పెళ్ళికూతురు | ,, | 1.00 |
| తగినశాస్తి | ,, | 1.00 |
| పారిపోయిన యుద్ధఖైదీ | ,, | 1.00 |
| దివాళా ఎస్టేటు | ,, | 1.00 |
| అంతులేని ఆశ | ,, | 1.00 |
| ఈస్టిలిన్ | నవల | 2.25 |
| తప్పిపోయిన మనిషి | ,, | 1.00 |
| ఆనావిలర్ | ,, | 1.00 |
| ఆరితేరిన ఘటం | కథలు | 1.00 |
| తిర్పు | ,, | 1.00 |
| సిపాయి కథలు | ,, | 1.00 |
| మూగజీవాలు | ,, | 1.50 |
| చుక్కలూ-గీతలూ | ,, | 1.25 |
| హెర్ హైనెస్ | ,, | 1.25 |
| ప్రైడ్ & ప్రిజుడిస్ | ,, | 1.25 |
| శెలవు | ,, | 1.25 |
| బీరకాయపీచు | ,, | 1.25 |
| ఋణవిముక్తి | ,, | 1.25 |
| కళ్యాణి | నాటకం | 1.00 |
| విశ్వంపెళ్ళి | ,, | 1.25 |
| జ్యోతిర్మయి | ,, | 1.25 |

## శరత్ నవలలు

| | | |
|---|---|---|
| దేవదాసు | | 1.75 |
| నవవిధాన్ | | 1.25 |
| బడదీది | | 1.00 |

## రవీంద్రనాథ ఠాకూర్

| | | |
|---|---|---|
| కరుణ | నవలిక | 1.50 |

# యువ కన్సర్న్స్,

**2-1-194, సైఫాబాద్; హైదరాబాద్-4.**

